# పరంజ్యోతి

(నవల)

Printed 10,000 Copies on Neepa Newsprint supplied by
The National Newsprint and Paper Mills, Neepanagar
on 5-9-59 for Andhra Ratna Book Depot, Tenali-2

రచయిత

**మానం ఉమాకాంతం**

ఫోన్ నెం. 64

పబ్లిషర్సు:

**ఆంధ్రరత్న బుక్ డిపో,**

మారీసుపేట, **తెనాలి-2**

**Rs/- 1-25**

మొదటి ముద్రణ 1960 జనవరి





## అంకితము

పరిణయమాడి, నన్ను పదిరెండు వత్సరములు,
పరమ హార్షాబ్ధి నోలలాడించి, ప్రేమించి,
నాకము నలంకరించిన పవిత్రచరిత, సుగుణ
భరితయగు నా ధర్మపత్ని కీ॥ శే॥
మానం బసవపున్నమ్మకు



ఈ నవలలోని అంశము, నామములు కేవలము కల్పితములుగాని ఏ ఒక్కరిని ఉద్దేశించి వ్రాయబడినవికావు.



ముద్రణ :
ఆంధ్రరత్న పవర్‌ప్రెస్, తెనాలి-2

# పరంజ్యోతి

## 1

పూర్వాంబుధి ప్రాంతమున హేమపురంబను పట్టణముగలదు.

అది విశాలమై నిడుపుగలిగిన రాజవీధులచేతను ఆకాశము నొరయునట్టి ప్రాకార సౌధగోపుర మంటపాదులచేతను నిండుకొనియుండెను. సూర్యచంద్రులులేని కాలమునందైన నా పట్టణమునకు చీకటి వ్యాపింపక నా ప్రాకారకుడ్యముల ధావళ్యముచే పురమంతయు ప్రకాశించుచుండెను. ఆ పట్టణము మధ్య రాజనగరు గలదు. దానిచుట్టు మిక్కిలి యెత్తైన ప్రాకారముండెను. దాని ద్వారము నవరత్నములు లతలుగా బిగింపబడిన ద్వార శాఖలు గలిగి చూపరుల చిత్తంబుల నాకర్షించుచుండెను. ఆ పట్టణాధిపతి నామము చంద్రవర్ధనుడు. ఈయనకు నొక కూతురుండెను. ఆమె చక్కనిచుక్క. రత్నములకుప్ప. సుగుణములరాశి. ఆమెను జూచిన ప్రతి మనుజుడును యూర్వశి, మేనక, రంభ, తిలోత్తమాదులలో నొకతెయో, లేక రతియో, శచియో, లక్ష్మియో ననుకొనక తప్పదు. ఈమెకు పదియారు సంవత్సరము లుండెను. ఈ కాంత శరీరమెల్లయెడల నూతనకాంతి విస్తరిల్లి యవ్వనలక్షణములు గన్పట్టుచుండెను. గన్పట్టుటయే కాదు; సంపూర్ణ యవ్వనియనియే గ్రహింపనగును. పేరు మనోరమ. చిన్నతనముననే తల్లి స్వర్గమలంకరించెను. అప్పటినుండి తండ్రి యగు చంద్రవర్ధనుడే మిక్కిలి గారాబముతో బెంచుచుండెను. ఈయనకరువది సంవత్సరము లుండెను. వృద్ధుడగుటచే తన పుత్రికను త్వరలో పెండ్లిచేసి తన ముద్దు తీర్చుకొనవలయునను కోరికతో నుండెను. కాని తానొకటి దలంచిన దైవమొకటి

దలంచినట్లు విధి యట్లు సాగనీయలేదు. ఒకరోజు సాయం కాలమున చంద్రవర్ధనుడు సింహాసన మధిష్ఠించియుండగా ఇరు వైపుల నిద్దరు సేవకులు వింజామరలు వీచుచుండిరి. ముందువైపు సమీపమున మంత్రియగు జయవర్మయొక్క పీఠముపై, మరి రెండు పీఠముల న్యాయవాదులును, తదితర బంధుమిత్ర సైన్యాధిపతులు వారివారి స్థానముల గూర్చొనియుండిరి. రాజాజ్ఞ లేని దెవ్వరు కోటలోనికి రాకుండుటకై పైభాగ మున కత్తులు బిగింపబడిన కర్రలు పట్టుకొని కోటద్వారమున కిరువైపుల భటులు నిలువంబడిరి. ఇంత ప్రజాసమూహముం డియు వా రెందరలకో నిశ్శబ్దముగానుండిరి. కాని వారంద రేదియో దీర్ఘాలోచన చేయుచున్నట్లు గాన్పించుచుండెను. ఆట్టిసభను విలోకించిన నెట్టివానికైన వారి మనంబుల దుఃఖ భయరోషములు నిండుకొనియుండెనని తోపకమానదు. అప్పుడు సంధ్యాసమయము కావచ్చినది. సూర్యకిరణములు శాంతస్వభావముదాల్చి సుధాంశు కిరణముల వన్నెకుమిన్న యైన గోపురమంటపముల చివరిభాగముల నెఱ్ఱగా జేయు చుండెను. పశ్చిమ దిశయందు దుదయించిన రక్తవర్ణము భూమి నంతయు నాక్రమించుకొనుచుండెను. పగలంతయు చేసిన ప్రయాణశ్రమచే నలసటచెందె విశ్రాంతి కొరకు బోవు చున్నాడో యన భానుడస్తాద్రి జేరెను. నా టెంపులకోగాని ప్రొద్దుపోయిన తదుపరిమాట నాటిట్లనే యాలోచనాయుక్త చిత్తులైయుండిరి. అట్లు కొంతకాలముండి చంద్రవర్ధనుడు మరల నొక్కమారు తన [illegible] లేఖను [illegible] సభాసదులారా! భానుడస్తాద్రి జేరెను గాన, కర్తవ్యము రేపాలోచింపవచ్చును. మీ రింటికిబోయి తగు జాగ్రత్తగా నుండుడు. నేను నా ముద్దుపట్టి సౌధమున కరుగవలెనని వారట్లు రాజాజ్ఞ శిరమున నిడుకొని తమతమ గృహోన్ముఖులై పోయిరి. పాపము వృద్ధరాజు తన పుత్రికాంతఃప్రదేశపుత్రోవబట్టి పాద ములు తడబడ చింతాక్రాంతుడై యా సౌధమును సమీపించి దాని మెట్లెక్కి [illegible] లోపల ప్రవేశించెను.

తండ్రిని జూచుటతోడనే మనోరమ పాన్పుపైనుండి లేచి తండ్రిని కౌగలించుకొని యాతని దీనవదనమును వీక్షించెను. ఆమె నంగాలు జల్లుమనెను. తండ్రియొక్క దీనస్థితికి కారణ మడిగెను. కాని చంద్రవర్ధనుడా దుర్వార్త చెప్పలేక పోయెను. కొంతకాల మట్లే నిలచియుండిరి. మనోరమ మరల మరల నడిగెను. అంత చంద్రవర్ధను డమ్మా! నా కొరకు నేను చింతింపను. నీవే రాజకుమారుని త్రికరణశుద్ధిగా వరించియుంటివో యట్లే నెరవేర్పవలయునని యూహించి యుంటినిగాని యిపుడు నీ ప్రేమలతను త్రెంపవలసి వచ్చునేమో, నీ కాశాభంగము కలుగునేమోయని దుఃఖించుచుంటినని కన్నీరు విడచెను. మనోరమ కీ మాటలు మర్మంబున శల్యంబులై నాట శరీరమంత చెమటలు గ్రమ్మ మాటలు పెగలక. ఆ! ఏమీ! నా ప్రేమలతను త్రెంచుటయా! నా కాశాభంగము కలుగుటయా? ఇక నోట మాట రాకపోయెను. కన్నుల నుండి వేడి నీరు వక్షస్థలమునుండి జారుచుండెను. పాపము ఎల్లకాలములందు శుకశారికా నినదంబుల మనోహరంబుగ విని సంతసించు నీ లతాంగి యిట్టి యశాభంగమగు ఘోరవార్త విని సహింపగలుగునా? ఇట్లు వారి హృదయములు శోకముచే నిండుకొనినపై కృశాంగియేడ్పు లతిశయించుచుండెను. ఆమె కిరు ప్రక్కల దాసీజనంబులు పొంగి పొరలివచ్చు నేడ్పుల మ్రింగు కొనుచు నిర్విణ్ణులై జూచుచుండిరి. కొంతవడికి మనోరమ తండ్రిని కారణమడిగెను. చంద్రవర్ధనుడు నోట నుడువజాలక తన చేతనున్న లేఖ నిచ్చెను. దాని నందుకొని మనోరమ కన్నుల నీరుగ్రమ్మ యొక యక్షరము రెండక్షరములుగా నగుపడుచుండ జదువుకొని తండ్రీ! నీ ప్రాణహానికే నేను జనించితినా? అనెను. చంద్రవర్ధనుని సర్వావయవములు శిథిలములై పోయి నటులతోచెను. అప్పటికి రాత్రి పదిరెండుగంటలకాలమైనది. పట్టణములో నుండు జనులందరు సుషుప్త్యవస్థను జెందుచుండిరి ఒక పట్టణమున మనుష్యులేకాదు. ప్రపంచములోనుండు ప్రాణి సమూహమంతయు నిద్రావస్థలోనుండు సమయమిదియే. వారి

వ్యాకులాయత్తచిత్తములకు తగినట్లు సౌధసమీపమున భూరు
హంబుపై నులూకంబు కాకంబులపైబడి చీకాకు జేయుచు
మరింత భీతిని గల్పించుచుండెను. చంద్రవర్ధనుడు మనోరమతో
నేమిరెహో చెప్పబోయెను. ఇంతలో పట్టణమున జనకల్లోల
ములు చెలరేగెను. ఏమీ యాందోళనయని వృద్ధరాజు తన
హృత్కమలమున భయశోకములు రెట్టింప వెనుకకు దిరిగిచూడ
బోయి తూలి కూలబడెను. మనోరమ పెద్దపెట్టున బావురని
రోడ్చెను. అందరు గోలగానేడ్చిరి. చంద్రవర్ధనుడు మెల్లగా
లేచి దుఃఖింపకుమని మరల నాలకించి వినెను. పట్టణమున
ప్రజల కలకలము హెచ్చుచుండెను. వారి కేమియు నర్థమగుట
లేదు. చంద్రవర్ధనుని మనస్సు చేయివెట్టి కలచి నట్లయ్యెను.
కోటపైనొక్కమారు వీక్షించెను. కోట గోడలమీద మధురము
కొరకువచ్చు మక్షికములవలె క్రిక్కిరిసినట్లు లెక్కకు మిక్కుట
మైన జనసమూహములతో నిండి పాలసముద్రతరంగములవలె
తెల్లనై నిలువంబడి కొందరు కోటగోడలను త్రవ్వి చదును
చేయుచుండిరి. మరికొందరు త్రవ్వగావచ్చు బెడ్డలను గైకొని
పట్టణముపై విసరుచుండిరి. మరికొందరు వెడల్పు రాళ్ళను
చేతుల నందికొని పురమునందు శిలావృష్టిని గురిపించుచుండిరి.
కొందరు కరిఘటలతో కవాటమును ఛేదించుకొని రాజనగరు
ప్రవేశించుచుండిరి. మరికొందరు భీకరంబుగ కేకలు వేయుచు
సైన్యముల పురికొల్పుచుండిరి. ఇదంతయు జూచి రాజేంద్రుడు
హృదయమదరుచుండ కొంతవడికి ధైర్యము దెచ్చుకొని సౌధము
నుండి క్రిందికి దిగివచ్చెను. మనోరమ కన్నులిక నీ ఘోరమును
జూడలేక మూతబడెను. ఆమె కప్పుడు భగవద్ధ్యానమే కర్తవ్య
మాయెను. అంతట చంద్రవర్ధను డంధకార బంధురమగు
నానిశి కొండలమందు డెంపమున శుందునకుబోయినాలకించగా
రోషభీషణ వాక్యములచే సేనలపురికొల్పు నొక ధీరుని వాక్య
ములు వినబడెను. ఆ మాటలు తన సేనాధిపతియగు రామోజీ
వాక్కులని గ్రహించెను. ఆ వృద్ధరాజునకు కొంత ధైర్యము
కలిగెను. మరల నొక్కమారు రాసైన్యమునకు దృష్టిబరపెను.

తన సేనలు విరోధి వర్గమును జుట్టు ముట్టెను. సైన్యాధిపతి యగు రామోజీ ఖడ్గహస్తధారుడై శాత్రవుల శిరంబులు ఖండించుచు కోట దిక్కునకు వచ్చుచుండెను. అట్లు వచ్చు రామోజీని రిపుసైన్యాధిపతి యెదుర్కొని తన విద్యాకౌశలము మెరయ యుద్ధంబు జేయుచుండెను. ఒక దిక్కున తన మంత్రియగు జయవర్మ రథారూఢుడై యరివీరుల శిరంబులు క్షితింగూల శరవర్షము గురిపించుచుండెను. వేరొక దిక్కున కరికరంబులంబట్టి గిరగిరం ద్రిప్పి ధరవేసినట్లు బల పరాక్రమము గలిగిన సపుత్రులు ఉగ్రులై శత్రునిర్మూలము జేయుచుండిరి. ఇట్లు పోరు ఘోరంబుగా జరుగుతరి చంద్ర వర్ధనుని సేనాధిపతియగు రామోజీ రిపుసేనానాయకుని క్రింద బడవైచి యురముపై నెక్కి కరకుగల కత్తిచే నఱుకబోవు నంత రిపురాజు వెనుకవైపుగ తన యురంబు బరపించి శర లాఘవంబున రామోజీ కరచరణంబుల విరుగగొట్టెను. ఇట్లు కరచరణ హీనుండై గిరిచందమున రణస్థలంబుడ పొరలు రామోజీని శత్రుసేనాపతి పదునుగల బరిశె యురమున గ్రుచ్చి పైకెత్తి పడవేసెను. పడవేయుటతోడనే రామోజీ ప్రాణ ములు దివికేగెను. ఇట్టుల రామోజీ మరణమును జూచి అట్టి యధర్మ యుద్ధమునకు సహింపజాలక చంద్రవర్ధనుడు కురు సైన్యాధిపత్యము వహించి పాండవులపై కురుకు భీష్మద్రోయన చండకిరణ మార్తాండుని పగిది మండిపడుచు భండనోద్దండ కాండకోదండబాహుడై దండినుగల గుండియలు బెండిబెండిగా జెండు తొండముగల దంతావళము నెక్కి దిక్తటంబులు మార్మ్రోతలిడ ధనుష్టంకారంబుజేసి యసంఖ్యాకములగు తూణీ రంబుల రిపుసైన్యము నొప్పించెను. తత్ బాణపరంపరల శరీ రము తెల్లరెడల తూట్లుపడ నరివీరులందరు చెల్లాచెదరై కొందరు పరులిడిపోవుచుండిరి. మరికొందరు రణస్థలియందు చచ్చినట్టుల పడుండిరి. కొందరు పట్టణపులోనున్న యిండ్ల లోపల దూరిరి. అప్పుడు తెల్లవారుజాము నాలుగుగంటలు కావచ్చినది. చంద్రోదయము మయ్యెను. అవ్విధమున వెడలిపోవు

సైన్యమును జూచి రిపుసేనాధిపతి గంభీరస్వరముతో నిట్లు
పలికెను. ఓ క్షత్రియవీరులారా! పందలక్రియ నీ విధ
ముగా పారిపోవు టుచితంబుగాదు. వారి బలములు చాల తగ్గి
నవి మనసేన లధికముగ నుండెను. ఒక వృద్ధరాజునకు భయ
పడి యువకులందరు పారిపోయిరను నపకీర్తి భరించుటకంటె
ప్రాణము లెక్కువా. మీకు రోషములేదాయని పౌరుష
వాక్యంబులాడిన చెదరిపోవు సైన్యమంతయు తిరిగివచ్చి
కొందరు చంద్రవర్ధనునిపై గవసి రణంబు సలుపుచుండిరి.
కొందరు చంద్రవర్ధనుని సేనల జీల్చి చెండాడిరి. ఇట్లు తన
సైన్యము హతమగుట జూచి వ్యాఘ్రరాజు మంత్రియగు జయవర్మ
దశదిశల దరదంత ఘుట్టనమొనర్చి రిపుసైన్యాధిపతిపై కుపిత
చుండె శత్రురాజులిడు బాణములచే నాతని మస్తకమవనింబడ
గొట్టెను. అట్లు గూల్లజేసి శత్రురాజగు లోభగుప్తుడు వ్యాఘ్ర
రాజు వంకకు దిరిగి దేహమంతయు జిల్లులుపడ బాణముల
ప్రయోగించుచుండెను. అంతట చంద్ర వర్ధనుడు వృద్ధుడై
ధైర్యసాహసము లుప్పొంగ యూహూర్తమాత్రమున నుప్ప
వేల శిరముల నుప్పరవీధి కెగరగొట్టెను. అదిజూచి శత్రురాజు
భగ్నభగ్నుడు మండిపడుచు పదుగురు రాజపుత్రుల పరివైపు
నొక్కమారు గసురుమనట్లు సంజ్ఞచేయగా వారట్లు గ్రమ్మి
చంద్రవర్ధనుడెక్కిన యేనుగు కరచరణంబులు నరికివేయగా
గిరింబోలి ధరాస్థలింబడి జీవముల విడచెను. రిపురాజు వ్యాఘ్ర
రాజు విల్లును వికలంబుగావించెను. అట్లు వికలముగావిం
పగా చంద్రవర్ధనుడు వాహనములేక నిరాయుధుడై ప్రక్కల
పారజూచెను. కాని తనకు విల్లు నందించువారుగాని సహ
యముచేయువారుగాని లేకుండిరి. పురమువంక జూచెను
పట్టణమొక దిశనుండి యగ్నిజ్వాలలు మిన్నుదాక తగులబడ
చుండెను. ఇక నటువైపు చూడలేకపోయెను. తన శరీరము
నొక్కసారి చూచుకొనెను. తన దేహమంతయు జల్లెడవలె
చిల్లులుపడి మిక్కుటముగ వెడలివచ్చు రక్తమును గాంచెను
ఇంక నిలువలేకపోయెను. ప్రపంచమంతయు తనకు పచ్చగా

నగుపడుచుండెను. తలలో భూతములు యుద్ధము జేయుచున్నట్లు తోచుచుండెను. ఇక బ్రతుకుపై నాసవిడచెను. ఒక్కమారు లోభగుప్తునివంక తీక్ష్ణముగా జూచి తలపంకించి యేమియో యన బోయెను కాని కన్నులు మూతబడి క్రిందబడిపోయెను. ఇట్లు వృద్ధరాజు క్షీణింబడిన సంతోషముచే ఢంఢంమను శబ్దముల నరి వీరులు జయభేరీలు మ్రోయించిరి. తదుపరి వారందరు తగుల బడుచున్న పురము నార్పబోయిరి. కాని చంద్రవర్ధనుడు పూర్ణముగా చావలేదు. కొంతయోపికబట్టి యెందులకో ప్రాణముల నాపుకొని కన్నులు మూయుచు దెరుచుచు పడి యుండెను.

ఓ పాఠకమహాశయులారా! ఆ యుద్ధభూమి నొక్కమారు దిలకింపుడు. ఎచట జూచినను శకలములైన రథములు, వికల ములైన ధనస్సులు, నరుకబడిన చరణంబులు, విరిగిన పతాక ములు, తెగినకరములు, పగిలిన కవచంబులు, తూట్లుపడిన దేహంబులు, చెక్కలు చేయబడిన శిరములు, ఖండించిన మొం డెములు, పిండిపిండిగా చూర్ణించిన రథాంగములు, పొడుము చేయబడినభుజకీర్తులు, ముక్కలు చేయబడిన మకుటములు, చినిగినవస్త్రములు, ప్రక్కలైనవారి ఖడ్గములు, తుంపులైన తూణీ రంబులు చీల్చివేయబడిన శరీరావయవములతో నిండి భయంకర భూమియెల్ల రక్తప్రవాహములో మునిగి తేలుచుండెను. భూత ప్రేతపిశాచశాకినీ ఢాకినీ కాకి ఘూక గృధ్రజాతులు బంతులు తీర గర్భములనిండ మాంసపు ముద్దలు మెక్కి రుధిరము గ్రోలి మితిలేని యుత్సాహముతో నృత్యములు జేయుచుండెను. ఇట్లుండు నా రణభూమియం దొక డదియో వెదకుచు భయమున దిక్కులు పరికించుచు వృద్ధరాజు పడియుండిన దిశకు వచ్చు చుండెను. ఇట్లు నడచు కాళ్ళచప్పుడువిని చంద్రవర్ధనుడు కనులు విప్పిచూచి తన సేవకుడని గుర్తించి దగ్గరకు రమ్మని సంజ్ఞ చేయగా వాడు వచ్చి నమస్కరించి నిలువబడెను. అంతట వృద్ధరాజు నాకరుం జూచి, ఓరి! నీ పతిరయంబున జని యొక తాళపత్రమును ఘంటమును తీసుకరమ్మన నాత

డట్లుచేయ తదుపరి చంద్రవర్ధను డేమేమియో చెప్పి వ్రాస
చేత వ్రాయించి తన నామాక్షరములుండు ముద్రవేసి త్వరిత
గతి తన ముద్దుకూతున కీయుమని చెప్పెను. వెంటనే కనులు
మూతబడెను. ఒక్కమా రావలించెను. ఇట్లు చంద్రవర్ధనుని
స్థితికి శోకించుచు రాజాజ్ఞ శిరసావహించి భటుడు మనో
రమ సౌధము ప్రవేశించి యా పత్రము నామె కందించి
పోయెను. ఆమె దాని నాత్రముతో నందుకొని జదువగా
నిట్లు వ్రాసియుండెను.

చిరంజీవి ముద్దుపట్టిని
శ్రీశుభకల్యాణప్రాప్తిరస్తుగా దీవించి వ్రాయులేఖ
అమ్మా !

ఈ రోజో నీకు నాకు ఋణముతీరి నేను పరలోకమునకు
బోవుచున్నాను. నా మరణవార్తవిని నీవు దుఃఖపడవలదు.
నే నఱువది వత్సరములనుండి రాజ్యమేలి సుఖము లనుభవించి
యున్నాను. ఎప్పటికైనను చావు తప్పదు. పుట్టుట గిట్టుట
కొరకేనను నార్యోక్తి నీకు తెలియనిదికాదు. నీ వివాహము
కన్నులారగాంచి యానందపడు భాగ్యము లేకపోయినందులకు
నాకెంతె విచారపడుచున్నాను. నీవు పవిత్ర శీలమును గాపాడు
కొనుము. నీకు తెలియరాని యంశ మేమియును లేదు "ఎట్టు
లైనను నాపగ దీర్పుము"

ఇట్లు జనకుడు,
చంద్రవర్ధన మహారాజు.

ఇంతలో మనుష్యుల కాళ్ళచప్పుడు వినవచ్చెను: వా
రెవ్వరు. లోభసప్తుడును యతని సైన్యాధిపతియు వా రెందు
లకో నంతఃపురమునకు వచ్చి యంతయు కలయ జూచిరి.
ఆ సౌధమంతయు జనశూన్యమే. అందుకు వారేమేమియో
యనుకొనుచు వృద్ధరాజు పడియున్న చోటికి బోయి మరల
తిరిగి పట్టణమునం బ్రవేశించి తమ సైన్యమును జేరబోయిరి.

# 2

హిమవత్పర్వతమునకు దక్షిణభాగమునందుండు నార్యావర్త
దేశమున గంగానదీతీరమందు, నక్షత్రములు తమ యగ్ర
భాగముల నిడుకొని కావలసినంత వెలుగు నెల్లకాలములందు
సంగ్రహించుకొనవలెనని పోవుచున్నవో, లేక వర్షాకాలమందు
మేఘములు నీరు నింపుకొని వాయువుచే నెట్టఁబడి పోవుచు
వర్షము కురువనట్టి మేఘములకు రంధ్రములు కలుగఁజేసి తమ
మొదళ్లందు నీరు నింపించుకొని వృద్ధిఁబొందవలయునని పెరుగు
చున్నవో, లేనియెడల యీ భూమియందుంచఁబడిన మనుష్య
పశుపక్షి మృగకీటక వృక్షధరాది స్థిరచరరూపములైన వస్తువు
లన్నియు స్వర్గలోకమున నున్నవో లేవో, ఉన్నయెడల వాని
భేదమేమో, తమ జాతియొక్క నాగరికత యెట్లున్నదో
కనుగొందమను నపేక్షతో పోవుచున్నవో యనుకొనునట్లాకాశ
మున కొరయు లేఁతమ్రాఁకులతోడను, ఒకటితో నొకటి
నొరయుటచే పుట్టుచిచ్చువలన భయముజెంది అంబరమార్గమున
బోవు చంద్రుని సమీపించి చల్లదనమును తనకు వ్యాపింపజేసి
కొని యగ్నివలనగలుగు భయమును పోగొట్టుకొనవలయునని
యంతయెత్తున కేగుచున్నవో యని యూహించుకొనునట్లెదు
గుచున్న వెదురుజొంపములతోడను, నాతో సమానమెద్ది
యని విఱ్ఱవీగుచు బలపరాక్రమముచే ప్రక్కలనుండు వృక్ష
సమూహము నొక్కపెట్టున చక్కగాఁద్రోసి భూమియంతయు
నాదేనని యాక్రమించుకొను వానివలె మిక్కిలి దీర్ఘములైన
శాఖలుగలిగి స్వేచ్ఛగా కాలము గడుపుచున్న మేఁటి వృక్ష
ములతోడను, భూమి రంధ్రములలోనుండి యూహాగముకొనక
వచ్చు సర్పములబట్టి నిమిషమాత్రంబున నూరుగాయవలె చప్ప
రించి వాని శిరముల మణుల విలువ గలియక నుమియునట్టి
దుష్టులచేతను దుష్టుల కురికి పిక్కఁబిగించి బక్కనరుని సక్రం

చనుడు తినువిధముగా మాంసఖండరసముల గుటుక్కున మ్రింగ
మిక్కిలి పొగరుచే మదపుటేనుగుల కెదురు నడచు శార్దూల
ములచేతను, అట్టి వ్యాఘ్రముల తమ కరములంబట్టి గిరగిరం
ద్రిప్పి ధరవేసికొట్టి దేహము జీల్చి దారిప్రక్కలనున్న వృక్ష
శాఖల విరుగగొట్టుచు పోవుచున్న దంతావళములచేతను,
తత్కరికొంకక పొదలమాటున గూర్చుండి హఠాత్తుగా పైబడి
కుంభస్థలమును జీల్చి మెదడునంతయు భుజించి మృగరాజు
ననెడు నిర్భయముతో నీటి ప్రాంతములందు చల్లదనమునకు
నిద్రవచ్చుచు కన్నులు మూయుచు తెరచుచు పండుకొనియుండు
సింహములచేతను, అవెవరికా నదీతీరములందు కేసరుల భక్షింప
వలెనను నాశతోనుండి తమ రెండు నిడుదకాళ్ళతో వేగముగా
బయలువెడ్డి దాని మెడ కేసరముల వడవేసి పట్టుకొని తమ రెండు
వాలములతో చర్మమునూడగొట్టి దానివలె మోది చిట్టచివరకు
పొట్ట పగులచీసి క్రొవ్వునంతయు భుజించి పిల్లవాయువుల చల్ల
దనమునకు పచారుసాగించుచున్న శరభమృగములతోడను,
సంకులమై వేయేల నానాస్థలములలోనున్న మృగసర్ప పక్ష్యాది
ప్రాణిసమూహము నీ ప్రపంచమున నెచటవెదకినను మనము
కనగొనజాలము. ఆ మహారణ్యంబునకు చుట్టుకొనియుండు
వానలుకురిసినను, ఆ క్రూర మృగములగాంచినను, ఎంత
ధైర్యవంతులకైనను భయముగలుగక మానదు. ఎటు నెలకొంచి
నను క్రూరమృగ సంచారమే కాని సాధుమృగముల జాడయే
కానరాదు. ఎప్పుడువిన్నను భీకరమృగముల గర్జనంబులే
కాని యింపుగానుండు పక్షులధ్వని వినబడదు. ఇంతయేల
పట్టణములు, పల్లెలు జనులకు నివాసస్థలములగునట్లు సింహ
శరభ శార్దూల ఖడ్గ వృకకపి భల్లూక గజ కాక మృగాదులకు
కాడి ప్రాణులకు నివాసస్థానముగ నొక యరణ్యముండెను.
ఆ విపినమునందున్న మృగములు మొదలగునవి కోటను నిర్మించు
కొనెనేమో యనునట్లు పర్వతపంక్తులుండెను. కోటగోడల
మీదనుండి శత్రురాజుల జాడల వీక్షించి తమ ప్రభువులకు
తెలియజేయు సైన్యమువలెనె పర్వతశిఖరములు గుంపుగా

గూడి పక్కులు గూయుచుండెను. ఆ గహనము ప్రవేశించు
టకు మార్గము జాడయే కనుపడనంత దట్టమై కంటకములచే
నిండుకొనియుండెను.

ఒక దాని నొకటి భక్షించుచు క్రూరత్వ మెక్కుడై సంచ
రించు దుష్టమృగములను జూచి సేక పోవుచున్నాడో యన భాను
డస్తమించెను. అంధకార మంతట వ్యాపించెను. పక్షులు తమ
తమ గూండ్లకేగెను. మృగములు తమ తమ నివాసస్థానముల
జేరెను. నక్షత్రములు మినుకు మినుకని గాన్పింపదొడగెను.
అచ్చటచ్చట వర్షమేఘములు వృద్ధిచెంది గ్రహమండలమంతయు
గప్పివేసెను. చలిగాలి యురుములు మెరుపులు ప్రారంభ
మయ్యెను. కన్నువిడక లొక్కొక్కటిగనే రాలుచుండెను.
ఈ సమయమునందా ఘోరారణ్యములో పక్షుల కలకలము,
చెవులు పగులగొట్టు గీయని యరుచు కీచురాయి ధ్వనులు
నక్కలు బద్దలగునట్లు పర్వతములు ప్రతిధ్వనించుచుండ
ప్రేతములు పెట్టుచుండు మేఘగర్జనంబు లెంతో భయాస్పదముగా
నుండెనో చదువరులే యూహించుకొనవలెగాక. అప్పటికి
రాత్రి పదిరెండుగంటలకాలమైనది. ఆయర్ధరాత్రికాలములో
నాయరణ్యమునకు నైఋతి భాగంబునకున్న కొండల చెంతను
నొక యుపవనమున్నది. ఆ పర్వతముల మధ్య లోయగానుండు
నొకమార్గ మరణ్యమునవలనైనను చాలవఱకు తిరిగియుండెను.
ఆ వచ్చిన యువకుని వయస్సు పదునెనిమిది సంవత్సరములుండును.
చీకటిలో రూపము కనుపడకపోయినను, మెరుపు సహాయము
వల్లనతని రూపము కనుబడుచుండెను. ఆహా! ఏమియాసౌంద
ర్యము. విశాలములైన నేత్రములు వీపులతో నెకసక్కెము
లాడు భుజములు, చిగురువన్నెను పరువెత్తజేయు పెదవులు.
వెన్నెలకు వన్నెదెచ్చు దంతములు, స్వచ్ఛమైన పసిడి నెన్న
గల శరీరకాంతి, కమలములవంటి పాదద్వయము గలిగి
యుట్టి సుందరుడని వర్ణించుటకలవిగాని సౌందర్యముతో ప్రకా
శించుచున్న యా యౌవన పురుషుని ముఖలక్షణములబట్టి
చూడ నొక క్షత్రియ కుమారుడని చూపరులు చెప్పకపోరు

తెలిసికొందము. ఇతని మేనియందొక చొక్కా ధోవతియు నుండెను. నడుమున కొక కత్తియుండెను. ఆ కత్తిలో పిడి వరకు నగుపడుచుండు నొక చేమికొన్ని మాత్రముండెను. ఇక నితని కేమియును లేవు. అంధకారమును నా ప్రదేశములో తిరుగుచుండెగా నాతని కన్నుల పొడకట్టుకూడా లేకుండెను. అట్టి సమయమున స్థిరచిత్తుడై యెట్లు తిరుగుచున్నాడో నేమి కష్టములు సంభవించెనో దేవునికే తెలియును. అప్పుడప్పుడు గాని యుతిర్చుటలో నా పర్వతముపై నెక్కి మెరుపు వెలుగున దిక్కులెల్ల కలయజూచి తన్నడకకు నిరుపయోగము లోయలోనికి దిగి యావంకలుగానున్న కానన మార్గము బట్టి పోవుచుండెను. అట్టి మధ్యరాత్రికాలమున నిదిగిరి, ఇదిబస్తు, ఇదిగట్టు, ఇదిమిట్ట ఇదిపల్లమని చెప్పరాని దుశక్యమైన గాఢాంధకారములో రాత్రి గుండెలుగలవారైనను ప్రవర్తింపజాలని ప్రశంసింపనాయనకొని భయదమునట్టి విపినములో నాయన నిరంతరాయముగా పోవుచున్న వాని ధైర్యమెంతటిదని వివరింపనగును. అట్లు పురుషుడు బంతులవలెనుండు పల్లేరుకాయలుగలిగి కఠిన శిలామయమగు మార్గమున నాయరణ్య పూర్వదిశ చివరకుబోయెను. ఆ కానన మునకుందు సర్వజీవులకు పానీయములకొరకే భగవంతుడు దీనిని సృజించెననకొను నట్లొక నది ప్రవహించుచుండెను. దాని యందాకాశగంగలోని స్ఫటికమువలె నిర్మలమైన పూదేనె వలెరుచి గలిగిన నీరుండెను. ఆ రాజకుమారుడు నదిలోనకు ప్రవేశించి కొంతనీటిని తీసుకొని ముఖమును కడుగుకొని పుక్కి పెడు జలమును నోటనుంచుకొని మ్రింగక వెడల నుమిసెను.

ఓ పాఠకమహాశయులారా! ఇట్టి స్వచ్ఛమైన నీరు నట్లు చేయుటకు కారణమేమోనని వేరుగ భావింపవలదు. అంతల కాతని మనస్సున నిండుకొనియుండు చింతయే కారణమని యూహింపనగును. అట్లావ్యక్తి నీటిని నేలపాలుచేసి యొకనిట్టూర్పు విడిచి యావలయొడ్డునకు జేరెను. అప్పటికి నాకాశమున గప్పబడియున్న మేఘములన్నియు వాయువుచే గొట్టబడి యొక దిక్కున కిగుమిగూడి కోటలో సంచరించెడి రాజసైన్యమోయనగ

నొకటొకటియే తారామండలమంతయు బయల్పడెను. సైన్యము వెంటవచ్చు వృద్ధరాజువలె నాకాశవీధిని చంద్రు డలంకరించెను ఆరోజు బహుళాష్టమియో నవమియో కాబోలు చంద్రబింబము కొంతభాగము కొరతగానుండెను. ఎటులుండినను ప్రకృతిని వర్ణింపదగిన వెలుగుండెను ఆ యువకుడు తూర్పుదిక్కుగా పోగ జూచెను. అచ్చట నొక విశాలమగు ప్రదేశము గాన్పించెను. అది మెత్తనైన యిసుకతో నిండుకొనబడి దాని చుట్టుం [illegible] పుష్పములతో గూడుకొనిన చెట్లుండెను. ధారాళముగా నారోగ్యకరమగు గాలి వచ్చుచుండెను. అప్పు డాక్షత్రియ సూను డాస్థలమునకువచ్చి బహుదూరము నడచిన శ్రమచేతం దన [illegible] పాదకమలముల నొత్తుకొనుచు కూర్చుండెను. అట్లు కొంతసేపు కూర్చుండి యా రాత్రి ఆహారము లేనందున వల్లనేమో శోషపోవువానివలె పరుండెను. కాని నిద్రపట్ట లేదు. మరలలేచి దిక్కులెల్ల కలయజూచుచు తనలోనేమే మియోచించుకొని లోలోపల గుండె యేదియో మిట్లాలోచన చేయుచుకూర్చుండెను. తరువాత కొంతసేపటికి మనుష్యుల యొక్క మాటలు వినబడెను. అది వినగానే తటాలున లేచి నిలువంబడెను. ఇతడు నిలువబడిన స్థలమునకు సమీపమున నుత్తరభాగమున తూర్పుగాబోవు చిన్నమార్గమున నలుగురు మనుష్యులు నడచుచుండుట జూచెను. ఆ మార్గ కిరుప్రక్కల చేలను నుండు కంచెల విధముగా చిన్నచిన్న వృక్షసమూహము లుండెను. వీరిని జూచుటకు నా యువకుడు త్వరగా నడచి వారు పోవుబాట ప్రక్కనున్న చెట్లనీడనుండి యా మనుష్యుల యాకారములజూచెను. గుండెజల్లుమనెను. మరల సాహసము దెచ్చుకొని వారిని ముందుగా బోనిచ్చి వెనుక [illegible] దూరమున వారి మాటల వినుచు బోవుచుండెను.

ఓ చదువరులారా! ఆ ముందుబోవు జనుల స్వరూపముల [illegible]. వెలుగు తక్కువగా నుండుట చేత నా మనుష్యు లెట్టివారని సరిగా వర్ణించుటకు వీలులేదు కాని నా దేహములు భల్లూక శరీరములవలె రోమములు గలిగ

నల్లగానుండినట్లు గన్పట్టుచుండెను. ఆ రూపమునకు తగిన లావును ఎత్తునుగలిగి భయమును గలుగజేయునట్లు కడుబలముగానుండిరి. దీర్ఘములైన మీసములు నడినెత్తిని వేయబడిన శిఖలు గలిగి యుండిరి. త్వరగా చీకటిలో నగుపడకుండుటకై కావివస్త్రములుగట్టిరి. ఒకనిచేతిలో నొక గండ్రగొడ్డలియు, వేరొకని హస్తమున మచ్చుకత్తియును, ఇద్దరిచేతులలో రెండు దుడ్డుకఱ్ఱలు నొక యీటె యుండెను. వారిపైనవేసికొను గుడ్డలు కాబోలు ఉండగా కట్టుకొని వెనుకనుండువారు భుజమునకు తగిలించుకొనియుండిరి. వారిని చూడగా నడవిలో నుండు నొకజాతి మనుష్యులవలె భయంకరముగా గన్పట్టుచుండిరి. ఆ ఘోరారణ్యములో నట్టి యర్ధరాత్రికాలములో నైనను మనస్సుచలింపని రాజకుమారుని రాణీసుందరియే జల్లుమనిన వారెట్టి సాహసముగలవారో మీరే యూహించుకొనవచ్చును. ఈ విషయముగా వారు నిర్భయముగాబోవుచు నిట్లు మాట్లాడుకొనుచుండిరి.

1 మనుష్యుడు :— ఒరేయ్! యెంకన్నా నాకీనాడొణికొస్తాంది. లేక కొండలమద్దెలోవుంటె రాకాచిక్కొట్టమిండగా రంగరాజుపట్నానికుబోయి రత్తనాల పిట్టమిండగా రానూరి దోవన పోతారోనని నా కనుమానంగా వుందిరా.

2 మనుష్యుడు :— ఆ, హా! ఆట్టిగారు. కాదన్నమేనుంటే అది చాలా యెవ్వాకి. వొడ్డుమిట్టనేల భయముపెళ్ళున. అందుకని ఆ బాటనపోరు.

1 మనుష్యుడు :— అయితే యీ పిల్ల యీ రోజున యిటువచ్చే సమాశారము మన బావకెవ్వర్రా సెప్పింది?

2 మనుష్యుడు :— యీపిల్లమీద మెమపడి యెత్తైన పట్టికరిష్మని మెయివు మనబావకు సెప్పినాడంట.

1 మనుష్యుడు :— ఆ రాజు కెట్ట తెల్సునురా.

2 మనుష్యుడు :— యేమో నా కా సంగతి తెల్దు. యిదంత మన నాగన్నబావకు బాగా తెల్సు మనకెందుకా సంగతి సెయ్యమన్న పని సేసేదానికి.

అని యిట్లు వారు మాట్లాడుకొనుచు బోవుచుండ క్షత్రియ
కుమారుడిది యంతయు నాలకించి యిట్లాలోచించుకొనెను.
ఆహా! వీరి యుద్దేశ్యమంతయు నాకు బోధపడినది. అప్పుడు
వీరొక యబలను పట్టుకొనబోవుచున్నారనియు నా యువతి
నొక రాజు మోహించి వీరిచేత నీ పనిని చేయించుచున్నాడ
నియు వీరీ యరణ్యములోనుండి చోరత్వమువలన జీవించు
మనుష్యులనియు, ఈ దొంగలకు నారాజునకు స్నేహమున్నద
నియు వీరి మాటలవలన స్పష్టపడుచున్నది. అయ్యయ్యో!
ఆ కన్యారత్నము వీరి చేజిక్కినప్పుడెంత తల్లడిల్లునో యెంత
యెలుగెత్తి యేడ్చునో, ఈ భయంకర స్వరూపములను జూచి
నాకే గుండెలవియుచున్నవే. ఆ కాంతారత్నము కాయము
నుండి జీవము వెడలకుండునా? ఈ ఘోరకార్యమును జూచి
నేను సహింపగలనా? ఏది యెట్లైనను నాకిప్పుడీ వనితాసంరక్ష
ణమే కర్తవ్యము. కటకటా! నే నిప్పుడీ యబల నెట్లు రక్షింప
గలను? చేత నొక్క ధనువైన లేదు కదా? బలముచే పెనగుద
మన్న నాకాహారము లేమిచే గృశించియున్న నా దేహము దోచు
టలేదు. హా విధీ! ఉత్తమరాజవంశమందుద్భవించి శత్రు
రాజుల రక్తకందరముల బాణపరంపరల ప్రయోగమున ప్రవా
హముగా పారునట్లు చేయు శౌర్యధైర్యములు గలిగియు, నొక
యబలను రక్షించుట కశక్తుడనై యొక్కసారిని విఫలముగా నీ
పాపకార్యమును జూచుచు నూరకుండునట్లు చేసితివా? అని
భావశ్యముచే నొప్పు విశాలనేత్రపద్మములనుండి యుష్ణబాష్ప
ములు మిలమిలరాల నాకాశమువైపు జూచుచు నేదియో
నాలోచన స్ఫురించినట్లు తన పట్టీనుండు షేక్ కత్తినితీసి
వాని పదునిటు త్రిప్పి చూచి మరల దట్టీయందు నిముడ్చుకొని
వారల వెనుక నడువసాగెను. వారట్లు కొంతవరకు నడువగా
నైరృతిమూలనుండీశాన్యమూలకుబోవు నొక గొప్ప మార్గ
ముండెను. ఆ కిరాతులా మార్గమున కొంతవరకు వెళ్ళి యా
దారి ప్రక్కన వటవృక్షములు చుట్టు నిండుకొనియున్న మహ
త్తరమైన తటాకముయొక్క కట్టపైకి నడచి వృక్షముల

మొదళ్ళయందుచేరి కూర్చొని మార్గము వీక్షించుచుండిరి. అప్పుడా వెనుకనున్న క్షత్రియకుమారుడు వారియెదుటనుండి ప్రక్కకు తొలగి కొంతదవ్వరుగగా నాగ్నేయమునుండి వాయువ్యదిక్కునకుంబోవు మార్గమొకటి గాన్పించెను. అచ్చట సుంద్ర చంద్రమొదలుగాగల గుట్టలు ప్రబలమై మరుగుగా నుండెను. అచట నొక ధనస్సును నంబులపొదియును బడి యుండెను. దానిని చూడగనే యత్యాసతో సంగ్రహించుకొని యువి తనవేనని గుర్తుపట్టి యేదియో కొంతసే పాలోచించి వింటి నారిని సవరించి రెండుమూడు బాణములచేత నందికొని, మన్మథుని భస్మముచేయు తలంపున తెఱచిన త్రినేత్రుని చచ్చుకన్నువలె తన నయనద్వయమునుండి పావకజ్వాలలు ప్రజ్వరిల్లగా నాభిల్లులవైపుజూచి పటపటపండ్లుగొరికి మీసముపై చేయివైచి రౌద్రాకారుడై తత్ రౌద్రాతిశయమున దేహము కంపింప తనలో నేమేమో యనుకొని కానిమ్మను భావము తేటతెల్లమగునట్లుగా తల పంకించి యా గుట్టలనడుమ కూర్చుండి మార్గమువైపు తిలకించుచుండెను.

అప్పటికి తెల్లవారుఝాము కావచ్చినది. పూర్వదిశయందు పాండురవర్ణము హెచ్చుగా నడవిలోని పక్షులు నిద్రనుండి మేల్కాని గూండ్లనుండి వెడలి కూయు కలకలము చెలరేగుచుండెను. ప్రాతఃకాల పవనాంకురములు మెల్లమెల్లగా వీచుచుండెను. అట్టి కాలమున నా కిరాతులకు నశ్వముల నదలించు మనుష్యుల ధ్వని వినబడెను. వినబడుటతోడనే వారు దిటాలున లేచి తమ దగ్గఱనున్న యినుపగొలుసును వీండ్లున్న వటవృక్షమునకు గట్టి రెండవచివరదోవకు నావల ప్రక్క వీరికెదుటనున్న చెట్టునకు నాలికద్దముగా గట్టి గుట్టలమాటున నొదిగియుండిరి. ఆ యినుపగొలుసు సమీపమునకు వచ్చునంతవరకు కనబడనట్టి వర్ణముగలిగియుండెను. బండి సమీపించుచుండెను. ఆ బండికి చుట్టు పెట్టెవలె చెక్కలు బిగింబడి వెనుకముందు తలుపులును ప్రక్కల వీక్షించుటకు చిగెట్ల సన్నపు బిగించబడిన గవాక్షములు గలిగి నాలుగశ్వములు గట్ట

బడెను. అవి బలముగలిగి వేగముగ బరువెత్తునవిగానుండెను. బండి తోలెడివారు ముందువైపు బిగింపబడిన చెక్కమీద కూర్చొని కొరడాతో గుఱ్ఱముల సంజ్ఞ జేయుచుండెను.

వేరొక మనుష్యుడు బండివెనుక నొక గంద్రగొడ్డలి భుజమున బెట్టుకొని త్వరగా నడచుచుండెను. ఆ బండిలోనున్న వారికి గాలికొరకు గాబోలు తలుపులను తెఱచి యుంచిరి. గుఱ్ఱములకు కట్టిన కంచుమువ్వలధ్వని యొకరమాటొకరికి వినబడనంత గంద్రగోళముగానుండెను. ఇట్లాతురగములు నడచుచు నేదియో చప్పుడు వినినవాటివలె చెవులు నిక్కునట్లుచేసి పొరగిలబెట్టి త్వరత్వరగా నడచుచుండ కారణము తెలియక బండివాడటునిటు పరికించిచూచెను కాని యేమియు కనుపడలేదు. అట్లావాజినములు గొలుసును సమీపించి దానిని భేదించుకొనలేక నెక్కడతురగము లక్కడనే నిలువబడెను. అది జూచి బండివానికి గుండె జల్లుమనెను. కొరడాతో రెండు దెబ్బలుకొట్టెను గాని అవి ముందున కడుగిడలేదు. ఆకస్మికముగా నా కిరాతులలో నిరువురు బండి వెనుకపోవు వానిపైబడి గొడ్డలిని లాగికొని వానిని చెట్టునకు గట్టివేసిరి. వేరొకడు బండివాని వెంట్రుకలుపట్టుకొని క్రిందకుబాగి నూరమున కూర్చుండబెట్టి కదలిన కత్తికెరగావించెదనని భయపెట్టుచుండెను. బండిలోని స్త్రీలాహాకారములు జేయుచుండ వేరొకడు వెనుకవైపునకువచ్చి గద్దింప నాయువతులు భయమువలన దేహములు కంపింప గడగడవడకుచు గద్గదిక స్వరములతో నేడ్చుచుండిరి. అప్పుడా తస్కరుడు వారుకూర్చున్న పరుపునుబట్టి బలవంతముగ క్రిందికి నీడువగా దాని వెంటనే స్త్రీలు నేలమీదకూలబడి చేయునదేమిలేక నోటమాటరాక వారి రూపములజూచి గుండెలు తల్లడిల్ల నొకరి నొకరు గౌగలించుకొని తత్తరమున నిర్విణ్ణులై జూచుచుండిరి. అంత నొక చోరుడు గ్రుడ్లెఱ్ఱజేసి యందు నొక యబలను వేసగాద్రోసి యొకయువతిని బట్టుకొని నతిఘోరముగా నేడ్చు దానిని

ఝుంపునకు కఠినముగాఁ ద్రోయుచు తక్కినవారు కలియగాఁ
బోవుచుండిరి. ఇదంతయుఁ జూచి క్షత్రియకుమారుడు తోక
త్రొక్కిన త్రాచుపామువలె లేచి, ధనువెక్కుబెట్టి కోపోద్రేక
మున గ్రీష్మాదిత్యుడోయన ముఖమండలమంతయు నగ్నిజ్వాలలు
ప్రజ్వరిల్లగా కనుబొమలు ముడిచి కనులెఱ్ఱజేసి జురచుర
నైదారుబాణము లాభిల్లులపై ప్రయోగింప, నవి యా కిరాతుల
శరీరములఁజీల్చుకొని యావలవైపు నవనీతలంబునకు గ్రుచ్చు
కొనెను. ఆ దెబ్బలకు తత్తరమంది కిరాతు లా కాంతి
నక్కడనే వదలి పరువులెత్తుచుండ వారిని వదలక నా యువకుడు
ఓరోరి దుష్టులారా! పోకుడుపోకుడు. ఇప్పుడే మీ మాంస
ఖండముల భూతప్రేతపిశాచములకు పంచి యిచ్చెదనని వారి
వెంట నతివేగముగా బరువెత్తుచుండెను. ఇట్లు కొంత దూర
మరుగగా రెండు చిన్న కొండలమధ్య నెత్తుగా కట్టవలె రాళ్లు
నింపియుండెను. ఆ కిరాతులు దానిపైకెక్కి క్రిందికి దిగి
పోయిరి. క్షత్రియ కుమారుడట్లుచేయక కట్టపైకెగిరి యావల
నున్న పల్లపుభూమినిదుమికెను. ఆహారము లేమిచేగల్గు పత్యాతి
శయమున నేత్రములు చీకటులు గ్రమ్మ కొంతతడవు కండ్లు
మూతవేసికొని తదుపరి తెఱచిచూచెను. కిరాతులు కనుపడ
లేదు. మరల కన్నులు చీకటులు గ్రమ్ముచుండెను. తాను
వచ్చిన మార్గముదెలియక కింకొకదారింబోయెను. ఇట్లావ్యక్తి
పోయిన తదుపరి యాకన్య బండివరిజేరి చెట్టున బంధింపబడిన
వానిని విడిచిపెట్టి సందరుకలసి బండినెక్కి తురగములను సంజ్ఞ
చేయుగా నవి దృష్టి కగోచరమగునట్లు వాయువేగమున బరు
గిడెను. తస్కరు లెక్కడదాగిరో, యువకు డెటకేగెనో.
కాంతారత్నము గ్రామమెయ్యదియో గాంచిన వారెవ్వరు?
ఘనుడు మాత్రము వచ్చిను వారాశిజేర ప్రయాణము సాగించు
చునేయుండెను.

# 3

సాయంకాల మైదుగంటలు కావచ్చినది. సూర్యభగవానుడు శివస్వరూపమును వదలి పద్మనాభాంశచే ప్రకాశించుచుండెను. అపరాహ్ణవేళ ప్రభాకరు కిరణంబుల కాకకు నిలువలేక గూండ్లయందు జేరిన పక్షులన్నియు వెలికివచ్చి యాహారము కొరకు నరణ్యమంతయు గుంపులు గుంపులుగా తిరుగాడుచుండెను. మృగములు మేతకై గుహలను విడచి గహనాంతర భాగముల కేగుచుండెను. పారిజాత పున్నాగాది పుష్పములన్నియు వికసించి ప్రాణుల కమితానందము గలుగజేయుచుండెను. చల్లగా పైరగాలి వీచుచుండెను. అట్టి సమయమున మణిపుర సమీపారణ్యమున నొక స్త్రీ మార్గమున నడచుచుండెను. ఆ యువతి సౌందర్యమెంతని కొనియాడనగును. వట్రువలై బిగువుగలిగిన కుచద్వయమును పూర్ణచంద్రుని పరిహసించు ముఖకమలమును, తామరరేకులంబోలిన కన్నులును, మెఱపుతీగను మించు దేహకాంతియును, తుమ్మెదరెక్కలకు సమమగు వెంట్రుకలును, లోతైనచెక్కిలియు, అరటికంబములవంటి తొడలును లేనడుమును ఇసుకతిన్నెలవంటి పిరుదులును గలిగి సరళస్వభావయై యతి సుకుమారియై మన్మథుని చేతియస్త్రమో యనునట్లుండెను. ఆ కాంత యెవ్వతో దీనవదనయై యా మార్గమున నడచుచుండెను. ఇట్లు కొంత వరకు నడువ పడమరవైపు నేబది బారల దూరమున మనుష్యుల మాటలు వినబడ మెరక భూమిపైకి నడచి యాదిక్కునం జూడ నిద్దరు బైరాగులు గాన్పించిరి. అంత నా సతీతిలక మత్యాసతో వారిజేరిన నేపట్టణమునకైన దారి జూపెదరను భావమున సమీపింప నా బైరాగులు కావిరంగు గోనులను ధరించి కమండలము యోగదండము నందొకరు మాత్రమే కలిగియుండిరి. ఒకరు గురువుగా నొకడు శిష్యుడుగాను చూపరుల కగుపడుచుండిరి. వారి తలకురులు సహజముగ పెరిగినవిగాక యేమృగముల

వెంట్రుకలనో యతికించుకొనినట్లు స్పష్టముగా నగుపడుచుండెను. వీరి ముఖలక్షణములనుబట్టి చూడ నిజమైన జడదారులవలె గాన్పించుటలేదు. వీరిని చూడగనే నామె గుండె జల్లుమనెను. బాటప్రక్కకు తొలగి బాగుగా పరీక్షించెను. అంతనొకనివద్దల గోను క్రిందుగా నొకకత్తికూడనున్నట్లు కనిపించెను. వీరెవరో మాయవేషములు వేసికొని మార్గస్థుల మోసముచేయు చోరులని యూహించుకొనెను. ఎవ్వరైననేమి? ఏదియో నొకపట్టణము దాపున కరుగుదురుకదా! సూర్యుడు కూడ నస్తమించుచున్నాడు. నేనిక వారి కగపడకుండునంత చీకటి వ్యాపించెను. భయము లేదనుకొని వారి వెంటనే యామె నడచుచుండెను. ఇట్లు కొంతదూర మరుగగా రాత్రి యెనిమిదిగంటలైనది. అచ్చటచ్చట గుడ్లగూబలు భయంకరముగా నఱచుచుండెను. పర్వతములనుండి క్రిందికి పాఱుచున్న సెలయేళ్ళధ్వనులు బాగుగా వినబడుచుండెను. రాత్రివేళ వేటాడు సింహములు నీటిపట్టులయందు పొంచి యుండి తాను వేటాడు జంతువుల సమీపమునకు రానిచ్చి హఠాత్తుగా పైబడి ఘాతజేయుచున్న చప్పుళ్లుకూడ నచ్చటచ్చట వినవచ్చుచుండెను. ఆ జడదారులును, యువతియును త్వరత్వరగా నడచుచునే యుండిరి. ఇట్లు కొంతవరకుపోవ నెదుట రెండు కొండలును మధ్య గాళ్ళకట్టయును గలిగిన యొక పల్లపుభూమి యుండెను. ఆ కట్టపై కెక్కిపోయిన మార్గమున్నదేమోకాని వారట్లుపోక నా పల్లపుభూమినుండి పడమరదిశ యరణ్యమున కడ్డముగా నడచి మెండుగా వృక్షములు నిండుకొని యుండిన స్థలమునకు బోవుచుండిరి. ఆ జవ్వనియు వారి వెనుకనే నడచుచుండెను. తదుపరి యొక దీపప్రకాంతి గాన్పించెను. దానికి సరిగా కొంతవరకుపోగా దట్టముగా నిండుకొని యొకటి నొకటి నొరయుటచే పుట్టు కిరకిరధ్వనులు చెవులు గింగురుమనునట్లుచేయు భూరుహంబుల మధ్య నొక యిరుకు త్రోవన నావలకేగిరి. అచ్చట నొక చిన్నకొండయును దానికి నొక గుహయునుండెను ఆ కొండప్రక్క నొకవృక్షముండెను. ఆ గుహముందు విశాల

ప్రదేశమున నలుగురు మనుష్యులు కూర్చొనియుండిరి. ఒక మట్టిచిప్పలో మృగముల చమురుతో నొక దీపము వెలుగుచుండెను.

ఆ బైరాగుల వేషములతోనున్న చోరులు గోనులువిడిచి పర్వత పార్శ్వముననున్న వృక్షశాఖలకు తగిలించి దండ కమండలము దాని ప్రాకున కానించి చిన్నమూటలను రెంటిని తీసికొని క్రొవ్వువత్తి నొకదానిని వెలిగించుకొని యా గుహను తెఱచి లోపలప్రవేశించిరి. ఇదంతయుజూచి యా కాంతారత్నము భయంబుదోప ధైర్యంబుదెచ్చుకొని వారికి పదిబారల దూరములో గుహ కెదురుగా నొక మరుగుప్రదేశమున కూర్చుండి చూచుచుండెను. ఆ గుహలోపల వజ్రవైఢూర్య నీలగోమేధిక మరకతమాణిక్య పుష్పరాగాదిగాగల నవరత్నములు రాసులుగానున్నట్లు నామె నేత్రములకు గన్పట్టెను. వాటిని జూచుటతోడనే అమితానందాశ్చర్యములు గలిగెను. కొంతసేపటికా తస్కరులు గుహనుండివెడలి దాని ద్వారమును మూసి విశాలప్రదేశముననున్న మనుష్యులచెంతకువచ్చి కూర్చుండిరి. తర్వాత మరికొందరు చోరులు కొండ వెనుక ప్రక్కనుండి మట్టికుండలు తలలపై బెట్టుకొని యా స్థలమునకు వచ్చి దించిరి. వానిలోకొన్ని మాంసపుకుండలు కొన్ని కల్లుకుండలు కొన్ని యన్నపుకుండలు. వారట్లు దించుటతోడనే చోరులు లేచి వారు వారు దాచుకొనిన స్థలములకేగి మట్టిచిప్పలు తీసుకొనివచ్చి వరుసగా కూర్చుండిరి. అందొకడరిదరకన్నము పెట్టి యొక యబకతో మాంసమును వేసెను. వేయగానే వారాత్రముతో నంతయు రెప్పపాటులో మడిచివేసిరి. మరల వడ్డించగా తృప్తిగాతిని చిప్పలను మరల దాచుకొని యచటికివచ్చి కూర్చొనిరి. అంత వారికి వడ్డించిన భిల్లునుకూడ భుజించికూర్చొనెను. ఇదంతయు నా కాంతామణి వీక్షించుచునే యుండెను. అప్పటికి రాత్రి పదిరెండు గంటలకాలమైనది. అట్టి కాలమున వారిదగ్గరకు సశ్వారూఢులై యిద్దరు మనుష్యులువచ్చిరి. వారిలో నొకడు రాజు

గాను, ఒకడు మంత్రిగానుండిరి. వారిని చూడగనే చోరు లందరు పడిపడి దండములు బెట్టిరి. వా రశ్వములనుండిదిగి చోరుల పెద్దదగ్గఱకుబోయి కూర్చుండ వారందరు చుట్టు కూర్చుండిరి. అంత నా రాజు చోరనాయకునితో నిట్లు మాట్లాడ నారంభించెను.

రా:— మిత్రమా! వాని ధనమపహరించుకొని రమ్మని చోరు లను బంపితివా?

చో:— రాజా! పంపితిని. ఇప్పుడు నడిరేయికూడా దాటి పోయినది. వాండ్లు తిరిగి వచ్చుచుండవచ్చును.

రా:— మిత్రమా! నీవంటివాడు నా కండగానుండ నాకు సాధ్యముగానిపని యేమున్నది.

చో:— రాజా! మంచి బలవంతులను బంపితిని. అవసరమైన హత్యలుకూడ జరుపమంటిని.

రా:— భేష్. మంచిపని జేసితివి.

అని యిట్లు వారింకేమేమియో మాట్లాడుకొనుచుండ రాత్రి మూడుగంటలకాలమైనది. నిద్రాంగన కను ఱెప్పలను నిమిషనిమిషంబునకు మూయుచుండ గూర్చున్నవారందరు సనికిపాటు బడుచుండిరి. ఇంతలో కొందరు చోరులు పెద్ద పెద్ద మూటలను గైకొనివచ్చి గుహ తలుపుదెఱచి లోపలప్రవే శించి వాటిని విప్పి యా రాశిపైబోసి మగల తలుపుమూసి వీరున్న చోటునకువచ్చి రాజునకు నమస్కరించి వారిచెంత కూర్చొనగ, వారింజూచి

రా:— మిత్రులారా! మీరు పోయినపని నిర్విఘ్నముగ నెర వేరినదా?

చో:— ఆ! నెరవేరినది.

రా:— ఎంతధన మపహరించితిరి.

చో:— రెండులక్షల విలువగల బంగారు వెండివస్తువుల నపహ రించితిమి. కాని యేబదివేల రూపాయిల విలువగల యొక హారముమాత్రము మార్గమధ్యమున పోయినది. ఒక శిశుహత్యమాత్రము జరిగెను.

రా:— మీరిక రెండుమూడుమారులిట్టులనే నా నిధన మపహ-
రించవలెను. ధనము తగ్గినగాని బలముతగ్గదు. బలము
తగ్గినగాని యాభామామణి నాకు లభించదు.

చో:— చిత్తము.

వారిట్లు మాట్లాడు కొనుచుండు నంతయు నాలకించి యా కన్యకారత్నము కటకటా! వీరీ గహనములో నివసించి ఎంతమోసము జేయుచున్నారు. వీరిప్పుడొక రాజగృహమునుండి ధనము దోచుకొని వచ్చినట్లును ఒక శిశుహత్య జరిపినట్లును ఈ రాజునకు నొక కన్నెను గ్రహింపకోరికున్నట్లును వీరి మాటలవలన తెలియుచున్నది. అయ్యో! క్షత్రియకులమునబుట్టియు ధర్మాధర్మముల విమర్శించి రాజ్యము పాలింపదగిన రాజునకే యిట్టి దుర్బుద్ధులున్న వీడి పరిపాలనలోని ప్రజలగుణము లింకెట్లున్నవో? ఈతని నేనెక్కడనో జూచినట్లు దోచుచున్నది. రాత్రి యగుటచే సరిగా గుర్తింపజాలను. కానిమ్మింకేమేమి జరుగునో జూచెదనని యచటనే గూర్చుండెను. అంతవారు కొంత తడవు చోరత్వమునుగూర్చి మాట్లాడుకొనిన తదుపరి యందొక తస్కరుడు లేచి నడిమి కుండలోని కల్లు నొక ముంతతో తీసి తాటియాకుల దొప్పలలోపోసి రాజునకు మంత్రికి నీయగా వారు త్రాగిరి. తరువాత చోరులందరు చేతులను మూతుల కానించుకొని కూర్చుండ నందరకుపోసెను. వారట్లు మిక్కుటముగ కల్లు త్రాగి యొకరిపైనొకరు పడుచు, తూలుచు కొందఱు రాజునకుచుట్టు గంతులువేయుచు కేకలువెట్టుచు వికృతాకారముగా తలలు విరబోసికొని నాట్యము జేయుచుండిరి. మరికొంద రొకరిపై నొకరు పోరాటముల గల్పించుకొని నోటికివచ్చిన బండుకూతలను కూయుచుండిరి.

ఇట్లు కొంతకాలము గంతులువేసి వారి దేహములు వారికి తెలియక నెక్కడివారక్కడనే స్పృహదప్పి పడిపోయిరి. రాజు మంత్రియుకూడ మత్తుచే నేలకొరిగిరి. ఇక నచ్చట నిశ్శబ్దముగానుండెను. దీపము మాత్రము వెలుగుచునేయుండెను. అట్టి

సమయమున నాయువకురాలు లేచి బిరబిరగా నడచి వెలుగు
సమీపమునకుచేరి క్రొవ్వువత్తి వెలిగించుకొని గుహతలుపు
తెఱచి లోపల ప్రవేశించి కొంతసేపటికి బయటికివచ్చి కొండ
ప్రక్కనున్న వృక్షము దాపునకుజేరి కావిరంగుగుడ్డలను దండక
మండలమును రుద్రాక్షమాలికను తీసికొని తాను వచ్చిన మార్గము
ననే తిరిగి యరణ్యమున నడచుచుండెను. అప్పటికి రాత్రి తెల్ల
వారజామైదుగంటల కాలమైనది. ఇట్లాయువతి నడువగా నా
దారిప్రక్క నొక్కచో వృక్షసమూహము కనబడెను. అది
యొకశృంగారస్థలము. అందొక కొలనగుపడ దంతముల శుద్ధిచేసి
కొనుచు నచట కూర్చుండెను. ఇంతలో నేదియో చప్పుడు
వినబడ లేచి మార్గమువైపుజూచెను. ఒక యువకుడు భల్లూకము
వెంట బరువెత్తుచుగాన్పించెను. కారణము తెలియదు. అట్లు
పరువెత్తి యువకుడు భల్లూకమును సమీపించి రెండు మూడు
బాణములు దానిపై బరపెను. ఆ దెబ్బలకు నిలువంజాలక
నామృగము తననోటిలోని హారమును క్రిందవిడచి యరణ్యమున
కడ్డముగా బరువెత్తెను. ఆహారమును తీసికొని యటు నిటు
త్రిప్పిచూచి యమితానందాశ్చర్యములు మనంబుననిండ నీహార
మెక్కడిదో యనుకొనుచు నాలోచించి తెలియక కన్నులు
మిఱుమిట్లుగొల్ప నాహారమును మెడలోవేసికొని తిరిగిపోవు
చుండ మార్గమధ్యమున నొక బైరాగి గాన్పించెను. అతనికి
పదియారు పదునెనిమిది వత్సరములుండును. బ్రహ్మచారి
దండకమండల రుద్రాక్షమాలికలు కలిగి శాంతశమదమాది
సద్గుణములచే విరాజిల్లుచుండెను. ఆ యువకునిజూచి యా
బ్రహ్మచారి నీవెవ్వరవని ప్రశ్నింప నావ్యక్తినే నొక దిక్కు
మాలిన వాడనని సమాధానముచెప్పెను. ఒంటరిగా నీకాననం
బున దిరుగ గతంబెయ్యదియన నా పూర్వజన్మ పాపఫలంబని
చెప్పి వెడలిపోయెను. తదుపరి యాయోగి తనమదిలో
నేమేమియో యనుకొని చింతాక్రాంతుడై తన నేత్రములనుండి
నీరుకారగా యువకుడు పోవుమార్గమువంక వీక్షించుచుండెను.
ఆతడు దృష్టికి దూరమైపోయెను. ఆ బైరాగి దుఃఖించుటకు

కారణమేమి. అట్లాతడు పోయిన వెనుక నాగోసాయి యతని వృత్తాంతము పూర్తిగా తెలిసికొననందులకు తన్ను తాను నిందించుకొనుచు చేయునదేమి లేక పరిపరివిధముల నాలోచనాయత్తచిత్తుడై యామార్గముననే నడచుచుండెను. ఆ యువకు డెచ్చటి కరిగెనో ఆ బ్రహ్మచారి యే ప్రదేశమున కేగెనో యెవ్వరికి తెలియును? సరోవరమున శతపత్రములు మాత్రము వికసించుటకు ప్రారంభించెను. అందుండి భ్రమరములు బయటబడి పరువులెత్తుచుండెను.

## 4

మణిపురంబున ప్రాతఃకాలమున ప్రభాతకన్యలు పళ్ళెరంబుల పుష్పంబుల నిడుకొని రాజనగరున కరుగుచుండిరి. వారా కోట సమీపమున కరుగుతరి కోటలో నేడ్పులు వినవచ్చెను. ఆ యేడ్పులేమిటని ద్వారము సమీపించిరి. ఇంకను మిక్కిలి రోదనశబ్దములే. కొందరు భటులాయుధముల ధరించి కోటలోనికి పరుగిడుచుండిరి. మరికొందరు కోటలోనుండి యశ్వారూఢులై ఖడ్గంబుల కేలం ధరించి రాజవీధులంబడి పట్టణ మిరు వైపుల మార్గంబులంబట్టి పోవుచుండిరి. కొందరు హత్యహత్య యని పరుగిడుచుండిరి. ఏమిహత్య యేమియేడ్పులు, ఏమియు నర్థమగుట లేదు. అంత నాకన్యలు లోనికేగిరి. ఆయేడ్పు వారెవ్వరు పట్టణపురాణియు, రాకుమారితయు వారిం జూచి యచటి వారందరు నేడ్చుచుండిరి. కాని యిది చెప్పువా రొక్కరును లేరైరి. ఆ కన్యలకేమియుం దెలియక నొక సేవకునిం బిలిచి యాదుఃఖకారణ మడుగగా నాటిరాత్రి నగరున చోరత్వము జరిగెననియు రెండులక్షల విలువగల బంగారు నగలును కొన్ని రత్నములను రాకుమారు పదుమూడేండ్ల వయస్సుగల విద్యార్థిపుని యెత్తుకొని పోయిరనియు నందువలన నింతఘోరముగ నేడ్చుచుండిరనియు చెప్పెను. అది వినగనే యాజవ్వనులు విరుల నచటజల్లి వ్యాకులాయత్తచిత్తులై వెడలి పోవుచుండిరి.

చదువరులారా! ఒక్కమారు రాజనగరు వీక్షింపుడు. రాజగు రామసింహుడు మంత్రితో నేమియో చెప్పబోవుచుండెను. గాని నో టిసుమంతైనమాట వెలువడుటలేదు. నోరు దెరచిన దుఃఖించుటయే కన్నులు దెఱచిన నీరు కారుటయే. ఇఁక రాణియు రాకుమారితెయు వాపోవుటయే పాపము వాపోవక నేమిచేయుదురు? రామసింహునకు నొక కుమారితెయు లేకలేక వ్రతములబట్టి నీ కుమారుడును గలిగెను. విమ్యుద్దీపుడని పేరుబెట్టుకొని యల్లారుముద్దుగా నత్యంత గౌరవముతో బెంచుచు కన్నులపండువుగా జూచుకొని యానందించుచు రాజ్యమునకతడే నాధుదగునను యాశతో కాలము గడుపుచున్న వారి యాశభంగమైనదన్న వారి హృదయంబులెట్టు తల్లడిల్లునో వేరుగ చెప్పనేల. ఇంతయేల నచటికిపోయిన నెట్టి పాషాణహృదయులైనను పెద్దపెట్టున బావురని యేడ్వక తిరిగిరారు ఈ వార్త పట్టణమెల్ల యెడల వ్యాపించెను. ఎచట విన్న నీబాలునిగూర్చి మాటలాడుటయే. ఎచట జూచినను గుంపుగా గూడి జనముండుటయే. అట్లా ప్రభాతకన్యలు బయల్వెడలి పోవుచుండ నుదయ మెనిమిది గంటలకాలమున నొక గల్లీ పాడుబడిన గోడక్రింద నొకతిన్నెపై నిరువదేండ్ల యువకునిజూచిరి. వాని దేహమున నంగీయును ధోవతియు నుండెను. అవియు చాల ప్రాతవి. వెంట్రుకలు చిక్కులుపడి జడలుకట్టి శరీరము బలము తగ్గియుండెను. కాని ముఖకాంతి మాత్రము తగ్గలేదు. ఏలకో నచట కూర్చొని యేమియో యాలోచించుచుండెను. అంత నాకస్యకలలో నొకతె రాఁ నగిరుసకు పరుగిడెను. ఇద్దరు భటులాయువకుడుండు స్థలమునకు వచ్చి యాతని కోమలకరములకు సంకెళులువైచి బంధితునిగా జేసి లాగుకొనిపోయి యుద్యానవన సమీపముననున్న కారాగారములోనెట్టి కవాటములు బంధించిరి. ఆ కారాగారమంధకారబంధురమై పాతగృహముగానుండెను. ఆవ్యక్తి యటునిటు తిరిగిచూచెను. అంతయు గాఢాంధకారమే. నన్నేలనిట్టి యింటిలో బడవేసిరి? ఆ భటులెవ్వరు? నేనేమి

చేసితినని నన్నిట్టీచీకటి కొనలో గాలిపీవని స్థలములోనుంచిరి? నా శరీరమంతయు చెమ్మటగ్రమ్మి యూపిరాడకున్నది. నాకు కారణము చెప్పు వారెవ్వగని యా వ్యక్తి కేమియుం దోచక మనంబునం దేమేమో యనుకొనుచు నొక మూలనపడియుండెను ఎంత యూహించిన నేమియు తెలియలేదు. కొంతసేపటికి మనుష్యుల కాళ్ళచప్పుడు వినవచ్చెను లేచి కూర్చుండెను. కిటికీ తెరువబడెను. వారెవ్వరు? రామసింహుడు, ఆతని సేనాధిపతి రామసింహుడు సేవకునిబిలచి, ఒరీ! ఈ దుష్టుని ముఖము తిలకించిన మహాఘోరవాదినరకము లనుభవింపవలసివచ్చును. ఈ క్రూరునకు నర్థమండలము రోజు లాహారము నొసంగక కృశింపజేయుము.

తదుపరి చేయవలసినది వివరించెదనని వెడలిపోయెను. ఆ యువకున కీ వాక్యములు కర్ణశూలములై బాధింపజొచ్చెను. ఆ! నేను దుష్టుడనా! నేనేమి క్రూరత్వము వహించితిని. ఇన్ని దివసము లాహారములేక నేనెట్లు కాలముగడుపుదును. తదుపరి యింకేమియో జేసెదరట. ఆహారములేక కృశించి చచ్చిన వానినేమి జేసెదరు? వారెవ్వరో లోపలనువచ్చిన దెలిసికొందును. నాముఖమునే చూడగూడదని వెళ్ళిరి. హావిధీ! నన్నిట్లేల పుట్టించితివి. నాకుంజూడ నిదియొక నరకకూపము వలెనున్నది కాని గృహమువలె దోచుటలేదు. అట్లా రామసింహుడు కిటికీ తెఱచుటవల్ల కొంత వెలుగువచ్చెను. ఆ వెలుగు సహాయమున నటునిటు పరికింప నాల్గువైపుల నాల్గు గవాక్షములు గాన్పింప వానిని దెరువ ధారాళముగా గాలియు మంచి వెలుగువచ్చుచుండెను. ఆ చల్లని గాలి శరీరముపై తగులుటచే కొంత యలసట యుపశమించెను. మఱియొక వైపుజూడ నొక గవాక్షమునకు సరిగా నొక బల్లయుండ దానిపైనెక్కి కూర్చొని ప్రకృతి నిరీక్షించుచుండెను.

ఓ పాఠకమహాశయులారా! ఆ ప్రదేశమువైపు నొక్కమారు దృష్టి బరపుడు. ఆ కారాగారపు దక్షిణదిక్కున నొక యుద్యానవనముండెను. దానిచుట్టు నంబగమును గాకు పనును

జోంపములను, మధ్యఖర్జూరపనస జంబీర చూతకీపాటలీచందన నారికేళ లవంగ కపిద్ధాదులగు భూరుహంబులుగలిగి మల్లె మొల్ల విరజాజి మందారకుందారవింద పున్నాగ పారిజాతాది కుసుమంబులు వికసించి మాలతీమల్లికాది లతలు మామిడిచెట్ల కల్లుకొని పారావత సారసశుకపిక చారిక తిత్తిరి మయూర కోకిలా నినదంబుల నిండుకొని కాంచన మణిమయ కుడ్య ప్రదేశంబులుగలిగి చూపరుల చిత్తంబుల నాకర్షించుచుండెను. లోపలిభాగమున కారాగార సమీపమున నొక సరస్సుండెను. ఆ సరః ప్రాంతమున చల్లని నీడనిచ్చు మామిడివృక్షములు వాని మధ్య నల్లిబిల్లిగా నల్లుకొనిన పూపొదరిండ్లు గలిగి యా తరువులకు ద్రాక్షతీగెలు ప్రాకుకొనిపోయి గుత్తులుగుత్తులుగా కాయలు ప్రేలాడుచు పరిమళమిచ్చుచుండెను. ఆ సరోవర తీర ముత్తరభాగమున నశోకవృక్షంబునకు మల్లెలతలల్లుకొని చలువపందిరివలె చల్లనై దానిక్రింద చంద్రకాంత మణులచే చెక్కబడిన శశికాంత శిలావేదికయును, దానిచుట్టు నవరత్నములు స్థాపింపబడిన చిన్న-చిన్న యరుగులు గలిగి మిక్కిలి శోభావంతమై యుండెను. ఆ వృక్షముల కల్లుకొనియున్న మల్లెతీగల పుష్పములు వికసించి పరిమళమిళితమైన చల్లగాలి కా చంద్రకాంత శిలావేదికపై పుష్పవర్షంబు కురియుచున్నట్లా విరులు జల్లుజల్లున రాలుచుండును. అప్పటికి సాయంత్రమైదు గంటలైనది. చల్లగా మలయమారుతంబు వీచుచున్నది. వృక్షంబులపై మయూరములు కుంచెలువిప్పి నాట్యములు చేయుచుండెను. వసంత ఋతువగుటచే తియ్యమామిడి చిగురుటాకుల మెక్కి పంచమ స్వరంబున కోకిలలు కూయుచుండెను. ఆ సరోవరమందుండు జలకుక్కుట బక చక్రవాకములు స్వేచ్ఛగా తిరుగుచుండెను. రాజహంసలు తామరతూండ్లను నోట గఱచుకొని నీళ్లపై తేలియాడుచుండెను. తామరపద్మములలోని మధురమునుగ్రోలి తుమ్మెదలు ఝుమ్మని నాదములు జేయుచుండెను. ఇట్టి కాలమున నా ప్రదేశమునుజూచిన నెట్టి మనుజుని ఘోరదుఃఖమైనను పటాపంచలై పోవునుగాని వేరు గాదు.

ఇట్టి కాలమున నా చంద్రకాంత శిలావేదికపై నవయౌవనముచే నిండుకొనిన యొక కన్యకారత్నము కూర్చొనియుండెను. ఆ కన్నె చక్కదన మేమనివర్ణింతము. చక్రవాకములం బోలిన స్తనద్వయమ్ముపైని కుంకుమ లేపనము సన్నని పైటపై నెట్టనికాంతి నిచ్చుచుండెను. తత్కుచద్వయముం జూచి తమజాతి పక్షులని భ్రమకొంది బటువుగువ్వలు పరుగుపరుగునవచ్చి తిరిగిపోవుచుండెను. తమ్మిరేకులసొబగు సమ్మతింపని నేత్రయుగ్మముచే నొప్పి సొంపుగల్గుచున్న వదనమండలమునుజూచి చంద్రుడు క్రిందబడెనని భ్రమజెంది భాస్కరుడు తదేక నిష్ఠతో దిలకించుచుండెను. ఇట్లు జూచు విభాకరుని వెర్రితనంబునకు నవ్వువచ్చి స్వాతికార్తె తీగమెఱుపును బోలిన యా సతీతిలకము దేహకాంతి చంద్రికలు దివాకరు జేరంబోయి చిత్తభ్రమవీడి యాస్త్రాద్రికరుగుమని హెచ్చరించుచుండెను. తుమ్మెదరెక్కలను వరుసవరుసలగా పేర్చినట్లు భ్రాంతిజనించి కీల్జడను కృష్ణసర్పముగానెంచి రివ్వుమను ధ్వనితో వైనతేయుడునచ్చి విఫలమనోరథుడై వియన్మార్గమున కెగురుచుండెను. లేనడుమను తాబేళ్లను ధిక్కరించు మీగాళ్లను గలిగి లలాటంబున కస్తూరి తిలకముతీర్చి కావిరంగు పావడగట్టి దానిపై జిలుగు వలువనుధరించి చిలుకపలుకులకు సరివచ్చు వాక్యములచే భాషింపుచు కూర్చుండెను. కాని సుధాంశునియందు మచ్చ జనించి కళంకము కలుగజేసినరీతి నామె ముఖబింబమున దీనత్వము సూచించుచుండెను. ఆమె యెవ్వరు? రామసింహుని కూతురగు విద్యుల్లతయే ఆమె శోక కారణమేమని వేరుగ దలంపవద్దు. అందుల కామె సోదరుడగు విద్యుద్దీపుడే కారణమని యూహింపనగును. ఆ కాంతారత్నమునకు ప్రక్కలనున్న చెలులు నామె నోదార్చుచుండిరి. వీరు నా కారాగారములోనున్న యువకుని కంటబడిరి. ఎప్పుడా సర్వాంగిసుందరిని కన్నులార గాంచెనో తాను బంధితుడుగానున్న సంగతికూడ తలంపక, మైమరచిపోయెను. ఆతని కన్నులకు వనలక్ష్మింబోలి జూపట్టుచుండెను. కొంత

వరకు రెప్పవార్ప కన్లే పైదృష్టి మరల్చుకొనలేకపోయెను. నాకేమో మోహమతిశయించుచున్నది. ఈమె యెవ్వరు ? వివాహితయా ? అవివాహితయా ? నాకెట్లు తెలియును. ఇంకేమియో లోలోపల నసుకొనుచు కూర్చుండెను. ఇంతలో కారాగారము జ్ఞాపకమునకు వచ్చెను. గుండె జల్లుమనెను. అయ్యో ! ఏమి నా యవివేకము, ఆహారములేక చావనున్న వానికీ ప్రేమయేల ? ఆహా ! మానవుని కోరికలకు మితిలేదు కదా ! నా కన్నుల చాంచల్యముతోబాటు మనస్సును బోనిచ్చు టుచితంబుగాదని గట్టిగ నేత్రములను మూతవేసు కొనెను. ఆకలి మంటచే శోషవచ్చి బల్లపై బడిపోయెను. అక్కడ నా విద్యుల్లత చెలులంజూచి సఖులారా ! రత్నము లను నా జెరువులను గొంపోయిన వారట్లు పోరనే పాప మెరుగని పసిబాలుడే మపరాధమొనర్చెనని కన్నుల నీరు విడచెను.

చెలి :— అమ్మా ! ఆ శిశుహంతకుని యుదయముననే బంధితునిగా జేసి కారాగారములోనుంచిరి నీకుc దెలియునా ?

విద్యు :— (ఆత్రముతో) వాండెట్లు చిక్కెను? మా విద్యుద్దీప్తుడుం గానా ?

చెలి :— తల్లీ ! ప్రత్యూషసమయంబున ప్రభాతకన్యలు బజా రున బోవుచుండ నొక్కచో వానింజూచిరి. మన విద్యుద్దీప్తుని కంఠమున కలంకరింపబడిన హారము వాని మెడలోనున్న గుర్తుపట్టి వారీ సంగతి భటులకుం జెప్ప తక్షణమే వారు వానిని బంధించి కారాగార బద్ధునిం జేరిరి.

విద్యు :— నా సోదరు నేమిజేసెనో యడుగలేదా ?

చెలి :— మీతండ్రిగారు దుఃఖమున నింకను విచారింపలేదు. ప్రస్తుతే మిరువది దినము లాహారము పెట్టకుండు నట్లా జ్ఞాపించెను.

విద్యు :— చెలీ ! వాని కంఠమును ఖండించి కాకులు గ్రద్దలు తన్నుకొని పోవునట్లుగ గగనమున కెగురవేయక నెందు కూరకుండెను ?

అని యిట్లొకరితో నొకరు సంభాషించుకొనుచు నస్తమానము కావచ్చినదని యచటనుండి లేచి చోర బంధితభవన సమీపముగా తమసౌధమునకు తిరిగి వచ్చుచు విద్యుల్లతయా కారాగార గవాక్షమువైపు క్రీగంటంజూచెను. లోపల బల్లపై నవమన్మథాకారునివలె పరుండియున్న యౌవనపురుషుడు కంటబడెను. చూచుటతోడనే యాయువతి నిశ్చేష్టితయై చిత్తరువు బొమ్మవలె నిలువంబడెను. ముందున కడుగిడలేకపోయెను. అధరమదరుచుండ నానారీమణి వాడి చూపు లాయువకునిపై ప్రసరించుచుండెను. గండఫలకములపై స్వేదబిందువు లుత్పన్నమాయెను. మనస్సంతయు మన్మథబాణాగ్ని కాహుతియై సన్ననినడుమల్లలాడ, చీరకట్టూదలుచుండ, గబ్బిగుబ్బలు గగుర్పొడువ రవికెపిక్కటిలి పమిటజార దేహమంతయు పులకాంకురమగుచుండెను. ప్రేమమయమైన కోరికలూర నసంఖ్యాకములగు నాలోచ లామె హృత్కమలమున బెనంగొన నిట్లనుకొనెను.

ఆహా! ఈ మహాపురుషుడెవ్వరు? వీనింజూడ నాకు ప్రేమ మోహకామము లుదయించుచున్నవి. ఈతడేమి? చోరత్వమున శిశుహత్యజేసి హారమును గైకొనునేమి? ఈతనింజూడ ముఖము దయాపూరితమై శుభలక్షణలక్షితమై కరచరణంబుల హలకులిశకలశతోమరశంఖచక్రగజాది బహువిధరేఖలుంగలిగి క్షత్రియకుమారునివలె గాన్పించుచుండెను. అయ్యో! పాప మీతని మృదుహస్తములు సంకెళులఱ్రశనుచే కందియెఱ్రబారియుండెను. ఈ సుందరు డిట్లగుటకు కారణమేమిగైయుండవచ్చును? నాకు వీని వృత్తాంతమెట్లు తెలియును? కిటికిచెంతకుబోయి పలుకరింతునా? అట్లనుకొనిన నాకు సిగ్గు జనించుచున్నది. నేనిప్పుడేమిచేయవలెను. ఇట్లనుకొనునంతలో నెవ్వరో తన్ను బిలచినట్లు కేకలు వినబడెను. వెంటనే వారు కోటవంక నడచిరి. అప్పటికాదిత్యు డస్తమించెను. సర్వసౌందర్యరాశియగు నప్పాటలగంధి దాటిపోవ నాప్రదేశమంతయు కళాహీనమై నల్లగా నగుచున్నదన చీకటిక్రమ్ముకొనుచుండెను ఎచటజూచిన నంధకారము. కారాగారమున గాఢాంధకారము.

# 5

హిమాలయ పర్వతమున కుత్తరభాగమున రెండు క్రోసుల దూరమున సత్యపురి యను నొక చిన్న పల్లెయుండెను. దాని చుట్టు భీకరారణ్యమే కాని యీ పురముచుట్టు ప్రదక్షిణము చేయుచున్నదోయన నొక నది ప్రవహించుచుండెను. దాని కిరువైపులమాత్ర మిసుకతిన్నె లందముగా నిండుకొని యుండెను సాయంత్రము సైకతస్థలములందు గూర్చొన్న నాచల్లనిగాలి కెంత శ్రమయైనను తొలంగును. అచ్చటచ్చట పుష్పజాతి చెట్లు మరింతశోభను గలుగజేయుచుండును. ఆ పల్లెలో శృంగారమైన యిండ్లులేవు. అచట నివసించు జనుల నీజాతి వారని సరిగా నిర్ణయించుటకు వీలులేదుకాని వారందరు కడు సహాయకులు. వారికి నొక వృద్ధస్త్రీ పెద్దగానుండెను. ఆమె మాటలను వారందరు బాగుగావినుచు నవ్వగారని పిలుచుచుందురు. ఆ యవ్వగారి కతిథిపూజల యందాసక్తిమెండు. ఆమె యిల్లుమాత్రము గొప్పదియై శుభ్రముగానుండును. ఇంటి వెనుక భాగమున దొడ్డిలో నొక మంచినీటి బావియును కమ్మని తావినిచ్చు పుష్పజాతి చెట్ల వరుసలును గలిగియుండెను. ఇంటి ముందుభాగమున విశాలమైన ప్రదేశమును దానికి ప్రహరీయును గలిగి చాల యందముగా నుండును. వంటగది మాత్రము ప్రత్యేకముగానుండెను. గ్రామములో స్త్రీలందరు నా యింటిలోనికిచేరి రాట్నములను బెట్టుకొని పాటలను బాడుచు పుణ్యకథలను జెప్పుకొనుచు సంతసమతిశయించుచుండ నూలువడుకుచుందురు. అచ్చట వారిని జూచుచు కూర్చున్న నెట్టివానికైనను బ్రొద్దుపొడిచినది గ్రుంకినది తెలియక మైమరచి పోదురు. ఇక నవ్వగారి విషయమాలోచింతము. ఉదయముననే లేచి యిల్లు శుభ్రముచేసి ముగ్గుపెట్టి స్నానమాచరించి పడమటింటిలోనున్న కృష్ణుని విగ్రహమును భక్తితో పూజించి నారికేళాదిఫలహారముల నచటనున్న వారికి పంచిపెట్టి తదుపరి

వంట జేసికొని భుజించుచుండును. ఆ యవ్వగారు సుమారు మూడేండ్లవయస్సుగలిగిన నొక బాలుని బహుప్రేమతో బెంచుచుండెను. ఆ బాలుడెవ్వరో తరువాత నాలోచింతము. ఒక రోజుదయ మెనిమిదిగంటలకాలమున నవ్వగా రూయలలో నాబాలుని పరుండబెట్టి యూపుచుండెను. ఇంకను గ్రామములోని స్త్రీలచటికి రాలేదు. అట్టి సమయమున నవ్వగారింటికొక బ్రహ్మచారివచ్చెను. ఆ బ్రహ్మచారిని చూచుటతోడనే యామె యెదురుగా జని భక్తివినయములు ప్రజ్వరిల్ల మ్రొక్కి పాదములను గడిగి తజ్జలమును శిరమున జల్లుకొని లోపలకు దోడ్కొనిపోయి పీఠముపైఁ గూర్చుండజేసి స్వామీ! మీరాక వలన నేను ధన్యురాలనైతిని మద్గృహము పావనంబయ్యె. మహానుభావా! మీనివాసమెద్ది? ఇప్పుడెచటి కరుగుచుంటిరని యడుగ నవ్వా! నాయాశ్రమము రామేశ్వరముకడనున్నది నేను హిమాలయపర్వతమును జూచు నిమిత్తము బయల్వెడలి యాయాగిరులను, పుణ్యతీర్థములను దర్శించి మరల పోవుటకు దారితెలియక యిచటికివచ్చితిని. ఇక మా యాశ్రమము చేరుదునని నాకు నమ్మకములేదు. మాబోటి సన్యాసుల కెచట నుండిన నొక్కటియే కావున నిక్కడెక్కడనైన మంచిస్థలము జూచుకొని యుండవలయునని సంకల్పించుకొంటినన నాయవ్వగారు మహాత్మా! ఎచ్చటనో యుండనేల? ఇచ్చటనేయుండి నాకు మోక్షమార్గమును బ్రసాదించి నన్నుకృతార్థురాలిని జేయవే యని యనేకవిధంబుల స్తుతింప నందుల కాతఁడు మంచిదని తలయూపి యచటనే నివసింప మనంబున నిశ్చయించుకొనెను. ఇంతలో నాబ్రహ్మచారిదృష్టి యూయెలపై బ్రసరించెను. నవకోటి మన్మధాకారుని మాడ్కి సౌందర్యరాశియైన నబ్బాలుడు బ్రహ్మచారి కంటబడెను. ఆ తాపసి వెంటనే యత్యాశ్చర్యమానసుడై లేచి యూయెలను సమీపించి బాలుని సర్వాంగమును దిలకింప రాజచిహ్నము లాతని దేహమున గాన్పించుచుండెను. ఆ బాలు నైదువ్రేళ్ళకు నైదుయుంగుళీయకములు బాలసూర్యులంబోలి ప్రకాశించుచుండెను. అంత

నాతాపసికి నాయవ్వకు నీ క్రిందిరీతిగా సంభాషణ జరిగెను:

బ్ర :— అవ్వా ! యీ బాలుడెవ్వరు ?

అ :— మహాత్మా ! ఈ బాలుడెవ్వరో నాకు తెలియదు.

బ్ర :— నీకు తెలియకపోయిన నెట్లు లభించెను. నీచే పెంప బడుటకు కారణమేమి ?

అ :— మహాత్మా ! నేనొక రోజుదయమున మనకు శమనదిక్కునరణ్యమునకు నొక చెట్టుకొఱకుబోయి వెదకుచుండ ముండ్లగుట్టల నడుమ రోదనముజేయుచు నీబాలుడు గాన్పించెను.

బ్ర :— అయ్యయో ! గుట్టటలనడుమనా? అచట నెవ్వరులేరా?

అ :— యెవ్వరునులేరు. ఈ బాలుడక్లెందుకుండెనో తెలియదు.

బ్ర :— అవ్వా ! సమీపమున నెచ్చటనైన గ్రామములున్నవా?

అ :— సమీపమున మాపురముతప్ప యింక నొక చిన్న పల్లె కూడలేదు.

బ్ర :— మరి యీ బాలు డెచ్చటనుండి వచ్చెను ?

అ :— అదే చిత్రముగానున్నది. చోరులేమైన నిట్లు చేసిరేమో యనుకొంటిని.

బ్ర :— చోరు లీపని చేయుటకు నీ బాలుడేమడ్డమువచ్చెను?

అ :— అది కూడ నాలోచించవలసిన విషయమే.

బ్ర :— ఇది కాక చోరులేరైన నీవజ్రవైఢూర్యస్థగిత యంగుళీయకముల దీసికొనక నేల విడుతురు?

అ :— అందువలననే యేమియు దోచకున్నది.

బ్ర :— తదుపరి యేమి జేసితివి?

అ :— మహాభాగా ! చెప్పెదల నాలకింపుము. అంత నేను నీబాలు నెత్తుకొనివచ్చి కడుప్రేమతో బెంచుచుంటిని. ఇంతవరకు మాబాలుడని వచ్చినవారుగాని మాబాలుడు పోయెనని యనుకొనువార్త వచ్చిగాని యెరుగను.

బ్ర :— అవ్వా ! నీ వరణ్యమునకు నొక చెట్టు వెదకుటకై పోతినంటివి. అదియేమి చెట్టు ? ఎందుకొఱకు ?

అ :— మహాత్మా ! నీకు తెలియుతాని యంశముండునా?

అయినను చెప్పెదనురమ్మని యింటిలోనికి తీసికొనిపోయి కూర్చొని వా రిరువు రేదేదియో కొంతకాలము మాట్లాడు కొనిరి. అంత నా యవ్వ వంటజేయుటకు ప్రారంభించెను. గ్రామములోని స్త్రీలు రాట్నములను తీసికొనివచ్చి బ్రహ్మ చారికి నమస్కరించి, ఊయలలోనున్న బాలుని యెత్తుకొని కొంతవరకు ముద్దులాడి యచటనే పరుండబెట్టి వారందరు నూలు పోగులను తీయుటకు ప్రారంభింప బ్రహ్మచారి వారిని జూచుచు కూర్చుండెను. ఇంతలో నా యవ్వ వంటజేసి బ్రహ్మ చారిం బిలిచి భోజనముపెట్టి తదుపరి తానుగూడ భుజించెను. పిమ్మట వా రిరువురిమధ్య వా బాలుని కూర్చుండపెట్టుకొని వాని చేష్టలకూ సంతసించుచు నా స్త్రీలపాటలను వినుచు నా రోజు గడపిరి. మరునా డుదయమునలేచి బ్రహ్మచారి పుణ్య స్థలములను, అరణ్యభాగములను జూచివచ్చెదనని చెప్పిపోయి సాయంత్రమునకు వచ్చెను. ఇట్లే ప్రతిరోజు నేదోయొక నెపంబునపోయి వచ్చుటతో తిరిగి రెండురోజులకు మూడు రోజులకు వచ్చుచు పోవుచుండును. ఒకరోజా బ్రహ్మచారి యరణ్యమార్గమున బోవుచుండ నా దారిప్రక్కనున్న తటా కము కట్టపైని వటవృక్షమునకు నొక యినుపగొలుసు కట్టబడియుండెను. దానిని సమీపించి ప్రక్కలజూచెను. మనుష్యులజాడయే కానరాదయ్యె మరల గొలుసువైపు దృష్టి బరపెను. ఆ గొలుసు మధ్య సుందరముగా నొక యిత్తడి రేకు పొదుగబడియుండి దానిపై లోభగుప్త మహారాజు—అను నక్షత్రములుండెను. దీనినిచూడగనే గుండె జల్లుమనెను. అది యిట్లుండుటకు కారణము తెలియకపోయెను. చోరులు తీసికొనివచ్చిరనుకొన్న నీ వృక్షముకేల కట్టెదరు? ఇచట తిరిగిన మనుష్యుల నడుగులు జూచిన తడినేలబడిన యడుగు లుగా నున్నవి. గొలుసునకు తడిమట్టి యంటుకొనియుండెను. ఇచటనొక శకటము పోయిన జాడయు నశ్వముల యడుగుల గుర్తులుకూడనున్నవి. కొద్దిగా వర్షము కురిసి పదిరోజులపై కాలమైననని. దీనినిబట్టిచూడ తొమ్మిది పదిరోజులక్రిందట

దీనిని కట్టినట్లు దోచుచున్నది. అని యిట్లు కొంతవర కాలో చించి, వృక్షమునకు కట్టబడిన గొలుసును విప్పి మరుగుగా నున్న గుట్టలోపెట్టి తన హృత్కమలమున నెన్నెన్ని యూహలో బెనంగొన నా మార్గముననే నడచుచుండెను.

# 6

ఉదయపురమున లోభగుప్త మహారాజు మంత్రులాదిగాగల వారిం గూడుకొనియుండ నలుగురు క్షత్రియకుమారులు శరీరములు చెమ్మటచేనిండి యత్యలసటచేవచ్చి కూర్చుండిరి. వారిం జూడ దూరగమనముచే మార్గాయాసమును బొందినారని చెప్పకయే దెలిసికొనవచ్చును. వారినిజూచి లోభగుప్తుడు రసపుత్రులారా! ఏల యిన్నినాళ్ళుండిరి? మదనమోహనుని సంహరించితిరా యని యడిగెను. అంతవారు రాజా! మేము చంపలేదు కాని వా డిగివరకు చచ్చియేయుండును. అబ్బా! యిట్టి కష్టములు మే మెప్పుడు పడియుండలేదు. ఇంక మీ దర్శనముగూడ లభింపదను నధైర్యముజెంది తుదకు భగవంతుని కరుణాకటాక్ష వీక్షణమువల్ల బ్రతికితిమనగా నీ మాటలువిని లోభగుప్తు డాతురతతో మిత్రులారా! మీకంత శ్రమయేల కలిగెను? మదనమోహను నేలవిడిచితిరి? మీరు జంపకుండిన వాడెట్లు జచ్చును? త్వరగా జెప్పుడనియడుగ నా వచ్చిన వారిలో నొక యువకుడిట్లు చెప్ప నారంభించెను.

అయ్యా! మేమును మదనమోహనుడును ఇచటనుండి బయిలుదేరి యశ్వారూఢులమై పోవుచుండ దుశ్శకునములగని వాని ఫలమేమని మమ్ముడుగ నేమేమియో సమాధానములం జెప్పుచు సాయంత్రమగుసరికి వెదుళ్ళగట్టడవికిజేరి యారాత్రి యచ్చట నివసించితిమి. అచ్చటచ్చట చిన్నచిన్న పల్లెలుండుటచేతను మదనమోహనుడు మెళుకువగా నుండుటచేతను జేయునదేమిలేక యుదయమునసే లేచి మూడవనాటికి హిమా

లయ ప్రాంతముననున్న ఘోరారణ్యమున బోవుచు వాని గుఱ్ఱముపైనున్న ధనస్సును, అంబులపొదియును వానికి దెలియకుండ దీసి పాఱవైచితిమి. తదుపరి కొంతవరకుపోగా నా మార్గమున కిరువైపుల క్రిక్కిరిసినట్లు వృక్షసమూహములు దట్టమై భీతినిగల్పించు భీకరారణ్యముచేరి ఇదే మంచియదననుకొని మా తురంగంబుల వాని దగ్గఱకుం బరపి మేమందరమొక పెట్టున వారలనుండి కత్తులందూసి నఱుకబోవ తటాలున మదనమోహాను డశ్వమునుండి యా వృక్షముల వరుసకావలవైపునం దూకి గానిపించకపోయెను. అంత సింహగర్జనమునకు బెదరి మా గుఱ్ఱములు పరుగెత్తె వానిగుఱ్ఱ మెటుపోయినదో కాని మేముమాత్రము దారిదప్పి యరణ్యమంత చెడ తిరిగి వేరొక మార్గమునుగని వచ్చుచుంటిమి. ఆ మదనమోహానుడు పోయిన భీకరారణ్య మెట్టిదని చెప్పుదుము. వృక్షశాఖల విఱచుకొని కుక్షినిండ మెక్కి మత్తగజములు ఘీంకారములు జేయుచు నొకటితోనొకటి పోరాడు పెటపెటార్భటములు కొండలు కొండలు తాకుచున్నట్లు వినబడుచుండెను. వేఱొకదిక్కు గిరి గహ్వారంబుల మాఱ్ఱ్మోతలిడ సింహగర్జనంబులు శరభమృగము లఱపులు, పెద్దపులుల గాండ్రింపులు నిండుకొని యుండెను. అట్టి నరసంచారములేని ఘోరారణ్యమున రిక్తహస్తములతో పరుగిడిన వాడింకను బ్రతుకునా? ఏ మృగముల వాతనోబడి యీపాటికే విగతజీవుడై యుండవచ్చును. అప్పటికి జగమంతయు చీకటి వ్యాపించెను. అంత మేమామార్గంబున శరవేగంబున తురగము లుఱుకునట్లదలింప దారిగానక వాజినములు పాడుబడిన కొలనులో దుమికెను. వెంటనే నీరుయింకి బురదతోనిండుకొన్న పూడు మట్టిలో గుఱ్ఱములు గ్రుచ్చుకొని పైనున్న మేము వక్షస్థలముల వఱకు గ్రుచ్చుకొంటిమి. ఎటు లేవబోయిన నింకను దిగబడుటయే? పాపమా తురగముల కూపిరాడక చచ్చియుండవచ్చును. కాని మేము మాత్రము చేయునదేమిలేక వాటిపై నట్లే పది దినముల వఱకు నాహారములేక భగవంతుని ధ్యానించుచు బ్రతుకుపై

నాసవిడచి కూర్చుంటిమి. ఎటుజూచిన జనశూన్యమే. పదు నొకండవరోజుదయమున నా కోలనుయొద్దనయున్న వృక్ష ముపై మర్కటముసెక్కి దానిఖల నూపుచుండగా వంగిన శాఖలను పట్టుకొని పైకిబ్రాకి చెట్టుపైనెక్కి క్రిందికిదిగి మెల్లగా నడచివచ్చితిమి. మా అశ్వములుమాత్ర మక్కడనే యంతరించెను. అందువలన నిన్నిరోజులు గడచుటకు కారణమై యున్నదనెను. అంతవారు కొంతవర కేమేమియో మాట్లాడుకొని చివరకా వచ్చినవారిలో నొకడు రాజుతో నిచ్చట విశేషములేమియని యడుగ జెప్పెదను రండని వారిం దోడ్కొని రహస్యభవనపుం జేరంబోయిసింహాసనాసీనులై తదుపరి నిట్లు జెప్పదొడగెను.

మిత్రులారా! మీకిచటనుండి వెళ్ళినరోజే స్వర్ణసైన సమేతుడనై యర్ధరాత్రి సమయంబున హేమపురంబును జుట్టుముట్టితిమి. ఈసంగతి వారికెట్లు తెలిసెనో కాని వారును యుద్ధమునకు సిద్ధముగానుండ పోరు ఘోరంబుగాజరిగెను. అబ్బా! అవృద్ధరాజగు చంద్రవర్ధనుని ధైర్యసాహసముల ధనుర్విద్యాకౌశలత్వము నెంతని కొనియాడదగును. మన సైన్యమంతయు చెల్లాచెదరై తుదకు నపజయము సంభవించుననికూడ భయముగలైను. తుద కెట్లో తెల్లవారు జామునకు చంద్రవర్థనుని స్వర్గమునకుజేర బంపితిమి. కాని యేమి ప్రయోజనము. మనోరమ మటుమాయమైనది. మేమంతఃపురమున కరుగగా నంతయు జనశూన్యమే. నా సర్వప్రయత్నములు వృధయై నా కాశాభంగముకలిగెను. కాని రాజ్యము మాత్రము మనకు దక్కినది. ఇప్పటికి నా సుందరీమణి యెచ్చటికోపోయి యాత్మహత్య జేసికొని యుండవచ్చునని యూహించెదను? ఇది గాక మరి యొక చిత్రమైన సంగతిని జెప్పెదనువినుడు. మణిపురరాజగు రామసింహునకు సర్వసౌందర్యరాశియైన విద్యుల్లత యను కూతురుండెను. ఆమె చిత్రపటమును జూచి మోహపరవశుడనై దానిని నాకిచ్చి పాణిగ్రహణము జేయుమనికోరగా నాతడు సమ్మతింపక నన్ననేకవిధముల దూషించెనట. యుద్ధములో

గల్చి యాముగ్ధను చేపట్టదలచిన మనోరమవలె మాయమగు నేమోయనియు మఱియు నాతనితో బోరుటకు మనబలము చాలదనియు సందేహించుచుండుతరి, ఆ రామసింహుని కూతు రగు విద్యుల్లత. రంగరాజపట్టణమున పెద్దతల్లిగారి గృహ ములో నున్నదనియు పెండ్లి ప్రయత్నము చేయవలెనని రామ సింహుడు, రేపే త్వరగా రావలసినదని కబురంపినాడనియు, నీరోజు బయలుదేరి యరణ్యమార్గమున వచ్చుననియు, రంగరాజ పట్టణ నివాసుడగు మనసేవకుని బావవలన దెలిసికొని చోర నాయకునితో జెప్ప నాతడు నలువుర చోరులను వారు వచ్చు మార్గమున డాగికొని యా నారీరత్నము నపహరించుకొని రావలసినదని చెప్పి పంపెను. వారట్లనే బండివచ్చుట కని పెట్టి హఠాత్తుగా పైబడి యాయబలను పట్టుకొనిరి. కాని దైవాను గ్రహముతప్పి ధనుర్బాణ సహితుడైన యెవ్వడో యొక యువ కుడు కఱకుశరముల నురములంబఱపి చోరులం దఱిమికొట్టెనట. వాడెవ్వడో నాసమయ మందెందుల కచ్చుటుండెనో కారణము తెలియదు. ఆబాణపరంపరల బాధలకు నిలువంజాలక భామా మణి నచ్చుట నేవదలి ప్రాణాపాయమును దప్పించుకొని పరుగిడి రని చెప్పుచుండునంతలో నాక్షత్రియ కుమారులొకరి మొగము లొకరు జూచుకొనుచు, చోరుల బారద్రోలినవాడు మదన మోహనుడేమోనని సందేహించి యట్లనుకొనుటకు వానికి ధనుర్బాణములు లేవు కదా యని తలంచి తదుపరి యేమి జరిగిన దన నాతడిట్లు జెప్పదొడగెను.

మిత్రులారా! అంతట కాంతారత్నము స్వపురికరిగిన రాత్రియే, చోరులను బంపి రెండులక్షల విలువగల బంగారు వెండివస్తువులను రామసింహుని కుమారుడగు విద్యుద్దీపుని యెత్తు కొని వచ్చునట్లుజేసితినన నా యువకులలో నొక డాత్రముతో నాబాలు డెచ్చట నుండెనని యడిగెను.

లోభ :— మార్గమధ్యమున భల్లూక మొకటి మనభిల్లులపై కురికిన భయంబుదోప నబ్బాలుని కంఠహారముతో నాయెలుగు బంటి ముందరబడవేసి వేగమే గుహజేరవచ్చిరి. ఇటులనే

రెండుమూడు మారులు వాని ధనమపహరింపుడని తస్కరులకు జెప్పివచ్చితిని. ధనము తగ్గినగాని యాతరుణీమణి నాకు లభింపదు. ఆ తరుణీమణిని గూడినగాని నాతనువు ధన్యతం గాంచదనిచెప్ప నారాజపుత్రులు సంతసించుచు రాజా ! మీధైర్యసాహసముల మీశక్తియుక్తుల నెంతని కొనియాడుదుము. అట్టి పరమసుందరగాత్రిని పాణిగ్రహణము జేసికొన్నప్పుడేకదా మాకు పరమానందము. తమకు బ్రహ్మానందమన లోభగుప్తుడు చిరునవ్వునవ్వెను.

ఓ పాఠక మహాశయులారా ! వీరి దుష్టత్వమును బాగుగా పరిశీలించి వీరిచరిత్రను కొంత జెప్పుకొందము. ఈ లోభగుప్తుని యగ్రజుడగు ధర్మపాలుడు శాంతశమదమాది సద్గుణములచే విరాజిల్లుచు సత్యసంధుడని సజ్జనులు సన్నుతింప సకల జనసమ్మతముగా రాజ్యమును బాలించుచుండెను. ఈయనకు నవకోటి మన్మథాకారుడో యని యువని జనులు నుతింపదగిన సుందర మూర్తియై, సద్గుణగణ సంపూర్ణహృదయాంతరంగుడైన నొక కుమారుడుండెను. ఈతడే మదనమోహనుడు. ఈతనికి బదు నారవయేట తండ్రిగారు మరణించిరి. అప్పటినుండి లోభగుప్తుడే రాజ్యమేలుచుండెను. ఇతడు కడుదుష్ప్రవర్తనుడు, జారుడు చక్కదనముగానున్న నక్కచెల్లెండ్రైనను బ్రక్కకు రమ్మని చెక్కిలి నొక్కుటకు సంశయింపడు. ప్రపంచములోని పడతులందరిని బలాత్కారముగానైన భావజుకేళింగూడు టెట్లో యని రాత్రింబవళ్లు పరిపరివిధముల భావంబునం దలంచుచుండు టయే యితనిపని. ఈతడు దీర్ఘకాయుడై నల్లని వర్ణము గలిగి భయంకరరూపముగలిగియుండెను. ధర్మపాలుడు బ్రతికి యుండగానే మదనమోహనునకు చంద్రవర్ధన మహారాజు కూతురగు మనోరమను పాణిగ్రహణ మొనర్చుటకు నిశ్చయించుకొనిరి. మదనమోహనుని తప్ప తదితరులను వివాహమాడనని మనోరమ దలచి యుండెను. ఇట్లు దలచుటయొక్క మనోరమయేకాదు. అంతవరకు నొకరి నొకరు జూచుకొనక పోయినను మనోరమా మదనమోహను లొకరిపై నొకరు గాఢానురాగులై కల్యాణ

మహోత్సవమున కెదురు జూచుచుండిరి. ఇంతలో ధర్మపాలుడు మృతినొందని నాఁడురసటి దినమునుండియే లోభగుప్తుడు మనోరమను నాకిచ్చి పాణిగ్రహణ మొనర్చుమని పలుమారులు చంద్రవర్ధనునకు జాబులు పంపెను. ఈ వార్త వినిన మనోరమకు మబ్బులేని పిడుగు మేనిపైబడినట్లై దేహమంత చిరుచెమ్మటలు గ్రమ్మ మనస్సు చేయిపెట్టి కలచినట్లుగాగ చింతాసాగరమున మునింగెను. పాపమేమి చేయగలదు. హృదయ కమలమందున నల్లిబిల్లిగా నల్లుకొని విరులు వికసింప సిద్ధముగానున్న ప్రేమలతాపుంజమును కూకటి వ్రేళ్ళతో పెకలించివేయు నీ యాశాభంగమగు వార్తను విని సహింపగలుగునా? నిరంతర మనంత దుష్కృత్యములకు తలయొగ్గి నిఖిల ప్రజలు నిందింప నేనే కూడదనని గర్వించు కామాంధకారుడగు లోభగుప్తునకు సర్వాంగములు స్వాధీనముచేసి సంతసింపగలుగునా. చంద్రవర్ధనుడు మనోరమ మదినెరింగి మదనమోహనునకు తప్ప మరింకెవ్వరికి నిచ్చుటలేదని లోభగుప్తునకు ప్రత్యుత్తర మొసంగెను. ఇది జూచి యాదుష్టుడు సామముచేత చంద్రవర్ధనుడు సమ్మతింపడనియెంచి సకల సైన్యసమేతుడై సమరంబున నాతని యోత్తముని దునుమాడి సర్వాంగసుందరియగు సాధ్వీలలామను చేపట్టవలయుననిదలచి యుద్ధసన్నద్ధుడైమదన మోహనుడు బ్రతికియున్న మనోరమను తనకు దక్కకుండునట్లు చంద్రవర్ధనునకు సహాయమొనర్చునేమోయని సంశయించి మాయోపాయమున మరణింపజేయుడని తన మిత్రులకుం జెప్పి మూలికల తెండని మదనమోహనునితోసహా మహారణ్యమునకు బంపెను. లోభగుప్తుడు చంద్రవర్ధనుని సమరమందోడించి సతీతిలకమును చెరబట్టు సంగతి మదనమోహనుడు మహారణ్యమున కరుగకమునుపే యుదయపురమున జరుగు కథనంతయు విశదముగా చంద్రవర్ధనునకు లేఖను వ్రాసిపంపెను, ఆ నాడు చంద్రవర్ధనుని చేతిలోనున్నదియు, అంతఃపురాంతరాళమున మనోరమ మనస్సును కలత నొందించినదియు నీలేఖయే. ఇప్పుడు మాత్రమీకార్యారుడు మనోరమ మరణించి యుండునని యామెపై నాసవదలెను కాని

విద్యుల్లతకౌగిలికి మాత్రము విరుగబడుచుండెను. ఇట్లు వారింక నేదియో మాట్లాడుకొనుచుండు నంతలో ప్రొద్దుక్రుంకెను. అట్లు దివాకరుడ స్తమించిన వెనుక యొక చోరుడు వారున్న రహస్యమందిరమునకు చనుదెంచి లోభగుప్తునితో నేమేమియో కొంతవరకు ముచ్చటించి వెడలిపోయెను. ప్రపంచమంతట చీకటి వ్యాపించెను. ప్రజలు నిద్రించు సమయము కాగా వారు లేచి వారివారి స్థానములకు జేరబోయిరి.

## 7

మణిపురంబున పశ్చిమవైపున విశాలప్రదేశ మొకటి యుండెను.
ఆ స్థలము నొక్కమారు వీక్షింపుడు. నా డేలకో నా ప్రదేశమంతయు నంబరమునంటి యున్నవను నట్లుందమైన పందిరులచేతను, పచ్చల తోరణములచేత, ముత్యాల ముగ్గులచేత, నలంకరింపబడి క్రిక్కిరిసినట్లు జనసమూహము లెక్కకు మిక్కుటముగానుండిరి. ఇంకను జనులు వచ్చుచునేయుండిరి. స్థలమంతయు పీఠములచేనిండి నిబిడీకృతమై యుండెను. కరిరథాశ్వముల నుండి దిగువారికి కొందరెదురేగి దోడ్కొనివచ్చి పీఠములపై దయచేయుడని ప్రార్థించుచుండిరి. ఆ స్థలమునకు నలువైపుల నెచటగాంచినను విడిసినరథములు వదలిన గజములు కట్టివేయబడిన గుఱ్ఱములు, విచ్చలవిడిగా సంచరించు వృషభంబులు, అవనియందుడించిన యందలములుగలిగి, కర్ణరంధ్రములు గింగురుమను ఘీంకారములయు, సకిలింపులయు, రంకెలయు, మార్మోతలు దిక్కులు బ్రద్దలగునట్లు పిక్కటిల్లుచుండెను. వేయేల నీ ప్రపంచములోనున్న వాహనములన్నియు నావచ్చిన యువకులకే సరిపోయెనని చెప్పకతప్పదు. ఇట్లు వచ్చినరాజ పుత్రులు వరుసవరుసగా సింహాసనాసీనులైరి. తలపాగలను జుట్టుకొని దానిపై తురాయిలను బెట్టి కనకమయమైన యంగీలను దొడిగి కూర్చున్నవారును, నవరత్నస్థగిత హారకుండల కేయూర కిరీటభూషణాలంకారముల నుప్పొంగువారును, మందహాస చంద్రికలు ముఖమండలమంతయు గ్రమ్మి

కొన మనంబుల నేమేమియో యనఁకొని యుల్లసిల్లువారుగా నుండిరి. మఱియొక చిత్రము యెందులకో గాని యెవరియొద్ద పరికించిన నొక్కొక్క ధనస్సు నంబులపొదియునుండెను. వీరందరువచ్చినది యుద్ధమునకా? కాదు. షోరునకైయిట్లు వరుసవరుసలగా కూర్చుండుటయును, క్రోధ ఘూర్ణితలోచన ముల ముఖములు పొగలెగయుట మాని చిరునవ్వు లొలుకుచుండు టయును, గలుగునా? అందరు నొకరితో నొకరు వినయ విధేయులై సోదరప్రేమతో మాటలాడుకొనుచుండిరి. అయిన నీ ధనుర్బాణము లెందులకు? తదుపరి యాలోచింతము. ఆ పీఠముల కెదురుగా నొక యెత్తయిన యరుగును వేసి దానిపై నవరత్నకంబళి పరుపబడెను. దానిముందు కొంచము దూర ముగానున్న రెండు స్తంభముల మధ్య నొకకఱ్ఱ నడ్డముగా గట్టి దానికినొక పూలహారమును నూలుపోగుచేత కట్టబడి యుండెను. రాజపుత్రుల వెనుకవైపున నొక మనుష్యుడు నిలువబడునంత చిన్న యరుగును వేయబడి దానిపై పరుపును పరచియుండిరి. ఆ పుష్పాలహారము కట్టిన స్థలమునకు ప్రక్కగా నా మణిపురాధీశ్వరుడగు రామసింహుడు సింహాసనాసీనుడై యుండెను. కొందఱు పన్నీరుబుడ్లంగొని ప్రజలపై జల్లు చుండిరి. మరికొందరు వివనకఱ్ఱలతో యువకులందరికి విసరు చుండిరి. ఆ స్థలమున కావల దక్షిణదిక్కున సమీపముగా నొక కాళికాలయముగలదు. దానిచుట్టు నందనవనం బందము ధిక్కరించి సుందరం బింపొందు తరులతా గుల్మములావరించి పరిమళ మిళిత మలయమారుత మెడతెగక వీచుచుండెను. ఆ యాలయాంతరాళమున నూరు శిరంబులు రెండు కరంబులుం గలిగి చూపరులకు భీతిని గల్పించు కాళీ శిలావిగ్రహము ప్రజ్వరిల్లుచుండెను. ఆ యాలయమున నేప్రక్కజూచినను దీపప్రకాంతులే. ఎటు తిలకించినను కార్పూరహారతులే. ఎటు వీక్షించినను మృదుమధుర రసాల నారికేళఫల. పారిజాతపు పుష్పఫలకముల సమితియే గానబడుచుండెను. సాయంత్రము నాలుగుగంటలకాలము కావచ్చినది. కొందఱు సఖీజనంబు

లిరుప్రక్కల సరససల్లాపంబులాడ చారుతర మణిహారధారులైన కొందరు చెలులు చామరంబులు వీవ.

సుందరీజనంబులంగూడి మందగమనంబున దేవిని సమీపించి తనహస్త నవపల్లవ కోమలాంగుష్టాంగుళీయ కముల వజ్రపు కాంతులు సూర్యకిరణంబులంబోలి వెలుగుంగూర్ప కరంబులం జోడించి యొక ముగ్ధాంగన మనస్సరరసీరుహామునకు నల్లిబిల్లిగా నల్లుకొనిన ప్రేమలతాపుంజానిత మనోరథములనెడు తీగెలను చక్కజేయుమని యాజగన్మాతకు వందనం బాచరించెను. అట్లు నమ్రభావమున నమస్కరించి యాతలోదరి చెలులంగూడి రాజ పుత్రులున్న రమణీయస్థలముం జేరంబోయి రత్నకంబళి పరుప బడిన యరుగుపై నిలువంబడెను. ఆ యప్సరసవలె నిలువం బడిన యువతిని గాంచుటతోడనే నగపుత్రుల గుండెలు జల్లు మనెను. కారణమేమి? భయముచే ననుకొందమా. కాదు కాదు. ఎవరిని దిలకించుట కంతకాల ము వ్వి ళ్ళూ రు చు న్నార్చుండిరో. ఏనాతి కౌగిటనున్న నిహాలోకతనువు ధన్యత నొందునని దలంచుచుండిరో. ఏభామ తనువుసోకిన నమరలోక నివాసియగు రంభపై బడినట్లేనని యనుకొనుచుండిరో. ఏవనిత పాలిండ్లు వక్షస్థలమున గ్రుమ్మ వత్సర సహస్రంబైన నొక తృటిగా నుండునని చెప్పుకొనుచుండిరో నాయువతి కన్ను లెదుట ప్రత్యక్షమగుటయే కారణము. ఇదందరికినుండు సహజ స్వభావమే. ఇదియే మదనపుష్పశరప్రయోగము. ఆ నారీమణి నొక్కమారు వీక్షింపుడు.

నిష్కళంకపూర్ణచంద్ర ముఖమండల చంద్రికారశ్మిలచే యువకుల హృత్కమలముల బంధించి బాధను గూర్ప నామె కృపాకటాక్షవీక్షణంబు లా బంధంబులనుండి విముక్తులజేసి పొందని మందలించుచుండెను. అకలికి కుచకుంభములకు నలందిన కుంకుమలేపనర క్తవర్ణ మావ్యక్తుల నయన ద్వయముల రుణముగా నొనర్ప నాయింతి చిరునవ్వున శరచ్చంద్రచంద్రికను మించు దంతకాంతులు విరివియై ధవళవర్ణమును హెచ్చు జేయు

చుండెను. ఆ పద్మనయన శిరోజముల కృష్ణవర్ణము విస్తరించి లేవయసుల నేత్రము లంధకారబంధురమై యొప్పు తమోమయము నకు మార్తాండ కిరణంబులో యన నా మగువధరించిన జిలుగు పావడతళుకు లావరించి యంధకారము సంతతము జేయుచుండెను. ఆచక్కదనాలప్రౌఢ చక్కెరకెమ్మోవిరుచింజూడ నావ్యక్తుల జిహ్వలూటలూరి యాసజనింప, తదధరామృతమంత త్రాగి దారిబట్టి నాభి యను బిలమునకు నల్లచీమలబారు మెల్ల మెల్లగా నడచుచున్న దిక సందుగము లేదని మతులందలంచునట్లా భామా మణిరోమరాజి భూమీశుల యాసని రాశీజేయుచుండెను. ఆ సఖి యని తంబములచెంత గూర్చుండి సంతత సంతోష స్వాంతంబున చుంబనాది క్రియలచే కమ్మని యధరామృతము కడుపార గ్రోలి కడుబలంబుగల్గి కందర్ప సంగరంబునకు కాలు దువ్వుచున్నదో యని దలంచు యువకుల కోరికలకు కోపించి, కామయుద్ధంబునకు గడంగిన మీకాయంబుల రుధిరమిట్లు కార జేయుదునని సూచించుచున్నదో యన నాసామజయాన మృదు లాంగుళ్యగ్రములనుండి రక్తముజారి భూమిపై బడునట్లు భ్రమం గల్పించుచుండెను. ఆ జవ్వని యున్నత జఘనంబను సింహాసన మధిష్టించి స్మరరాజ్యంబున కభిషిక్తుల మగుటెప్పుడో యని త్వరంజెందు క్షత్రియులను మన్మధరాజ్యంబేలు మగవారలు మీరేనా యని పరిహసించు విధంబున ప్రభంజనుని రాపిడివలన నాపడతి ధరించిన పావడ బిరుసుదనపుధ్వని పకపక నగినట్లు వినంబడ పాంధుల మనంబులు కలతనొంది వదనంబులు చిన్న వోవుచుండెను. ఇక నాయంచయానను, చంచరీకవేణిని, సింహేంద్రమధ్యను, కోమలగాత్రిని వర్ణించుట కెరికితరము. ఈమె యెవ్వరు? ఎందులకట్లు నిలుచుండెను. కొంచె మాలో చింతము. ఈ లతాంగి మణిపురాధీశ్వరుడగు రామసింహుని కూతురగు విద్యుల్లతన్ఫురణకు దెచ్చుకొనుడు.

ఇదివరకొకప్పుడు మనముగాంచిన యువతియే. ఈనాటీమె స్వయంవరము. ఎట్లని ఎవ్వరైనా రాజసుతుల వెనుకనున్న చిన్న తిన్నెపై నుండి స్తంభములమధ్యనున్న పుష్పమాల నామె

మెడలోఁబడునట్లు ధనుర్విద్యా కౌశలంబున శరంబున గొట్టు దురో యాతనికి తనకూర్మి సుతనిచ్చుటకు రామసింహుడు నిశ్చయింపబడెను. అంత నా సరసీరుహాక్షినిగాంచి యా యువకులందరి మనంబులు మదనసాయకంబుల తాపులకు శరీరములు గగుర్పొడు వడగొట్టుచుండెను. దేహంబుల విరహోష్ణ మెక్కుడై నన్నే వరించునని యెవరికివారే తమతమ మనంబుల నిశ్చయించుకొన నవ్వేడితగ్గి స్వేదబిందువు లుత్పన్నమై నామె చల్లని వీక్షణములకు వలిగొన్న వానిపగిది గడగడ వడంకుచు గద్గదిక స్వరంబులంబడ మాట లుడిగి నిరీక్షించు చుండిరి. యా మత్తేభయాన యేవైపు పరికించునో యా ప్రక్క వ్యక్తులందరి మనంబులు జల్లుమన తమ్మే జూచుచున్న దనుకొని పర్యాయములదర కొందరు మీసములపై జేయిడి సవరించువారును, కొందరు కిరీటాది భూషణముల చక్క జేయువారును కొందరు రాని నవ్వుదెచ్చుకొని వేరొకనివైపు జూచి యేమియో జెప్పువానివలె నభినయించువారును, పీఠములపై నీటుగా గూర్చుండవలయునని శరీరములు నిగిడ్చి శిరంబులు పైకెత్తి పెడమొగంబులచే కూర్చున్నవారును ఆమె జూచునప్పుడెట్లుండిన తమ్మె జూచి భ్రమంజెందునో యర్థము కాక దిక్కుదోచక వెఱ్ఱిచూపుల వీక్షించువారును, వేయేల నా యువకులందరు తేనియందమూల దెచ్చుకొనవలయునని యూహాబ్ధి తరంగ పరంపరలలో మునింగి తేలుచుండిరి. ఆ క్షత్రియులందరు తమ సుందరంబుజూచి రాజపుత్రిక యానంద పడునని వారి యభిప్రాయము. కాని పాపమేమి చేయుదము. తత్తరమందు హృదయమున నాలోచించి యదరుచుండునవయములతో జేయుప..లు చూపరులకు వికారచేష్టలుగా గాన్పించుచుండెను.

ఓ పాఠకమహాశయులారా ! మనమిప్పుడు సమీపమున నున్న నా వెఱ్ఱిపనులనుజూచి యొక్కమారు పెద్దపెట్టున కేక వేసి నవ్వి గేలిచేసియుందుము. కాని యితరముకాదు. ఇంక రాజపుత్రిక విషయమాలోచింతము ఆ సభం జేరినప్పుడే

యొరుల కంటబడక క్రీగంటి చూపులచే క్షత్రియకుమారు లందరిని వీక్షించెను. కాని తన హృదయము నాకర్షింపబడు క్షత్రియోత్తము డొక్కడును లేకుండుటకై చింతించెను. అయ్యో! ఏమి వీరి వికారచేష్టలు అకటా! వీరిలోనే నెవ్వరిని కాగిట జేర్చవలసియున్నదియోకదా ఈ పుష్పమాలికను నా మెడలో బడగొట్టినవానిచే పట్టుక తప్పదుకదా నా తండ్రి యెంత తెలివిలేమి పనియొనర్చెను. ధనుష్పాండిత్యమున్న రూపురేఖావిలాసములుండునా? సద్గుణములు విరాజిల్లునా? ఎంత యవివేకము. నేను స్వయముగా కోరుకొనినవాని పరిణయ మొనర్చు స్వయంవరము గావింపక నిర్లక్ష్యజేసెను. ఆ పరమపావనియగు చండికాదేవికి నామీద దయలేదు కాబోలు. అకటకటా! నా మందమతియే నన్నింతజేసినది. సిగ్గున మా తండ్రితో చెప్పలేకపోయితిని అయిన దేదోయయినది. కరుణార్ద్రహృదయయగు నా కాత్యాయనీ దయవలన నీవు పుష్పమాలికను నా కంఠమునకు దగుల్కొన జేయువాడొక్కడైన నీ సమయమునకు లేకుండెనా మా తండ్రితో నా కోర్కెను దెల్పి నా యిష్టప్రకారము వివాహము జేసుకొని సర్వసౌఖ్యము లనుభవించి ధన్యురాలయ్యెదను. నా కిప్పుడు కాళికాధ్యానమే కర్తవ్యమనుకొని కనులుమూసికొని లోలోపల నేమేమియో యనుకొనుచు ప్రమాన్పడి నిలుచుండెను. ఇంతలో కారాగారము ముందుగా నొక సేవకుడు కొన్ని ధనస్సులను బాణములను తీసికొనివచ్చి లేనివారుపయోగించుకొనుటకుగాను నియమిత స్థలముగు నా చిన్న యరుగుకడ నుంచి పోయెను. గంట మ్రోగించబడెను. రాజపుత్రు లందరు ధనస్సుల చేతులందిడుకొనిరి కూర్చున్నప్పుడే తత్తరమందిన యువకులు సభలోనుండి యొక్కొక్కరే నియమిత స్థలమునకు బోవుటజూడ వర్ణనాతీతమని వేరుగ జెప్ప నేల. అట్లొక్కొక్క రా యరుగునెక్కి ధనస్సు నెక్కుబెట్టి కొట్టుటకుబూన నా సుదతి క్రిగంటజూచి నిట్టూర్పు విడచి తలవంచుకొన తన్ను జూచి సిగ్గుజెందినదని తనలో నుబ్బితబ్బి

బ్బ్రాత్రై ప్రక్కకు శరము విడుచు వాడొక్కడును. హృద
యంబున భవిష్యత్తు నాలోచించుకొనుచు మితిలేని యానం
దాబ్ధిలో మునింగి తేలుచు మతిలేక గురిదప్పి విసుచు
వాడొక్కడును చదువరులారా! ఒక్కొక్కని వర్ణించుచుండిన
చాలకాలముబట్టును. క్లుప్తముగా వివరింతును: ఆ యరుగు
నెక్కి యా చిలుకలకొలికి కులుకు గుబ్బలదృష్టినిలిపి తద్దృష్టి
మాలికపై మరల్చుకొనలేక మగువప్రక్క శరములు విడచువారు
కొందరును పుష్పశరతూణీరంబుల తాపులకు కామజ్వర
మెక్కుడై దేహములు చెమ్మటలుగ్రమ్మ దృష్టిచెదరి బాణము
లింకొక వైపునకు విడచివచ్చువారు కొందరును. ఆ సుందరయాన
సుందరవదనారవిందము వీక్షించుచు తమదేహములు మరచి
దిక్కుదెలియక నేదెసకో బాణములు విడచి జనుదెంచువారు
కొందరును, ఆ పంకజగంధిపయ్యెద సవరింప పాలిండ్లంజూచి
భ్రమంజెంది చెఱకు విల్కాని ములుకుల కలికిపడి తాను శరము
విడచినది విడువనిది తెలియక నరుగుదిగి వచ్చువారుకొందరును,
సభ్యులందరు తమ్మే వీక్షించుచుండిరని కాళ్ళు గడగడవడక
దేహములు కంపింప నప్రయత్నముగ ధనువుధరంబడ ముఖము
వెలవెలబోవ కలతజెందిన చిత్తమున రిక్తహస్తములతో మరలి
వచ్చువారు కొందరును అచటికి పోనేల? మాలికను కొట్టక
తిరిగిరానేల. ఒకవేళ బాణము సంధించి విడచిన పొరబాటున
నా జవ్వనికి తగులునేమో. ఈ గొడవ మాకేలనని పీఠముల
నుండి లేవకుండినవారు కొందరును ఇంతేల నే రాజపుత్రుడు
ప్రయోగించిన బాణమైనను ప్రక్క నతిదూరములో పోయినవే
గాని సమీపముగానైననుపోలేదు. వారి ధనుర్విద్య నెంతని
వర్ణింతము. వారందరు కలసి శత్రువులమీదికి సమరంబునకు
బోయిన విరోధిసైన్యమునకే శరప్రయోగ మొనర్చి వధింతురను
నమ్మకముండదు. తమశరములచేతనే స్వపక్ష సైనికులుకూడ
చావవలసినదే. ఎందువలన ఒకదిక్కునకు వేయ వేరొకదిక్కుం
జేరంబోవు వారి ధనుష్పాండిత్య మహిమవలన నిట్లా రాజ
పుత్రులలో నొక్కరైన నా మాలికను కొట్టలేకపోవుటంజూచి

రామసింహుడు వ్యాకులాయత్తచిత్తుడై అయ్యయ్యో! నా ప్రయత్నమంతయు వ్యర్థమయ్యెను. నేనింకేమి చేయుదును. ఎవరికిప్పుడు నాకూతురి నిచ్చి వివాహ మొనరింతును. నాకేమియు దోచుటలేదని చింతిల్లుచుండెను. ఇక విద్యుల్లతయో ఆహా! నాభాగ్యమేమని జెప్పవచ్చును. ఆ పరమపావనియగు పార్వతీదేవి కృపవలన నాకోర్కె కొనసాగినది. ఇక నేను కోరిన ట్లే వరించి సర్వసౌఖ్యముల నోలలాడుదును. నానోము ఫలించినది. ఇట్లనుకొనుచు విద్యుల్లత మందస్మిత వదనారవిందరై యాకర్ణాంత నేత్రయుగ్మము సుస్నిగ్ధపాలభాగము నంతయు గ్రమ్ముకొనుచున్నవో యనునట్లు రెప్పలెత్తి సంతోష స్వాంతురాలై జూచుచుండెను. ఇక క్షత్రియ కుమారులందరు నెవరిపట్టణంబులకు వారేగసిద్ధమై యావనితాశిరోమణిని వదలి పెట్టిపోలేక కడసారి చూపిదే ననుకొనుచు తదేకనిష్ఠతో దిలకించుచుండిరి.

ఇంతలో పుష్పమాలిక విద్యుల్లత మెడలోబడెను. శరము క్రిందబడెను. విద్యుల్లతగుండె జల్లుమనెను. హృదయములో బండబడవేసినట్లయ్యెను. ఎవ్వరాబాణము విడచినది ఎవ్వరికి తెలియదు. రామసింహుడు లేచి యెవ్వరీ మాలికను కొట్టినదని ప్రశ్నించెను. జబాబురాలేదు. సభలోనున్న వారందరు నొకరి మొగంబులనొకరుజూచుకొనుచు నాశ్చర్యచిత్తులగుచుండిరి. ఎటు వీక్షించిన నేమియు తెలియుటలేదు. మాలికనుకొట్టిన మహాత్ము లెవ్వరో నా మీదదయయుంచి దర్శనమిండని రామసింహుడు రాజపుత్రులను ప్రార్థించుచుండెను. విద్యుల్లతకుకొండ మేనుమీద బడినట్లై కోరిక నిష్ఫలంబాయెనని గుండెలు దడగొట్టుకొను చుండెను. సేవకుడగు జయపాలుండు క్రిందబడిన శరమును కేల నందికొని యటు నిటు త్రిప్పిచూచెను. దానికి యలుగు మాత్రములేదు. అంతట రామసింహుడు సభనరసి రసపుత్రులారా! మాలికనుగొట్టిన మహాత్ముడీ సభలోనలేడా? నా ప్రేమసుతను పెండ్లాడి నన్ను ధన్యునిచేయడా ఎందుల కీ యాలస్యము పరిహాసమున కిట్లు చేయుచున్నాడేమో హరి

దక్షుడస్త్రాద్రికరుగువేళకూడ దైయినది దయయుంచి యా ధనుర్విద్యాప్రవీణు డెవ్వరో దయచేయుడని యనుచుండగా ఆ వచ్చుచుంటినని లోభగుప్తుడత్యలసటతో ప్రత్యక్షమయ్యెను. రామసింహుడు తలవంచుకొనెను. విద్యుల్లతకంపించిపోయెను. కళామయమగు కాంతారత్నము వదనపద్మమువాడిపోయెను. లోభగుప్తుని రూపముజూచి భయమొందెను. స్వప్నమేమో యని భ్రమించెను. కాదని తెలిసికొనెను. అంతట జయ పాలుడు మీ రెవ్వరు మీ నా మ ధే య ము లెవ్వి యని ప్రశ్నించెను. నేను దయపురాధీశ్వరుండనగు లోభగుప్త మహా రాజునని యాతడు చెప్పెను. ఆ పేరు వినుటతోడనే విద్యుల్ల తకు తనువున ప్రాణములున్నది లేనిదికూడ తెలియకపోయెను. మిన్ను విరిగిమీదబడినట్లై తనులత గడగడవడకనాపాదమస్తకము జలపూరితముగ చెమ్మటగ్రమ్మి యాతరుణి ధరించిన దుస్తు లన్నియు తడిసి దేహమున కంటుకొనిపోయెను. ఆ భీతహరిణే క్షణ నేత్రయుగ్మమునుండి శోకబాష్పములు చనుమిట్టలంబడి యొకటొకటి కలయుటచే హిమవద్గిరినుండి క్రిందికి బాలు గంగానదింబోలి కుచగిరులనుండి క్రిందికి ప్రవహించుచుండెను. ఇక నటు చూడలేకపోయెను. ఆమె హృదయము ఝంఝూ మారుతము తాకుడుచే ధ్వనిబుట్టచలించు రావియాకువలె ప్రకంపితమగుచుండెను. ఇక నాబ్రతుకే నిరర్థకమనితలంచెను. వేడినిట్టూర్పులవేగమునకు మి తి లే క పో యె ను. ఆనంద మడుగంటినదని యాత్మకుదోచెను ఈ పాపాత్ముని పరిణయుం బాడుటకన్న ప్రాణములు విడచుటచే బహుమంచిదనుకొనెను. కాని యదెట్లుతప్పును. ఏమియుదోచలేదు. ఎప్పుడీ స్థలముబాసి యింటిలో బడుదునాయని మనంబు త్వరపెట్టుచుండెను. ఆమె కోమలహృదయ మా పాపాత్ముని బారినుండి తప్పించుకొనుటకు దారితెలియక తహతహపడుచుండెను. అంత రామసింహుడు లోభగుప్తునిజూచి మీ రీ వేదికనెక్కి మాలికను కొట్టలేదుకదా యనెను. ఆ మాట నోట వెలువడుటతోడనే లోభగుప్తుడు కంఠీరవగర్జనసమానమగు కంఠధ్వనితో రాజా ధనుర్విద్యా

ప్రవీణుడనగు నావంటి వాడెచ్చటనుండి కొట్టిననేమి. నియమిత స్థలముకంటె నతిదూరముగానేయుండి శరమును బరపితినిగదా. అద్దానతప్పేమి. యుక్తిమాటలచే యువతీమణినిచ్చట తప్పించుకొనదలచుచుంటివా యని గద్దించి పలికెను. మేఘగర్జనంబునుం బోలిన లోభగుప్తుని వాక్యములకదరి కాకులుమూకలై కేక లిడుచు గగనమార్గంబున కెగురుచుండెను. శార్దూలారావములని భ్రమించి వృషభంబులు గట్టుత్రాళ్ళందెంచుకొని కలవరపాటున నిలుసక జనుచుండెను. విద్యుల్లతగుండెలు తల్లడిల్ల రక్తనాళముల రుధిరప్రవాహము వేగవంతమై ప్రవహించుచుండెను. ఆ భయంకరవాక్యములు మానవుని మాటలధ్వనిగా నుండక క్రూరమృగగర్జనంబులమాడ్కి కర్ణతాడితములయ్యెను. ఆ క్షత్రియసూనులందరు జీవచ్ఛవములోయన నిశ్శబ్దముగానుండిరి. రామసింహుడింకేమియు మాట్లాడలేకపోయెను. లోభగుప్తుడు తడిసిపోయినబట్ట తనువునందంటుకొని తళతళ కాంతులీను విద్యుల్లత సర్వాంగములనొక్కమారు తీక్ష్ణముగాజూచెను. తడివస్త్రముతోనున్న తరుణింజూచిన నాక్రూరునిమది యెట్లుండునో వేరుగజెప్పనేల. విద్యుల్లతలోభగుప్తుని వంక జూచెను. అర్ధరాత్రమున రుద్రభూమిలోని ప్రేతములను హరించు పిశాచముమాడ్కి భీకరాకారుడై, అరుణనయనుడై శ్యామలవర్ణుడై, కఠినదేహుడై గాన్పించెను. విద్యుల్లత కెవ్వున కేకవైచి క్రిందబడెను. క్షత్రియసూనులందరు దిగ్గునలేచిరి. తత్తరమున దాసీజనంబులు త్వరగాపరువులెత్తి విద్యుల్లతను లేవనెత్తి కూర్చుండజేసి కర్ణములుమూసి పన్నీరుజల్లుచుండిరి. ఇక రామసింహుని విషయమెవ్వరు చెప్పగలరు. అంతులేని దుఃఖాబ్ధియలలతాకుడుచే నసువుల బాయనున్నాడనుట యతిశయోక్తికాదు. ఇట్టి సమయముననే లోభగుప్తుడు కఠిన హృదయుడై వృషభంబులపైబడి మాంసకండరములను కోఱలతోజీల్చనెంచి నోరుదెఱచు వ్యాఘ్రంబుపగిది తన దీర్ఘదంత వదన గహ్వరముందెఱచి, రోషభీషణవాక్యంబులచే రామసింహరాజా! ముహూర్త మెప్పుడు నిశ్చయించితివనెను.

అందులకు సమాధానమేమియు రాలేదు.

అంతలో విద్యుల్లత అదృష్ట మీరీతి నభిలో కలియుచున్న దని భావికాలగతుల చెప్పుచున్నాడో యన ప్రభాకరుడు పశ్చిమాబ్ధిలోనికి బయవెత్తెను. విద్యుల్లత నందలము పై నెక్కించుకొని యంతఃపురమున కరిగిరి. పశ్చిమదిశ యరుణప్రకాశము ప్రజలందరిపై ప్రసరించుచుండెను. పక్షులు ముక్కుల ధాన్యపు కంకులం బట్టుకొని పిల్లలకుం బెట్టి ప్రేమతో గూండ్లకు జను దెంచుచుండెను. కంచెల ప్రాంతమున సంచరించు ఖద్యోత బింబముల కాంతి హెచ్చుటకు ప్రారంభించెను. కమ్మని మధురమును తుమ్మెదలం గ్రోలుచుండ తమ్మి రేకులు ముకుళిత మయ్యెను. లోభగుప్తుడు రామసింహుని పరల ముహూర్త మెప్పుడని హెచ్చరించెను. ఎనిమిదిరోజులకు శుభముహూర్తము నిశ్చయింపబడెను. తమకు లగ్నపత్రికను బంపెదముకదా యని సమాధానమిచ్చెను. అట్లైన మంచిది. నాకుకొన్ని తొందరపనులున్నందువలన నింటికివెళ్ళవలెనని బయలుదేరెను. తక్కిన రాజకుమారులందరు వాహనములనెక్కి సైన్యసమేతులై యర్ధరాత్రివేళ కెవరి,పట్టణములకు వారేగిరి. ఇక నా స్థలమంతయు జనశూన్యమే.

# 8

అర్ధరాత్రము దాటెను. సమయాంగన శాంతతేజ మెల్ల యెడల నిండి నిబిడీకృతమై యుండెను. వినుక్తవాతా యన పథమునుండి శీతలవాయువులు మెల్లగ వేతెంచి సుఘుప్తావస్థనుండి జాగ్రతకువచ్చు వారిని జోకొట్టుచుండెను. పూర్ణ చంద్రు డాకాశము నలంకరించి ప్రణయకలహంబున పెడ మొగంబులం బెట్టి పాన్పునఖరుండు పడతులను జారబాటు సైరించి నా ప్రక్కకు మరలుమని ప్రబిమాలు పాంథులను పరిహసించుచు నదీనదములందును, నిర్మల కాసారజలము లందును, మదన సంగ్రామశ్రమమున మగువల పాలిండ్ల నుద్భవించు స్వేదబిందువులందును, మనసునచ్చిన మగలు తనివిదీర

సరససల్లాపముల సమరతులదేల సంతోష ముప్పొంగు సతివల యానందబాష్పములందును. భర్తానురాగ దూరులై భావజ సాయకంబుల బాధలకు నిలువంజాలక బహుభంగుల చింతించు భామామణుల దుఃఖాశ్రువులందును ధనికుల గృహాస్థగిత దర్పణములందును వాపీకూప తటాకములందును ప్రతిబింబములచే ప్రజ్వరిల్లుచుండెను. మణిపురరాజ నగరున నచ్చటచ్చట చిన్న చిన్న దీపములు వెలుగుచునేయుండెను. కోటచుట్టు గస్తీ తిరుగువారు గోడలకానుకొని కునికిపాట్లుపడుచుండిరి. అట్టి సమయమున మేడ పైభాగమున నొక గదియందరి ప్రదేశమున విద్యుల్లత హంసతూలికాతల్పమున గూర్చుండి యాకసము వంక వీక్షించుచుండెను. ఆమె కన్నులనుండి నీరు కుపద్వయము దడుపుచుండ వ్యాకులాయత్తచిత్తయై యిట్లనుకొనుచుండెను.

అయ్యో! విద్యుల్లతా! నీ వివాహ మింక నెనిమిదిరోజులే యున్నదికదా. ఈ విపత్సాగరము నెట్లు దాటుదువు. ఈ పాపాత్ముని బారినుండి యెట్లు తప్పించుకొందువు. అకటకటా! నీ సౌందర్యమడవిగాసిన వెన్నెలవంటిదైనదా. నీ కోరిక నిష్ఫలంబాయెనా. నీ బ్రతుకు నిరర్థకమైనదా. నీ ప్రేమలతా పుంజములభూమికంట గోయబడినవా. సకల కళావిలసితమగు నీ సుఖమండలచంద్రికలను భయంకరరూపచకోరపక్షి భక్షింప నున్నదా. నీ కోమలదేహ మా కుటిలాత్ముని కఠినబాహువులచే బంధింప నీ కాయము కందిపోదా. నీ ప్రాణములు లేచిపోవా. నీ సర్వావయవము లాతని స్వాధీనము చేయగలవా. సర్వ సౌందర్యరాశివగునీవు. సద్గుణగణసంపూర్ణ హృదయవగునీవు. సకల రాజాంగ నాసముదాయ నక్షత్రమండల శశివగు నీవు. మందస్మితహాసతరంగమాలికాబ్ధినిం దేలు ముఖపద్మముగల నీవు స్వాతికార్తెవర్షజీమూతంబున జరించు విద్యుల్లతవగు నీవు సుక్షత్రియాలంకారుడైన మణిపురాధీశ్వరుని ముద్దులపుత్రికవైన నీవు ఆ పరభామల బలాత్కరించు పాపాత్ముని బాహువుల మధ్య ఆ కామాంధకారుని కరములనందు ఆ ప్రేతభూముల

నివసించు పిశాచరూపుని చేతులలోన బంధింపబడి బ్రతుక గలవా. నీ జీవితమెట్లు గడచును. నీ కోరికనెట్లు క్రుంగ ద్రొక్కుదువు.

అయ్యయ్యో! స్త్రీ జన్మమెంత దుర్భరమైనది. పతుల పుణ్యపాపములలో భాగంబు పంచుకొనవలెననియు నర్ధాంగులని చెప్పుకొనుచు నా స్త్రీపాస్తులయందు మాత్రమధికారము లేదనియు పురుషులకు బుద్ధిపోయినట్లు పుస్తకములను వ్రాసి యతివల నస్వతంత్రలగా జేసిరి. పోనిమ్ము. ఆ స్త్రీపాస్తులలో నధికారము లేకపోయినను పోవుగాక. స్వతనువులపైనైనను స్త్రీలకు స్వతంత్రత లేదు కాబోలు. తండ్రి యెవ్వరికి మీ తనువుల నొప్పగించుదనని చెప్పునో సర్వాంగముల వారి స్వాధీనమొనర్చి చచ్చినట్లు పడియుండుటే సజ్జన సమ్మతమట సర్వప్రపంచ ధర్మమట. మనసార వరించి పరిణయంబాడి పతిసేవజేయుటకు కూడ పడతుల కధికారము లేదయ్యె. అకటా! మేనత్త కుమారుడనియో, మేనమామ కుమారుడనియో, బహుభాగ్యవంతుడనియో, ఏకంటివానికో, గ్రుడ్డివానికో, కుష్టువానికో, ముసలివానికో, మూర్ఖవానికో, రోగగ్రస్తునకో పాపభీతిలేక పరిణయ మొనర్చి పతియే దైవమనిదలంచుచు పతివ్రతలై విరాజిల్లుమని బహుభంగుల జెప్పుదురు. నపుంసకుడని దెలిసియు బంధుత్వము దూరమగునని దలంచి పరిణయము గావించినప్పుడు కూడ పరపురుషులను కన్నెత్తి జూచినను పాపము సంభవించునట. ఎవరికా పాపము. షండునకిచ్చి పెండ్లిజేసిన జనకుని కా కలుషము జెందదా పడతులనే చుట్టుకొని బాధించునా. బంధుత్వముపై ప్రేమమున్న ధనధాన్యవస్తువాహనములనిచ్చి దయజూడరాదా మా బోటి యువకురాండ్ర కంఠముల కురి బోయు టెందులకు బిడ్డలనిచ్చియే ప్రేమ జూడవలెనా కూతుండ్రు జారత్వములో నుండిన కీర్తిప్రతిష్ఠలు నాశనమాయె నని కుమిలికుమిలిచత్తురే. ప్రపంచజ్ఞానము లేని బాలబాలికను కురూపులకిచ్చి పరిణయంబుజేసిన కాపురములు జేయుట వారికి కష్టము లేదా. కన్నులారజూచి త్రికరణశుద్ధిగా వరించి కల్యా

ణము జేసికొని వ్యభిచరించిన వెలిబెట్టవచ్చుగాని, ఈ పాడు పురుషుని నేను పరిణయంబాడను. నాకు కష్టముతో వివాహ మొనరించిన కాపురము చేయను. మీరు పట్టుపల వీదనున్న బావిలోనైనబడి చచ్చెదనని బావురని యేడ్చుచుండ బలవంత ముగా నిన్ను పొడిచెదము, చీల్చెదము, కోసెదమని భయపెట్టి జీవచ్ఛవముల లాగుననున్న స్త్రీల కుత్తుకలకు మంగళసూత్రము లను ముడిమీదముడివేసికట్టిన నడివరకే యా కాంతలాత్మలో వరించిన వారి నాలింగము జేసినతప్పా?

పోనిమ్మట్లు తాళిగట్టినవానినే దైవముగా భావించి ధన్యు రాండ్రవగుదమని దలంచినను భ్రష్టులగుతమభర్తలు తప్పులేకయే తన్ని, కొట్టి సతతము సహింపరాని బాధలపెట్టి గృహము వెడల సాగనంపిన పుట్టినింటబడి కొట్టుకొనునప్పుడుకూడ పతివ్రతగా నుండకుండిన పాపమేనా తన్నినను కొట్టినను దారి బట్టజేసినను పడతులు పతివ్రతలుగా నుండుటే పరమధర్మమన్న పురుషులుమాత్ర మేకపత్నీవ్రతస్థులుగా నుండవలదా. భార్యను వదలిన పురుషుడు మరియొక పరిణయమాడకూడదని శాసించి నట్లయిన. అందులోని కష్టసుఖము లందరికి జెలిసి యుండెడివే భార్యనువదలి పదివేల వివాహంబులు పురుషులు చేసికొన వచ్చును గాని నాధునిచేత తరుమబడినప్పటికైనను నారీమణు లకు మాత్రము న్యాయము కాదట పురుషులకున్న కామము పూబోడులకులేదా? మమ్ము ప్రేమింపలేని వారలు మంగళ సూత్రము లెందుకు కట్టితిరని మగువలు మరిమరి యడిగిన మౌన వ్రతినిచ్చెదమలే మాట్లాడక పొమ్మందురు. తిండిలేక నేనా పెండ్లిజేసికొనుట.

మఱికొందరు పుష్పవతులు కానట్టి పసిపాపలకే పరిణయ ములు చేయవలెననియు పుష్పవతులగు నంతవరకు పెండ్లిజేయ కుండిన పరిహసించి పరాభవమగునట్లు వెలివేసి గ్రామముల నుండి వెడలగొట్ట వలెననియు శాశించిరి. ఎందువలన ఇట్లు శాశించుచుండిరి వారి యిష్టప్రకారము వివాహములు జేయు

లకు విలువ లేదు. అది యెట్లున్న, ప్రపంచజ్ఞానము కలిగిన ప్రౌఢలు వరుడు మంచివాడుగాకున్న నొప్పుకొనిరనియు, మంచివారికిచ్చిన లంచమివ్వరనియు దలంచి పసివారికే పెండ్లి జేయవలెనను పద్ధతితో నధికధనమిచ్చిన వృద్ధులకైన నంట గట్టుచుండిరి. ధనమున కాశించి పురుషులు తనయలను ముసలి వారికైన ముడివెట్టుచుండగా తరుణులుమాత్రము స్వతనులను పదుల కమ్ముకొనుటలో పాపమేమి? పలుమారులు భామా మణులను బాగుగా జూచుకొని పరిణయంబాడి పగలు రేయనక పరమానందంబున భావజకేళిం దేలుచు పైగా సందుగొందుల నుండి జారత్వమున జీవించు చంచలాక్షుల కవాటములుకడ గాంచియుండి లంచములిచ్చి మంచములపై జేరుదురే వడకటిల్లు జొచ్చువరకు భర్త యితడేనని తెలిసికొనని బాలికలకు పెండ్లి చేసినవ్వటికి నెట్టి రూపహీనుడైనను విభుడే దైవంబని దలంచి వేడుకలగూర్పు వెలదులను తప్పులేని దండన మొనర్చి తరిమికొట్టిన యా తరుణీమణుల గతియేమి? అట్లనిన నువ్వు కారములేని చప్పిడియన్నము తినుమని చెప్పుటయేగదా పురుషులబుద్ధి. భార్యనువదలిన భర్తకును, భర్తనువదలి భార్యకును, కామసుఖములు లేకుండ కట్టుబాటు జేసినప్పుడుకదా మగవారిని సుగుణవంతులని చెప్పుకొనుట సమతత్వమున జూచు సరసులని యెన్నుకొనుట. "ఆత్మవత్సర్వ భూతాని" యన్న నార్యోక్తి యఖిల ప్రపంచము నలముకొనుట. అయ్యయ్యో! స్త్రీల నెంతచులకనగా చూచుచుండిరి. పురుషుల ననుకొన నేల? మా స్త్రీజాతికొక చెడుగుణము తటస్థమైనది. సమయ మూనకు సిగ్గను దానిని చేరదీసి శిరమువంచి చిత్రరువుంబోలి నిశ్చేష్టులమై నిలుచుండుము. సనిమించిన తదుపరి పరితాపము నొందుచు నయనదాని కారాటపడుచుండుము, ఒకరిసంగతి యేల? స్వయంవరమునకు ముందే నా మనోవాంఛ మాతండ్రి కెరింగించకూడదా నోటబెట్టబడినట్లు మాటలాడక పోవుట చేతనే యీ ముప్పు వాటిల్లనున్నది. కటకటా నాకిపుడు కర్తవ్యమేది? ఈ కఠినాత్ముని కాంతునిగాజేసికొని కాపు

రము చేయగలనాయని కన్నీరు కాలువలై పార క్రిందకు
జూచెను, సకలకళాసంపూర్ణ శశిబింబ మధుర చంద్రికలను
చకోరపక్షులు గుంపులుగుంపులుగాగూడి గర్భముల మెక్కు-
చుండెను. అకటా! చంద్రకళను భక్షించుటకు నీ పాడు
పక్షులేల దాపురించినవని జాలికలిగి చంద్రునివంకజూచెను.
పూర్ణచంద్రబింబము రాహుగ్రస్తమగుచు కొంతకుందుచుండెను.
విద్యుల్లతగుండెజల్లుమనెను. శాంతతేజుడగు నాచంద్రుడు
క్రూరుడగు రాహువు కోఱలమధ్య జిక్కుకొనియె శత్రుశేష
ముంచిన ప్రాయశ్చిత్తమిదిమేకదా యనుకొనెను. సకలసౌందర్య
రాశియైన నీ శరీర మాదుష్టుని మోహాగ్ని కాహుతి యిట్లేయగు
నని ప్రకృతి సూచించుచున్నట్లామె మతికిదోచెను. రాహువు
బారినుండి కేరాజు కొన్నిఘడియల తదుపరియైన తప్పించు
కొనునుగాని నీవుమాత్రమా మదాంధుని మోహాగ్నిలోబ
యా మరణాంతము క్రుగ్గవలసినదేనని యంతర్వాణి జెప్పుచున్న
ట్లాత్మకు దోచెను.

అయ్యయ్యో! ఆ కలుషాత్ముని కామాగ్నిగుండమున కాలి
పోవలసినదేనా, ఆ భయంకరాకారాళవదన దీర్ఘదంష్ట్రి హాలా
హలమున కాహుతిగావలసినదేనా, ఆ దుర్జనుని ప్రేమాబ్ధిలో
దూకవలసినదేనా ఆ మదాంధుని మగనిగా వరించి మరుకేళి
దేలవలసినదేనా ఛీ. ఛీ. ఏమి నా యవివేకము. నేను బ్రతికి
యున్నంతకాలము నా పంచప్రాణము లాపాపిష్టుని కర్పింతునా
ఆ కఠినాత్ముని నేను కల్యాణమగుటకల్ల వానితో కాపురము
జేయుటకల్ల వానిని కాంతునిగా గైకొనుటకల్ల ముమ్మాటికికల్ల
ఎప్పటికైన నే విధముచేతనైన నే నాత్మలో వరించినవానితో
నఖిలసౌఖ్యములందేలుట నిజము. ఒకవేళ బలవంతముగా
నా పాపాత్ముడు పరిణయంబాడినను ఈ నా తుచ్ఛశరీరమును
స్వాధీనము చేసికొనునేగాని నా ప్రేమలతనెట్లు కామింప
గలుగును. నా మనస్సునెట్లు మరల్చుకొనగలుగును. నా
హృదయకమల మృదుమధురము నెట్లు గ్రోలగలుగును.
నేనిప్పుడు స్వయంవర విధానమునకు సమ్మతింపకపోయిన

జనకు నన్నృతవాదిగాజేసిన దానవగుదును ఇక్లెంత కాల మాలోచించిన నేమి ప్రయోజనము. ఈ శరీరము నెట్లైన జేసి కొననిమ్ము నా యంతరాత్మమాత్ర మానాడు చోరుల హస్త గతమైన నన్నాదరించిన యువకుని హృదయమున కంటుకొని పోయెను. అఖిలావయవము లాతని కానాడే యర్పించితిని. ఆతడే నానాథుడు, ఆతడే నాదైవము, ఆతడే నాహృదయ పద్మమధురమునుగ్రోలు భ్రమరము, ఆతడే నాహృదయపీఠము నలంకరించి మదనరాజ్యము నేలు మహారాజు. ఇక నీశల్యముల కొంప నెవరు స్వాధీనముచేసికొన్న నాకు చింతలేదు నా యీ పాడు దేహ మెవరి పాలబడినను బాధలేదు ఇది నిజము. మున్ముట్టికి నిజము ఇట్లనుకొనుచుండునంతలో కారాగారము జ్ఞాపకమునకువచ్చెను. బందితుడగు యువకుని భావంబునం దలంచుకొన కన్నులకుగట్టినట్లుండెను. కామముప్పొంగెను. గబ్బిగుబ్బలు గగుర్పొడువ కాయము పులకాంకురమయ్యెను. ఆత్మనిశ్చయమంత నడుగుబట్టెను. నయనాంబరములన కాల మేఘోదయముగల్గి శోకబిందువులు జల్లునరాలెను. అక్కటా నా మనోనిశ్చయమంత మట్టిపాలగుచున్నది, ఆ నా దరణ్యమున గాన్పించిన కరుణాసముద్రుడే నాకాంతు డనుకొనుచుండ కారాగారవాసునిజూడ కన్నులు కాంక్షించుచున్నని, మనస్సు త్వర పెట్టుచున్నది, అనురాగమాకర్షించుచున్నది, కామము చెలరేగుచున్నది విరహోష్ణ మెక్కుడగుచున్నది కారణమేమి? ఈ చోరబంధిత గృహములోనున్న సుకుమారు డెవ్వరు ఎట్లు తెలియును అతనితో నాకేమిపని అట్లనుకొనుట తప్పని యంత రాత్మ చెప్పుచున్నది ఎందువలన నెంత యోచించిన నేమియు తెలియుట లేదు నా చిత్తచాంచల్యమునకు పరిహద్దులేదు నా కామోద్రేకమునకు గట్టులేదు నా యా శాతరంగముల కాన కట్టలేదు ఎందులకు నాకీ వెట్టి యేదియెట్లున్నను నా బంధితు డెవ్వరో బాగుగా దెలిసికొనవలెను మా తండ్రితో వాని తప్పు విచారించుమని చెప్పవలయును మూర్గైడి నక్కపై తాటికాయ పడిన చందమున మా జనకుడు నందనుని కొరకే యేడ్చుచుండ

నన్ను గురించియు నేడ్వవలసివచ్చినది పాపమేమిచేయును. పడరాని కష్టముల బడుచుండెనని మనంబునందేమో యనుకొనుచు వెలికిల బరుండి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. తెల్లవారుజాము కావచ్చినది పద్మినీ జాతి స్త్రీలు పంకజాసన బంధంబున పతులతో రతికేళినిందేలి పైటతో విసరుచు, పాదములనొత్తుచు పరిచర్యలొనర్చుచుండిరి. కోరిన విటకాండ్రు మారుని సంగ్రామమునచొక్కి మంచముపై బరుండబుద్ధితీరని పూబోడులు పురుషాయితమునకు బూనుకొనుచుండిరి కుక్కుటములు రెక్కలు జాడించి కొక్కొరోకోయనికూసెను. పొలములలో పనిచేయబోవువారి గుసగుసలు వినబడుచుండెను సమయాంగనాఫాలభాగము ధవళవర్ణము హెచ్చుచుండ వేగుచుక్క బొడుప విటరాజుల ముఖములు వెలవెలబోవుచుండెను. నూతనదంపతులు రాతిరంతయు నొక రవ్వంతకాలముగానుండునను రాగాలోచనా నిమగ్నులై యప్పుడే తెల్లవారెనాయని యాశ్చర్యపడుచుండ ఝల్లున తెల్లవారెను.

గూండ్లనుండి వెడలి కిచకిచలాడు పులుగులధ్వనికి కర్ణములు గింగురుమనుచుండెను. ప్రత్యూషపవనాంకురములు పరువులెత్తుచుండెను. నిదురకు నిలువలేక గగనవాణి ప్రాగ్దిశ శిరమిడి పరున్నదేమో కనుబొమల పైభాగమున కస్తూరితిలకము గానవచ్చుచున్నదనుకొనునట్లు నిదురమాని మదన యజ్ఞగుండమున మ్రగ్గిన నాయకీనాయకుల నేత్రము లరుణమై గండఫలకములు గంటువడ కణతలు లోనికిపీకు తమ ముఖములను జూచుకొను దర్పణమని భ్రమించునట్లు మేల్కాంచి లేవబూను సమయాంగన మెడ కలంకరించిన మంగళసూత్రమేమో యనుకొనునట్లు ప్రభాకరుడు ప్రత్యక్షమయ్యెను. ప్రపంచములోని ప్రాణుల పోషించు ప్రత్యక్షభగవంతుడని ప్రజలందరు ప్రణామంబు లాచరించుచుండిరి. కారాగార సమీపోద్యాన వనమున నిర్మల కాసారజలములందు పద్మములు వికసింప భ్రమరములు బయటబడి ఝమ్మను నాదమున చెలరేగుచుండెను. ఝమ్మను భ్రమరరవమును శ్రుతిరాజేసికొని పంచమస్వరంబున

పికములు పాడుచుండెను. పాటలకు సరిపోవు పద్మములకడ నున్న కప్పలు తాళప్రకారము డప్పులు వాయించుచుండెను. లయదప్పక ఫణములను విప్పి భుజంగములు బాగుగా నభిన యింప పింఛములవిప్పి మయూరంబులు భరతనాట్యముల జేయుచుండెను. శుకశారికము లొకటితోనొకటి బాగుగా నున్నదని పలుమారులు జెప్పుకొనుచు పరమహర్షంబున జూచు చుండెను. అప్పుడదియొక నాటకశాలగా నగుపడుచుండెను. విద్యుల్లత పాన్పుపైనుండి లేచి కూర్చొనెను. తమ ముద్దుల పట్టి యింకను నిద్దురలేచిరాలేదని విద్యుల్లత తల్లిదండ్రులగు రామసింహుడును, రత్నావళియు, తలంపు నెట్టుకొని దగ్గఱకు వచ్చిరి. వారిని జూచుటతోడనే విద్యుల్లత దిగ్గనలేచి నిలువ బడెను. ఆమె ముఖమును పారజూచిరి. కన్నులెఱ్ఱబారి గండఫలములపై కంటినీరు కారినచారలు గాన్పించుచుండెను. వారి గర్భములు చెక్కలైనట్లును, కరచరణంబులు విరుగ గొట్టినట్లు నురమున పదునుగల బరిసె గ్రుచ్చినట్లుగానుండి తల్లీ! నేటిరాత్రి నిదురపోలేదాయని రత్నావళి యడిగెను. విద్యుల్లత తలవంచి యూరకుండెను. ఇంక వారేమియు నడుగ జాలక క న్ను ల ను ం డి వెడలు నీరుగుడ్డలతో నద్దుకొనుచు కూర్చుండిరి. విద్యుల్లత వారిదుఃఖమును జూచి ధైర్యంబవలం బించి తండ్రీ! ఏల నిట్లు దుఃఖించెదవు. దైవయత్నమును తప్పింపగలవారెవ్వరు. ఎవరికేవేళ కేది సంప్రాప్తమగునో యనుభవింపకతప్పదు. నాకొరకు మీరేమి చీకాకు నొందవ లదనగా నామె చిలుకపలుకులంబోలిన మృదుమధుర వాక్యం బులు శ్రవణంబుల జొచ్చి వారి హృదయంబులకు కొంత శాంతికలిగించెను. విద్యుల్లత వారి కెదురుగా గూర్చుండ వారికిట్లు సంభాషణజరిగెను.

విద్యు:—నాన్నా! ఉద్యానవన సమీపకారాగారమునసున బంధితు డెవ్వరు?

రా:— తల్లీ! ఆ దుష్టుడే శిశుపాలాంతకుడు.

విద్యు:— అది నీకెట్లు తెలియును.

రా:— మనవిద్యుద్దీపుని మెడలోనున్న హారము వానికంఠ
ములో గానవచ్చినది.
వి:— ఇది నీ కెక్కడిదని యడుగలేదా మఱియు నీ వాతనిని
జూచితివా ?
రా:— ఆ శిశుహంతకుని ముఖమింతవరకు చూడలేదు: అర్ధ
మండలము రోజు లాహారమునొసంగకుండుడని యాజ్ఞ
నిచ్చితిని.
వి:— అయ్యయ్యో ! అన్నిరోజులాహారములేకుండిన నసువుల
బాయకుండునా ?
రా:— శిశుహంతకుడు చచ్చిననేమి పిచ్చిపిల్లా పాపాత్ములం
చిరకాలము బ్రతుకుదురమ్మా.
వి :— తండ్రీ ! అట్లనకుము. పాపాత్ముడో ? పుణ్యాత్ముడో ?
ఇప్పుడెట్లు తెలియును.
రా :— తెలియకేమి బాలుని వధించుట పాపముకాదా.
వి :— ఆతడే వధించెనని నమ్మకమేమి ?
రా :— ఆ పనిజేసెననుటకా హారము నిదర్శనముకాదా.
వి :— అంతమాత్రంబుననే యట్లనుకొనుటతప్పు
రా :— ఐన నన్నిప్పు డేమిచేయమందువు
వి :— వాని చరిత్రనంతయు పూర్ణముగ విచారింపుము
రా :— తల్లీ ! రణముమీదనే రాతిదెబ్బ తగిలిన చందమున
నన్నికష్టములం మనకే నొకదానిపై నొకటి గల్గుచుండిన
నిట్టిసమయంబుననే విచారింపవలెనా ?
వి :— తండ్రీ ! తప్పక నామాటలను త్రోసివేయక యిప్పుడే
విచారింపవలెను.

అని యిట్లు వారనుకొనుచుండునంతలో సేవకుడగు జయ
పాలు డత్యాలసటతో జనుదెంచి రాజా ! రక్షింపుమా. నేటి
రేయి బంధితుడు తాళము పగులగొట్టుకొని పాఱిపోయెనని
చెప్పెను విద్యుల్లతముఖము వెలవెలబోయెను. రామసింహు
డాతురతతో అమ్మాయి ! వింటివిగదా యాతని తుంటరితన
మనెను. సేవకునిజూచి విద్యుల్లత జయపాలా ! లోపలనున్న

కారాగారబద్ధుడు బయటనున్న తాళము నెట్లు పగులగొట్టు కొనిపోయెనని యనుచుండగనే రామసింహుడును జయపాలుడును మేడపైనుండి క్రిందకు దిగి కారాగారమువైపు కేగిరి. విద్యుల్లత రత్నావళితో నేమేమియో చెప్పుచుండ నింటిలోనకేగిరి.

# 9

మిట్టమధ్యాహ్నము ప్రభాకరుని ప్రచండకిరణములు ప్రపంచమంతట నలముకొని ప్రకృతిని మార్చివేయుచుండెను. రంగదుత్తుంగతరంగ పరంపర మృగతృష్ణ ప్రవాహము మితిలేక పారుచుండెను. తరణికిరణోష్ణమునకు తత్తరమంది మృగములు గుహాలలోదూరి జిహ్వాలనీరుకార నోరులు దెరచి రొప్పుచుండెను. పశ్చిమదిశ నుండి వెచ్చనిగాలి యీ చెవిలోనుండి యా చెవిలోనికి దూసికొని పోవుచుండెను. ఎండవేడికి తాళజాలక విహంగములు లాకుల చాటున నణగియుండెను. గలగలమను ధ్వనితో సుడిగాడ్పులు గగనమున కంటుచు నెండు కసవునుజుట్టి యెత్తుకొనిపోవుచుండెను. అచ్చటచ్చట క్రిక్కిరిసినట్లుండి నీ వృక్షశాఖల రాపిడి వలన చిచ్చుబుట్టి తరువులు తగులబడుచుండ ప్రాణులను మరింత బాధించుచుండెను చల్లనినీరెల్ల జీవుల నాకర్షించుచుండెను అట్టి కాలమున మణిపుర సమీపారణ్యమున తటాకము కట్టపైనున్న వట వృక్షమునీడ నొక బ్రహ్మచారి కూర్చుండియుండెను అచ్చటికి ధనుర్బాణ సహితులై తురంగముల నెక్కి యిరువురు యువకులు శరీరములు చెమ్మటలు గ్రమ్మ చెవులకు గ్రమ్ముకొనునట్లు శిరములకు గుడ్డలుకట్టుకొని కడుశ్రమచే వచ్చి యశ్వములనుండి దిగి తటాకములోనకరిగి కాళ్ళుచేతులు ముఖములను కడుగుకొని దాహంబు దీర్చుకొని వచ్చి యా వటవృక్షముక్రింద నుత్తరీయంబుల పఱచుకొని వెల్లికలపరుండి యందు నొక యువకుడు నిట్టూర్పువిడచి యబ్బా! ఏమియెండ ఏమిగాలి నా జీవితములోనిట్టి శ్రమ నెన్నడను భవించి యెరుంగను. ఆ దుష్టుడిప్పుడు నా కన్నులకు గాన్పించిన నా శరవాలమున కెర గావించి యుందుననెను. ఆ మాటలను

విని యచటకూర్చున్న బ్రహ్మచారి. రాజపుత్రులంజూచి యిట్లనియె.

బ్ర:— క్షత్రియకుమారులారా! మీదేపట్టణము. ఇంతశ్రమ యేల కలిగెను కరవాలమున ఖండింపదగిన దుష్టుడెవ్వరు.

క్ష:— అయ్యా! మాది మణిపురము, కారాగారమునుండి యొక చోరుడు తప్పించుకొని పాఱిపోయెను. వాని కొఱకు వెదకి వెదకి వేసారి యిటు వచ్చితిమి.

బ్ర:— వాడేమి నేరముచేసెను.

క్ష:— శిశుహత్య యొనర్చెను, మఱియు ధనమపహరించెను.

బ్ర:— అమ్మయ్యో! శిశుహత్యయే వాడు శిశుహత్య నెట్లు జరిపెను. అంత మొందిన శిశువెవ్వరు.

క్ష:— ఆ బాలుడు మణిపురాధీశ్వరుడగు రామసింహుని కుమారుడు. విద్యుద్దీపుడనువాడు అర్ధరాత్రివేళ రెండు లక్షల విలువగల వస్తువులను, ఆ బాలుని యెత్తుకొని పోయెను.

బ్ర:— ఆ చోరునెట్లు గుర్తించితిరి, ఎట్లు చిక్కెను.

క్ష:— చోరత్వము జరిగిన తదుపరి యుదయ మెనిమిది గంటలకు ప్రభాతకన్యలు బజారున బోవుచుండ విద్యుద్దీపుని కంఠమున కలంకరింపబడిన హారము చోరుని మెడలో గాన్పింపగా గుర్తుపట్టిరి. తదుపరి బంధించి కారాగారబద్ధుని జేసిరి.

బ్ర:— విద్యుద్దీపునకు వయస్సెంత యుండును.

క్ష:— సుమారు మూడు సంవత్సరములుండును.

బ్ర:— రామసింహున కింక పిల్లలు లేరా?

క్ష:— ఇంక నొక్కకూతురున్నది. ఆమె విషయమైకూడ రామసింహునకు మితిలేని దుఃఖము సంభవించినది.

బ్ర:— ఎందువలన.

క్ష:— పూలమాలికను నామె మెడలో బడగొట్టిన వానికిచ్చి వివాహ మొనర్చు స్వయంవరము గావింపగా కర్మవశాత్తున నా మాలికను కడుదుష్ప్రవర్తనుడగు లోభ

గుప్తుడుకొట్టైను. గొరుచుట్టుపై రోకటిదెబ్బ తగిలిన చందమున వారి కుటుంబమునకే యొక దానిపై నొకటి యిట్టి కష్టములు వచ్చుచుండ దుఃఖము గాకింకేమున్నది.

బ్ర:— శిశుహంతకుడగు యువకు డేకులమువాడో మీరు కను కనుగొంటిరా?

శు:— ఏకులమువాడో మే మెఱుగలేము కాని, అజానుబాహుడై ఆకర్ణాంత నేత్రుడై, విశాలవక్షుడై, సుందరశరీరుడై, లక్షణములనుబట్టిచూడ క్షత్రియకుమారునివలె గాన్పించుచుండెను. వేయేల నతనిని జూచిన నెవ్వరైనను చోరుడని నిర్ణయింపజాలరు.

ఆ మాటలు వినుటతోడనే బ్రహ్మచారి ముఖకమలము ముకుళితమయ్యెను. నేత్రపద్మములనుండి దుఃఖాశ్రువులు ముత్యములట్లు మృదుల కపోలములపై జారుచుండెను. ఎందులకోగాని యిక నచట నిలచి మాట్లాడలేకపోయెను. ఆ మిట్ట మధ్యాహ్న కాలంబున మిడిమిడికాయు యెండలో నా బ్రహ్మచారి పాదములు బొబ్బలెక్క నరణ్యమార్గమునబట్టి పోవుచుండెను. ఎందులకట్లరుగుట ఎవ్వరికి తెలియదు. అట్లు పోవుచు తన హృత్కమలమున నిట్లనుకొనుచు నడచుచుండెను. అవ్వగారింటి యొద్దనున్న బాలుడెవ్వరు. అరణ్యములో దొరికెనని యవ్వగారు చెప్పిరి. హత్యగావింపబడెనని చెప్పిన శిశువు పోలిక లవ్వగారియింటనున్న బాలునకు సరిపోవుచున్నవి. ఆనాడుదయముననే నరణ్యమున దంతధావనమొనర్చునప్పుడు భల్లూకమును బాణమునగొట్టి దానినోటనున్న హారమును గైకొనిన యువకుడెవ్వరు? ఆదండెచ్చటిది? ఇప్పుడు మణిపురమున తప్పించుకొనిన తస్కరుడెవ్వరు? లోభగుప్తునకంత ధనుష్పాండిత్య మెక్కడిది? ఇదంతయు చిత్రముగానున్నది. నిజానిజములు నా కెట్లు తెలియును? ఇట్లనుకొనుచు నా బ్రహ్మచారి బుద్ధిలతను స్వర్గలోకమువరకు నల్లించుచు మానసవీధిన యూహాశకటముల నురుకులెత్తించుచు త్వరత్వరగా నడచుచుండెను. ఇట్లు కొంతవరకు నా ఘోరారణ్యమున బోవ

నొకచోట దట్టముగానున్న గుట్టలనడుమనున్న చెట్టుక్రింద నిరువురు మనుష్యులు వెల్లికలగా పరుండి గుసగుసమాట్లాడు కొనుట గాంచెను. వారి మాటలలో లోభగుప్త మహారాజు అను వాక్యము వినబడగా బ్రహ్మచారికి గుండెజల్లుమనెను. త్వరత్వరగా నా గుట్టలమధ్యకుచేరి వారి సంభాషణ నాల కించుచుండెను. వారి క్రిందిరీతిగా మాట్లాడుకొనుచుండిరి.

1. మనుష్యుడు:— ఒరేబావా! లోభగుప్తరాజు బొగు సూశెడురా. పూలదండ పిల్ల మెడలో బాహుజాగర్తగా పడగొట్టినాడు.

2. మ:— ఒరేయ్! అసలు విషయం నీకు తెల్దుకామోను అది రాజు కొట్టలేదురా యీనపొయ్యేవరకు యెవరో కొట్టినార్నంట కొట్టినోడెందు కూరుకున్నాడో యెవురికి తెల్దు కొట్టినమడిశెవురా అని గోలగా పిల్లతండ్రడుగు తుంటె కుక్కురిమిక్కురాడకుం డందరు కూకోనుంటే అప్పుడు లోభగుపతరాజు నేనేనని డాబుసరిమాటనే టప్పటికి సత్తెమేనని నమ్మిర్రా సావుమొకమోళ్ళు.

1. మ:— అరే బలె పన్నాగంబన్నెడే. బలేయిగితిగల్లోడురా అయితే యిప్పుడు ఆ పిల్లను పెల్లిజేసుకుంటాడా.

2. మ:— ఆ. పెల్లికూడా దగ్గిరికే వచ్చింది.

1. మ:— అయితే ఆపిల్ల, అమ్మ, అబ్బ, సుట్టాలు, పక్కాలం యియ్యటానికిట్ట పడ్డారంట్రా.

2. మ:— వారిట్టంగిట్టంతో పనేముందిరా అన్నపెకారం యిచ్చితీరాల వచ్చితీరాల.

1. మ:— అవి సరేకాని మనరాజన్నకొడుకు యెట్టచిక్కిండ్రా

2. మ:— చెప్తా యిన్రా మనిపురంలో పిల్ల మూర్తంపెట్టుకోని పొద్దుగూకినానిక మనరాజుసైన్నం తిరిగి వత్తుంటే వాడు జేల్లాకూకోని వుండాడంటరా రాజునూసి గుర్తుపట్టి మన నాగనబావకు సెప్పేవరకు కలికి గాందారిపొద్దుకాడ మమ్మల్ని పంపేలికె తాలంపగలగొట్టి వాడిని మచ్చుజల్లి నూకొక్కనొచ్చాము.

1. మః— వాడక్కడ కోట్లో యెందుకున్నాడో.
2. మః— ఆ సంగ తెవురికి తెల్సు. వాణ్ణెవురడిగారు.
1. మః— అబ్బా! ఒక్కదెబ్బకు రెండుపిట్టలు పడ్డట్టు మన పెబువుకు పట్టిందల్లా బంగారమవుతుందిరా. అయితే ఆనాడు సంపెయ్యమని నలుగుర్ని పంపినాడు కావాల్నె వాళ్ళెందుకు యిడిసిపెట్టేర్రా.
2. మః— అబ్బో! అంతంతమాత్రపోల్లకి అలివిగాద్రా బాగు సూరత్తంగలోడురో.
1. మః— అయితే యిప్పుడోణ్ణియేమి శెయ్యాల్రా.
2. మః— యింకవాణ్ణి బూమిమీదుంచితే మన పెబువును బతక నిత్తాడంట్రా.
1. మః— బూమిమీదుంచక యేమిశెయ్యాల్రా.
2. మః— రేపు బేత్తారంనాడు కాలికాయెమ్మోరికి బలియ్యాలే. ఆయెమ్మొరుమెచ్చి మనకు అపాయాలు కలుగకుండా చేత్తది అందుకని గాదంట్రా కాలుజేతులు గట్టిగాకట్టి సొరంగంలో దాసిపెట్టింది.

ఈ మాటలు చెవిని బడగానె బ్రహ్మచారి కాపాదమస్త కము చెమ్మట బిందువులచే నిండుకొనిపోయెను. హృదయ కమల మదరిపోయెను. కాళ్ళుగడగడవడకెను. కన్నులు ముకుళితమయ్యెను దుఃఖాశ్రువులు జల్లునరాలెను. ఇక నచట నుండిలేచెను. అరణ్యమార్గము బట్టి యిట్లనుకొనుచు బోవుచుండెను.

అయ్యయ్యో! నా యాత్మలోనున్న యనుమానమే స్థిర పడినది. అకటకటా! మదనమోహనా! నీకెట్టి దురవస్థ తటస్థించినది నీవు భవునిరాణికిబలిగా నుంటివా అకరినాత్ముల కరవాలములకు కంఠమర్పింపనుంటివా ఆపాపాత్ముల చేతులలో ప్రాణముల విడువనుంటివా సకలరాజపుత్రసముదాయ గ్రహ మండల ఛాయాపతివగునీవు సర్వశత్రుకంఠ ఖండన ఖడ్గ ధారివైననీవు సంతతసజ్జనబృంద సన్నుతుడవగునీవు శాంతశమద మాది సర్వమంగళగుణ సంపూర్ణుడవగునీవు శరణాగతత్రాణ

బిరుదాంకిత కరుణా సముద్రుడవగునీవు సర్వాంగసౌందర్య నవకోటిమన్మధాకారుడవైననీవు సత్క్షత్రియ సంజనిత ధర్మ పాల సార్వభౌమ కూర్మిసూనుడవైన నీవు ఈ చోరులబారి బడితివా ఈ పాపులపాలబడితివా ఈ కలుషాత్ముల కరముల జిక్కితివా అయ్యయ్యో! నీకు దిక్కెవ్వరు నిన్ను కాపాడు వారెవ్వరు నిన్ను కరుణగనువారెవ్వరు? నినెట్లురక్షింతును. నిన్నీయాపదాబ్ధినుండి యెట్లు దరిజేర్తును ఇట్లనుకొనుచు నాకాశమువంకజూచి యేమియో నాలోచన స్ఫురించినట్లు తలపంకించి త్వరత్వరగా నడచుచుండెను.

ఇట్లా ఘోరారణ్యమున నడచి యస్తమానమగువరకు నవ్వ గారింటికిజేర నామె యెదురుగావచ్చి యర్ఘ్యపాద్యాధివిధులం బూజించి లోనికి దోడ్కొనిపోయెను. చీకటంతట వ్యాపిం చెను. అవ్వగారును బ్రహ్మచారియు భోజనముచేసి పరుండిరి. అవ్వగారు గుండెపై చేయిబెట్టుకొని హాయిగా నిద్రించెను. బ్రహ్మచారికి నిదురపట్టినదోలేదో తెలియదు. ఘళ్ళున తెల్ల వారెను. నిదురనుండి మేల్కాంచి కాలకృత్యములను తీర్చు కొనిరి. ప్రభాకరుడు ప్రత్యక్షమయ్యెను. ఆరోజు గురువారము అట్టి సమయమున చోరగుహాప్రాంతమున దట్టముగానుండిన తరువులమధ్య పాడుబడినదేవాలయములో కాళీ శిలావిగ్రహ మొకటి యుండెను. అది చూపరులకు భీతిని గర్జించు నాకా రము గలిగియుండెను. ఆ నా దే వి ని పసుపు కుంకుమచేత పూజించి లెక్కకు మిక్కుటముగ దీపములు వెలిగించి చోరు లందరు మధ్యపానంబున నోడలెరుంగక కోలాహలములు జేయుచుండిరి. ఒకవైపు గొఱ్ఱెలను మేకలను బారులుదీర్చి కట్టివేసిరి. కొంతమంది చోరులు వానిని తలల నఱుకుటకు కత్తులకు పదును బెట్టుచుండిరి. ఇంతలో కొంతమంది తస్క రులు వేపమండలతో రణములను వంటినిండ వరుసవరుసలుగా కట్టి యొక మట్టిమూకుడులో చమురునుంచి పెద్దదీపమును వెలి గించి వాని శిరముపై బెట్టి చేతులకు తోళ్ళనుగట్టి పట్టుకొని వాని శరీరమెల్లయెడల పసుపుబూసి కుంకుమచుక్కలు బెట్టి

చోరులందరు నడచుచు కేకలువేయుచు మదనమోహనుని తీసుకవచ్చి కాళీవిగ్రహము ముందుభాగమున నిలువంబడిరి.

చదువరులారా! ఒక్కమారావంక దృష్టిమరపుడు. ఈ కాళీకీరోజు మదనమోహనుని బలియొసంగవలెను. అప్పటి సూర్యోదయము పదిగంటలైనది. మదనమోహనుని యిరువైపుల తళతళ మెరయు కరవాలంబులతో నిరువురు చోరులు భయంకరాకారులై నిలువంబడిరి. గొర్రెలు మేకలు గోలగా నఱచుచుండెను. మదనమోహనుడీ ప్రదర్శనముంగాంచి నేడు నా చావు నిశ్చయమని తలంచెను. ఆతని హృదయకమలమీ ఘోరమరణమును దలంచి కుమిలిపోవుచుండెను. పాపమేమి చేయగలడు. పదుగురు పదివైపుల కదలకుండ పట్టుకొనిరి. ఇప్పుడాతనికి భగవంతునిధ్యానమే కర్తవ్యమాయెను. కొందరు చోరులు మదనమోహనుని మెడమీద చేతులుబెట్టి గట్టిగా వంచుచు దేవతకు మొక్కు మొక్కు అని గద్దించుచుండిరి. ఖడ్గధారులగు చోరులు కన్నులెఱ్ఱజేసి కరవాలంబుల పైకెత్తి చురచురం జూచుచు కంఠమునకు గురిపెట్టి నఱుకబూని యుండిరి. ఇక కనురెప్పపాటులో మదనమోహనుని కుత్తుక తుత్తునియలుగానున్నది. మాబత్తికి సంతోషించి బలేబలేవరా లిమ్మని బిల్లలందరు పడిపడి మ్రొక్కుచుండిరి. చోరనాయకుడగు నాగడు కనుసైగజేయ మదనమోహనుని మెడవంచి పట్టుకొనిరి. ఎత్తియుండిన కత్తులు కంఠముపై వ్రాలుచుండెను. ఇంతలో కాళికాదేవి సమీపమున హుం. అను శబ్దముబుట్టెను. చోరుల గుండెలు జల్లుమనెను. కంఠముపై వ్రాలనున్న కత్తులు నిలచిపోయెను. తస్కరుల దేహములు చెమ్మట గ్రమ్మ భయభ్రాంతచిత్తులై దిక్కులెల్లకలయజూచిరి. ఎచ్చట నేమియులేదు. అందరు నిశ్శబ్దముగా నుండిరి. కొంతసేపటికి భక్తులారా! భయపడకుడు అనువాక్యము వినబడెను. కొందఱు దొంగలు కాళీవిగ్రహమునకు చుట్టుదిరిగి యాలయమంతయు పరిశీలించిరి. ఏమియు కనపడలేదు. అంతవా రాశ్చర్యమానసులై నిశ్చేష్టులై నిలువంబడిరి. మఱి కొంతసేప

టికి భక్తులారా ! మీ భక్తికి సంతసించితిని నేను మీ యిష్ట
దేవతనగు కాళికాదేవిని ఇప్పటినుండి మీ కెట్టి యాపదలను
రానీక వెంటనే దిరుగుచు మీకు వశమైయుందును. కాని
మీ ఖడ్గములచేత ఖండింపబడి జీవముపోయిన శవమును నేను
భక్షింపజాలను. ప్రాణముతోనున్న వానినిబట్టి దిగమ్రింగిన
గాని నాతనువు తాపముతీరదు, నాయాకలియణగదు. కాబట్టి
మదనమోహనునిగట్టి బంధించిన త్రాళ్ళనువిప్పి మీరు వానిని
బట్టుకొనక మీరందరు గట్టిగా కన్నులు మూసికొనవలెను.
నేను తెరువమన్నప్పుడే మీరు కన్నులు తెరువవలెను. నా
యాజ్ఞ నతిక్రమించి యెవ్వరైన కన్నులెత్తిచూచిన నా భయం
కరాకారమునుగాంచి ప్రాణము లేచిపోవును. ఇదిగాక శిరము
వెయ్యివ్రక్కలై క్షితింబడును. జ్ఞాపకముంచుకొనుడు జాగ్రత.

అను వాక్యంబులు వినబడగా పట్టరాని సంతోషమున భిల్లు
లందరు గట్టిగా కండ్లుమూసికొని కదలక నిలువంబడిరి. మదన
మోహనుడు కాళికాదేవిమాటలను విని అకటా ! నేనేమి
పాపము జేసితిని ఈ కాళికాదేవికికూడ నా మీద కరుణలేదు
కాబోలు, ప్రాణముతోనున్న నన్నుమ్రింగి యా జగన్మాత
క్షుద్బాధదీర్చుకొనునట గ్రుడ్డికన్న మెల్లయే మంచిదన్నట్లు
ఇదియు కొంతమేలే. ఈ పాపాత్ముల కరవాలములకు ప్రాణము
లర్పించుటకన్న భవునిరాణికి ప్రాణము లర్పించి పరమపదము
బొందుదు ననుకొనుచు కన్నులను మూసికొని కరములను
జోడించి జగన్మాతను స్మరించుచుండెను. ఇంతలో చెవిదగ్గఱ
తిన్నగా నిట్లు వినబడెను.

మదనమోహనా ! నీవు త్వరగా నిచ్చట నుండక పరు
వెత్తుము ఆలస్యముచేసిన నీకు తప్పక ముప్పు వాటిల్లును.
తక్షణమే యీ దురాత్ములదృష్టికి దూరముగా నరుగుము అను
మాటలు వినబడెను. కన్నులు విప్పి చూచెను ఆ మాట
లెవ్వరివో తెలియకపోయెను ఇంకను పొమ్ము పొమ్ము అను
వాక్యములు చెవిదగ్గఱ వినబడుచునే యుండెను ఎవ్వరు
గాన్పింపరు ఆశ్చర్యచిత్తుడై తుదకు నంబికాదేవియేనని

యాత్మలోదలచి యచ్చటనుండి చప్పుడు కాకుండ పలాయన మంత్రము పఠించెను. క్షణములోదృష్టి కగోచరముగా మహా రణ్యములో మటుమాయమైపోయెను. అట్లాతడరిగిన వెనుక చోరులందరి కిట్లు వాక్యములు వినబడెను. భక్తులారా! ఇంక మీరు తన్నులు చెరుపుడు. నా యాకలంతరించినది మిమ్మన్ని విధముల కాపాడెదను ఈ గొఱ్ఱెలు, మేకలు నా కవసరము లేదు. కాన వాని నన్నిటిని వదలివేసి మీ నివాసస్థానంబులకు జేరుడు ఇది నాయాజ్ఞ ఇట్లు వినబడుటతోడనే తస్కరులందరు పడిపడిదండములువెట్టి పరమహర్షాంబుధి నోలలాడుచు జగన్మాత మనపూజకు సంతసించిన దనుకొనుచు చోరగుహ జేరబోయిరి.

# 10

సాయంత్రము మూడు గంటలైనది మణిపురం బెచ్చట జూచి నను పచ్చల తోరణములచేతను, ముత్యాలముగ్గులచేతను, అందమైన పందిరులచేతను అలంకరింపబడియుండెను. రాజు నగరున క్రిక్కిరిసినట్లు జనసమూహము నిండి సరససల్లాపముల సంతోష స్వాంతులై యుండిరి. పంచాగముల చేతులం దిడుకొని బ్రాహ్మణులు పదువులెత్తుచుండిరి దిక్కులుమార్మ్రోతలిడ బహు విధ వాద్యములు మ్రోగుచుండెను. ఒకవైపు రామసింహుడును రత్నావళియును దీనవదనులై తలలను వంచుకొని కూర్చుండియుండిరి. పురోహితులు మంత్రంబులను జదువుచుండిరి బంధువులందరు బహువిధ భూషణాలంకారులైవారలు దీరి కూర్చుండిరి మధ్య తలంబ్రాలమండపములో నూతన వధూవరులు పీటలపై గూర్చుండిరి ఆ నూతన వధూవరులెవ్వరు లోభగుప్తుడును, విద్యుల్లతయు, ఆనాడు విద్యుల్లత వివాహము విద్యుల్లత విశాలాక్షులనుండి శోకబాష్పములాణిముత్యములట్లవనీతలంబునబడుచుండెను ఆ మదాంధుని మోహాగ్నికింధనమువలె నామత్తేభయాన తనులత మాడిపోవుచుండెను. ఆ పద్మనయన ప్రజలను గన్నెత్తి పరికించలేకపోయెను. ఎంత

యణచిపెట్టినను, దుఃఖమతిశయించుచుండెను. ప్రాణము దివికేగిన బాగుండునని తలంచెను ఈ చండాలుని శరీరమానుట కంటె చచ్చుటే మంచిదనుకొనెను. తనువునుండి జీవమెట్లు దాటిపోవునో తెలియక తహతహపడుచుండెను. ఈ తలిరు బోడి దీనస్థితినిజూచి బంధువు లందరు బావురని యేడ్చుచుండిరి ఒక్కబంధువులేకాదు ఆ పురిలోనున్న యాబాలగోపాల మతి ఘోరముగచింతించుచుండిరి ఇక లోభగుప్తుని సంతోషాబ్ధికి చెలియలికట్టలేదు వాని యాశాతరంగముల కానకట్టలేదు వాని మోహప్రవాహమునకు మితిమేర లేదు ఈ ప్రజలందరు వారి వారి భవనంబులకేగిన విద్యుల్లత నొక్క మారాలింగనముజేసి కొని యధరసుధారసమాని యానందాబ్ధిని మునింగి తేలుదునే ఈ పాడుప్రజలేల దాపురించి నా కోరిక భంగము చేయుచుండి రని పరిపరివిధముల హృదయంబున దూషించుచుండెను. పెండ్లి యెప్పుడగునా ప్రొద్దెప్పుడు క్రుంకునా ఈ బంగరుబొమ్మ బడక టింటిలో నా ప్రక్కకుచేరిన చెక్కిలెప్పుడు నొక్కుదునా అను కామోద్రేకము హృదయమును కలత నొందించుచుండెను మధ్య మధ్య మేళముల నాపుచు మంత్రంబులను జదువుచు పురోహితులు మ ం గ ళ సూ త్ర ధా ర ణ ము తప్ప మిగిలిన పనులన్నియు వధూవరులచేతపూర్తి చేయించిరి లోభగుప్తుని యానందమున కంతులేదు విద్యుల్లత విచారమునకు మితములేదు లోభగుప్తుని సంతోషమును విద్యుల్లత శోకమును తులయందిడి తూచిన తక్కువెక్కువలు నిర్ణయింప నేరికి తరముగాదు పురోహితులు మూకుడులో నక్షతలపై మంగళసూత్రముంచి యచ్చటకూర్చున్న నఖిల జనులంటుకొనునట్లుజేసి మంగళ వాద్యములగు మేళతాళములు మారోగ్రీతలు బెట్టుచుండ శుభముహూర్తము సమీపించినదని లోభగుప్తుని హస్తములకు మంగళసూత్రమునిచ్చి విద్యుల్లత కంఠము కలంకరింపుమని జెప్పిరి అంత లోభగుప్తుడచ్చటనుండిలేచి మీసములను మెలివేయుచు మునిమునినవ్వులనవ్వుకొనుచు లేని యందమును దెచ్చుకొను చేష్టల నసహ్యకరముగా నంటరికి దోచుచుండ తన హృదయ

జనితహర్షాంబుధిలో భవిష్యద్దుఃఖమనొక లురకు లెత్తుచుండ విద్యుల్లలతను సమీపించెను విద్యుల్లత గుండెలు వేగముగా గొట్టుకొనసాగెను. ఆమె ప్రాణవాయువులు పైకి లేచి పోవ నుండెను లోభగుప్తుని దీర్ఘయుచ్ఛ్వాస నిశ్వాసంబుల కామె తూలిపడునట్లుండెను గట్టిగ కన్నులు మూసికొని గడగడ వడకుచు కదలక గూర్చుండియుండెను అంత లోభగుప్తు డామె గళమునకు మంగళసూత్రము గట్టవెంచి తన హస్తద్వయమున తాళినిబట్టుకొని యానందబాష్పము లామె శిరమున బడు చుండగా వంగికట్టబోవుచుండెను. ఇట్లు మంగళసూత్రమును కట్టబోవు లోభగుప్తుని వెనుక భాగమున రెక్కల సందుగా పెటామను ధ్వనితో నొక పెద్ద దెబ్బతగిలెను శబ్దము మాత్ర మచ్చటున్న సర్వజనులకు వినబడెను తత్తరపడంది యాతడు తాళినిధరమీదబడవైచి యెవ్వరాకొట్టినదని వెనుకకు తిరిగి చూచెను. వాని భయంకర వాక్యములకు ప్రజలందరు భయ భ్రాంతచిత్తులైరి ఎవ్వరాదెబ్బకొట్టినది ఎవ్వరికి తెలియను లోభగుప్తుడు చుట్టునున్నవారిని చురచురంజూచెను అచ్చట నున్న వారందరు తన యాత్మబంధుమిత్రులే వారిలో నెవ్వరు పరాభవపరిహాసములజేయ పాల్పడుదురు ఎంత యోచించిన నేమియు తెలియుటలేదు అందరాశ్చర్యమాననులైయాలోచించు చుండిరి. ఇట్లెంతకాలమాలోచించిన నేమిప్రయోజనము మరల లోభగుప్తుడు ధరమీదబడియున్న తాళిని శీఘ్రముగ చేతులతో నందికొని తత్తరమున దిశల పరికించుచు త్వరత్వరగా కట్ట బోయెను చేతులు విద్యుల్లత కంఠము సమీపించుటతోడనే లోభగుప్తుని చెంపలపై పెళపెళమని రెండు దెబ్బలు భేరి మ్రోతలోయనునట్లుబడెను అబ్బా యని, యాతడదరిపడెను నయనములనుండి నీరు నదివలె ప్రవహించెను. ఐదువ్రేళ్ళతో సహా హస్తచిహ్నములు గాన్పింప నాదుర్మార్గుని కపోలములపై దద్దురులు లేచెను ఇది యేమి చిత్రమని యందరు వెఱ్ఱిచూపులు జూచుచుండిరి. లోభగుప్తుని భయశోకరోషములు రెట్టింపగు చుండెను కాని కొట్టిన వారెవ్వరని కోరింపగలుగును. ఇక

విద్యుల్లత సంతోషమింతని చెప్పుటకువీలులేదు. ఆమె యానంద
మిట్టిదని వచించుట కలదియే కాదు ఇదంతయు భగవంతుని
యనుగ్రహమని భావంబునందుకొనెను. ఈ పాపాత్మునకు
తగిన పరాభవమయ్యెనని పరమానందము బొందెను ఇక లోభ
గుప్తుడెన్ని చూపులు తాళినిగట్టబూనినను తనువుపై దెబ్బలు
తగుచుండెను. ఆ భామామణిని సమీపించుటకు కూడ భయ
భ్రాంతచిత్తుడయ్యెను అంత పురోహితుండు లోభగుప్తుని జూచి,
రాజా ! ఈ లగ్నమునకు గ్రహసంపత్తు బాగుగాలేదు ప్రస్తుతము
పెండ్లి గా పు కొ ను ట యే శ్రేష్ఠమైనపని మఱియొక శుభ
ముహూర్తము నిశ్చయించి వివాహము జేసికొనవచ్చును.
ఆలస్యముచేసిన నింకేమి యాపదలు సంభవించునో గాన
తక్షణమే మనపట్టణమునకు తరలుటే మంచిదని చెప్పినందులకు
నఖిల ప్రజలు సమ్మతింప పొంగిపొరలు దుఃఖమును మ్రింగు
కొనుచు లోభగుప్తుడు ప్రయాణోన్ముఖుడయ్యెను. బెబ్బులి
బారినుండి తప్పించుకొనిన పశువుచందంబున విద్యుల్లత
యింటిలోపలకేగెను అప్పటికాగందము గడచినందుల కానం
దాబ్ధినోలలాడెను అంత లోభగుప్తుడు రామసింహునకు జెప్పి
సర్వసైన్యసమేతుడై బయలువెడలి విద్యుల్లతను తన హృదయం
బున దలచుకొనుచు దీనవదనుడై యరణ్యమార్గమున బోవుచు
తన మనంబున నిట్లనుకొనెను.

అకటా ! నేనెంత యదృష్టహీనుడను. ఈ నాడు మొదలు
విద్యుల్లతను కౌగిలించుకొని వేడుకతో కాలము గడుదుపునని
హృదయవీధిన యూహాశకటములను బరువు లెత్తించితిని. ఆమె
యామెయధరసుధారసమును చూరగొన నాసపడితిని
సర్వాంగము నా సొత్తని తలంచితిని ఆమెయే నా సర్వసౌఖ్య
ముల రాశియని సంతోషపడితిని అంతయు వ్యర్థమయ్యెను.
తుదకు పరమానందమునకు మారు పరాభవము సంప్రాప్త
మయ్యెను బంధుమిత్రులందరిలో పలుచనైతిని.

అయ్యయ్యో ! విద్యుల్లతా ! ఇంకనన్ను వివాహమాడవా
నీ కుచగిరుల నాయురమున గ్రుమ్మవా నీ యధరసుధారసమాన

నీయవా నీ మృదులకపోలముల ముద్దు బెట్టుకొననీయవా నీ చక్కని ముంగురులను సవరించుచు చెక్కిలినొక్కనీయవా నీ బాహుమూలముల పరికించుచు నఖదంతక్షత చుంబనాది క్రియల మన్మధనివాసస్థలములకు కళలంటనీయవా చానీతిబంధంబుల నన్ను సమరతులదేలనీయవా కటకటా! నేనిక నీ చింతాసాగరంబున దుమికి చావవలసినదేనా ఈ కామాగ్ని గుండమున కాలిపోవలసినదేనా నావాంఛాగిరులనుండి వసుధం బడవలసినదేనా ఆహా పాపిదైవమా! ఎంతపనిజేసితివి ఆ భామామణి నాతో భావజకేళిందేల నీకు గాంచుటకు కన్నులు లేవా ఆనందించుటకాత్మ లేదా నేనీ కామబాధనెట్లు గడుపగలను ఈ హృదయ పరితాపము నెట్లదిమి పట్టగలను. ఈ కోరికనెట్లు క్రసంగ్రదొక్కుదును నాకేమియు దోచుటలేదు. మరియు విద్యుల్లత మెడలోబడునట్లు పుష్పమాలికను కొట్టిన పురుషుడెవ్వరు అతడెందుల కూరకుండెను ఇదంతయుచిత్రముగా నున్నది ఇతరుడెవరో కొట్టిన దానిని నేనే కొట్టితినని యనుమాన మిసుమంతలేక నేనెట్లు దనృతమాడితినో యప్పుడే యనిష్టము నన్నావరించినది ఏది యెట్లున్నను విద్యుల్లత సువివాహామాడు టెట్లు అయ్యారే! ఏమి నాయవివేకము మంచి మూహూర్తమునాడు వచ్చి మంగళసూత్రధారణ మొనర్తునని మహారాజగుమామగారితో జెప్పివచ్చితినిగదా ఇంతలో నే యీ చింతనాకేల.

అని యిట్లనేక విధంబుల ననుకొనుచు నర్ధరాత్రమున కుదయపురముజేరి భోజనముచేసి పరుండెను. లోభగుప్తున కారాత్రి నిదురపట్టినదో పట్టలేదోకాని భల్లున తెల్లవారెను భానుడుదయాద్రిపైకెక్కి యుర్వీసురుల యర్ఘ్యప్రదాన ప్రణామంబుల నందికొనుచు నాకాశమార్గంబున నస్తాద్రివైపున కరుగుచుండెను.

సాయంత్రత మైదుగంటలుకావచ్చినది. మణిపురోద్యానవనాశోక వృక్షముక్రిందనున్న శశికాంత శిలావేదికపై జీవసహిత సువర్ణ విగ్రహమేమోయనునట్లు విద్యుల్లత యొంటరిగా

కూర్చుండియుండెను. చల్లగా పైరుగాలి వీచుచుండెను. నానా విధి వితాన సూనములు వికసించి వీక్షించువారికి వేడుక గొల్పుచుండెను. ఆ తరుణీమణి తనువున కలందిన పరిమిళ ద్రవ్యముల కమ్మని తావి నలుదిక్కుల గ్రమ్ముకొనుచుండెను. శుకశారికా కిలకిలారావములు చూపరుల వీనులకు విందొనర్చుచుండెను. చిగురుటాకుల గర్భములమెక్కి మదమెక్కి కడు శ్రావ్యమైన గాన మాడ్కి కోకిలలు కూయుచుండెను. సౌందర్యదేవత మూర్తీభవించినదోయన నా రామణీయము వర్ణించుట కలవిగాకుండెను. అట్టి తరుణమున వనలక్ష్మింబోలి చంద్రకాంత శిలావేదికపైనున్న విద్యుల్లత యిట్లనుకొనుచు కూర్చుండెను. లోభగుప్తునకు తగిన పరాభవము జరిగినది. ఇపటికి గండము గడచినది కాని మరల మంచి ముహూర్తమున వచ్చి మంగళసూత్ర ధారణమొనర్చుట ఆనుపు దప్పించుకొనుటెట్లు. ఆ క్రూరుని కొట్టినదెవ్వరు? ఆ దెబ్బనెట్లు తగిలెను. ఇవంతయు భవాని కృపగాకున్న పరులీపని నెట్లుచేసి నిర్వహింపగలరు. పరులుగాకున్న కాత్యాయనీదేవియే యిట్లు గావించినదైన మరల మాత్రము వాడు నాకు మాంగల్యధారణ మెట్లుచేయును. నా కంఠమున హారమును దగుల్కొనజేసిన దీదుష్టుడు కాడేమోనని అంతరాత్మ భూజమున కనుమాన లతలల్లుకొనుచున్నవి. ఇట్లను కొనుచుండునంతలో నస్తమానము కావచ్చినది. పశ్చిమదిశయం దరుణ ప్రకాశము భూమిని గ్రమ్ముకొనుచుండెను. అట్టి సమయమున నచటికి సేవకుడగు జయపాలుడువచ్చి నమ్రభావమున నమస్కరించి విద్యుల్లత కెదురుగా గూర్చుండ వారికీ క్రిందివిధముగా సంభాషణ జరిగెను.

విద్యు:— జయపాలా! ఇప్పుడిచటి కేలవచ్చితివి?

జయ:— అమ్మా! నేనొక తప్పుపని జేసితిని క్షమించెదనినన జెప్పెదను.

విద్యు:— జయపాలా! నీవా తప్పుజేయుట ఏమిటది.

జయ:— అమ్మా! ఇన్ని నాళ్ళనుండి సమయము దొరుకనందున

చెప్పుటకు సాహసించనైతిని. అగ్రహము చెందనని
నా కభయమీయవలయును.

విద్యు:— జయపాలబాబు! నీవెట్టి తప్పొనర్చిన నేనది యొప్పుగానే యెంచెదను. ఇది యమ్మాటికి నిజమునమ్ముము.

జయ:— అట్లయిన తల్లీ! నీ మెడయందు పూలమాలికను బడిగొట్టినవా రెవ్వరని నీ యభిప్రాయము?

విద్యు:— జయపాలబాబు! అట్లడిగెద వేల లోభగుప్తుడు కాడా?

జయ:— కాడు.

విద్యు:— మరెవ్వరు?

జయ:— మన కారాగారబంధితుడగు యువకుడు కొట్టెను.

విద్యు:— (ఆత్రముతో) ఆ యువకుడెట్లు కొట్టెను. నీ కెట్లు తెలియును?

జయ:— అమ్మా! సావధానచిత్తవై వినుము. నీ స్వయంవర కాలమున లేనివా రుపయోగించుకొనుటకై కొన్ని ధనస్సులను సాయకములను తీసికొని కారాగారము ముందుగా వచ్చుచుంటిని బంధితుడగు రాజపుత్రుడు నన్ను బిలచి నాకొక విల్లును బాణమునీయమని కోరెను. ఆదేమి చిత్రమోగాని యాయనను జూచిన నేదియడిగిన నది యొసంగ బుద్ధిపుట్టును. అంతవరకు నేను కఠినహృదయుడనై చోరుడనైన నీకు శరము ధనువునిచ్చిన నాకు మాటవచ్చునని మరియెన్నో జెప్పితిని. కాని చివరకు క్షత్రియకుమారు ప్రార్థనము త్రోసివేయలేక నొక విల్లు, అలుగులేని బాణము నొకదాని నందిచ్చితిని; ఇది నేజేసినతప్పు.

వి:— జయపాలబాబు! ధనుర్బాణమిచ్చినంతనే యాతడే కొట్టెనని నీకెట్లు తెలియును.

జ:— తల్లీ! చెప్పెదను వినుము. నీ కంఠమునకు హారము దగులగానే వెంటనే క్రిందబడిన శరమును కేలనందికొని బాగుగా పరీక్షించితిని అది నేనిచ్చిన యలుగులేని బాణమే.

వి:— జయపాలబాబు ! అప్పు డెందులకు జెప్పవైతివి.

జ:— అమ్మా ! శిశుహంతకునకు శరమేల నిచ్చితివి చోరునకు నా కూర్మి సుతనీవలసివచ్చెను నీ మూలమునగదా యిట్టి ముప్పువాటిల్లెనని జనకుడు కోపగించునని చెప్పుటకు సాహసించనైతిని.

వి:— తండ్రీ! ఆ యువకు డేకులమువాడో యెప్పుడైన నడిగి తెలిసికొంటివా ?

జ:— క్షత్రియకుమారుడనని మాత్రము చాలా మారులు జెప్పెను.

వి:— శిశుహత్య యెందులకు జేసితివని నీ వెప్పుడైననడుగ లేదా.

జ:— నే నెరుగను నెను.

వి:— మీ రెవ్వరు మీదే పట్టణము ఇట్లు రాగతం బెయ్యది యని యడుగ లేదా.

జ:— ఎన్ని మారులడిగినను నేనొక దిక్కుమాలినవాడను ఇది నా పూర్వజన్మ పాపఫలంబని పలుక కుండును.

వి:— తండ్రీ! బంధితుని బాగుగా జూచితివిగదా అందముగల వాడేనా అ త ని ని జూ చి న చోరబుద్ధిగలవాడేనని యూహించుటకు తగి యుండునా.

జ:— తల్లీ ! సౌందర్యమున నవకోటి మన్మథాకారుడు ఆ మను జునిజూచిన కరుణార్ద్రహృదయుని మాడ్కి నుగుణఖని వలె గాన్పించును అతడు శిశుహత్య యొనర్చెనని చెప్పుటకు సందియము కలుగును. దీని కేదయో బలవత్కారణముండవచ్చునని నా యభిప్రాయము.

ఈ మాటలను వినుటతోడనే విద్యుల్లత నేత్రపద్మములనుండి యానందబాష్పములాణిముత్యము లట్లువనితెలంబునబడెను ఆమె సంతోషమింతయని జెప్పనలవి కాదు నా కంటె నదృష్టవంతు రాలీ నవఖండములలో లేదని తలంచెను నా వాంఛ యిక తీరగ నని యుబ్బిపోయెను పేదవానికి బంగారము దొరకినట్లు పస్తు పడియున్న వానికి పంచభక్ష్యపరమాన్నము లభించినట్లు నాలుక పిడచగట్టుకొని పోవువానికి నిర్మల జలము గాన్పించినట్లు విద్యుల్లత హర్షమింతని చెప్పుటకు వీలులేదు. ఆమె ప్రపంచ

మునే మరచిపోయెను కారాగారబద్ధుడు కన్నులను గట్టి నట్లుండెను కాయముప్పొంగెను కొంతవరకట్లే ఱెప్పలార్పక జూచెను బంధితుడు పారిపోయిన సంగతి భావంబునకుదట్టెను. గుండెగుభిల్లనెను అంతరంగమున నిరాశాంధకార మొక్క-మారావరించెను హృదయసీమ నవ్యసనమారుతము వడివడిగా వీచెను. అంత జయపాలుని జూచి—

వి:— తండ్రీ! చోరుడు గానున్న పాఱిపోవుటెందులకు.

జ:— అందువలననే నాకు మరల ననుమానము గలుగుచున్నది.

ఇట్లనుకొనుచుండునంతలో నస్తమానమైనది అంధకారము ప్రకృతి నావరించుచుండెను కరదీపికలంబోలి గగనమున నక్షత్రములు మినుకుమినుకని గాన్పింపసాగెను. అచటనుండి యిరువురేదియో మాట్లాడుకొనుచు సంతోషపురమార్గమున నడచిరి ఆ గ్రామమంతయు నంధకారమయ్యెను. పురమున దీపములు భూనభోంతరాళములనిండి నిబిడీకృతమయ్యెను.

# 11

ఒక రోజుదయపుగమున ప్రాతఃకాలమున లోభగుప్తుడు నిదురమేల్కాంచి పాన్పుపైనుండి లేచి పచ్చరాకట్లు సోపాన పంక్తిగ గడచి రత్నశాల ముందుభాగమున నిలువంబడి కోట గోడవైపుజూచెను ' కోటకవాటము ప్రక్క గోడ లోపలి భాగమున పెద్దపెద్ది యక్షరములతో వ్రాసిన రాతిపలక నొకటి కట్టబడియుండెను దానిని జూచి త్వరగా నచ్చటకు నడచి భటుని బిలచి దానిని తీయించి చూచెను. ఆ ఫలకముపై నిట్లు వ్రాసియుండెను.

ఓరీ! లోభగుప్తా!

నీకు మృత్యుదేవత సమీపించినదని ముమ్మాటికి నమ్ముము. అందరాని ఫలముల కాశించినట్లు జంబుకము స్వర్గ ' సుఖ జన దలంచినట్లెందుల కిట్లు దూరాలోచనలేక దురాశాపీడితుడ వయ్యెదవు పగబట్టిన పాము ప్రాణముల తీయకుండునా? ఈ జగములోని చక్కదనముగానున్న చంచలాక్షులందరిని

భార్యలగా బడయగోరు భ్రాంతి నీకేల. విద్యుల్లతను వివాహ మాడు వెట్టికోరికేల ఆ నాడు సజ్జనసమ్మత సత్యవాక్పరిపాలన సకలధర్మాచరణ బిరుదాంకితుండగు చంద్రవర్ధన మహారాజు మరణకాలంబున, "ఎట్లైనను నాపగదీర్పుము" అని నాతో చెప్పి పోయినది నీవు తెలియదుకాబోలు ఆ జన్మాంత శత్రువు నగు నేనుండ నీ యాటలేమిసాగవు. ఇక కొద్ది దినములలో నీ రుధిరము ఘూకకాకాదులు గ్రోలనున్నవని తెలిసికొనుము. కామసుఖములకేల కాలము వ్యర్థపుచ్చెదవు పరమపదమును బొందుటకు భగవంతుని ధ్యానించుచుండుము.

ఇది నా ప్రచండశాసనము,

జాగ్రత్త

ఇట్లు, నీ ప్రాణాపహరణదేవత

చంద్రవర్ధన మహారాజుకూర్మితనూజ

మనోరమ

ఇది జూచి లోభగుప్తుని గుండె నీరైపోయెను. కాయమంత గడగడవడంకెను కాళ్లు ధరణిపై నిలుచుటలేదు అయ్యారే! మనోరమమరణమైన దనుకొంటిని ఆ మాయలమారింతకాల మెచ్చటనున్నదియో! ఎప్పుడీపలక నిచటకట్టిపోయెనో? జనకుని పగదీర్ప సంసిద్ధముగనున్నదట ఇదంత కడువిచిత్రముగ నున్నది కానిమ్మని తలయూపుకొనుచు సభామంటపమున కరిగి సింహాసనముకడకు చేరబోయెను గంటమ్రోగింపబడెను అకాలమున గంటమ్రోతవిని దేమి యాపదలు సంభవించెనో యని ప్రజలాతురతజెంద భటనటకవిగాయక బంధుమిత్ర సేనాధిపతులు పరువులెత్తికొని రాగ వ్యాయస్థానమంత నిండి పోయెను. నిశ్శబ్దముగ వారి వారి స్థానముల నలంకరించిరి. అంత లోభగుప్తుడు రౌద్రాకారముచే రక్తనయనుడై మహారాజ మానులంబిలిచి, ఓరీ! మీరు కావలి గాయుచుండగా మరు లీ గోడను పలకనెట్లు గట్టిపోయిరనగా భటులు భయభ్రాంత చిత్తులైరి బంధుమిత్రులందరు నాపలకను వీక్షించి యొకరి మొగంబుల నొకరు జూచుకొనుచు నమితాశ్చర్యమానసులై

నేమేమియో యాలోచించుచుండిరి. వారి కేమియు దోచలేదు ఇంతలో మణిపురమునుండి యొకభటుడు యుత్తరము నొక దానిని తీసికొనివచ్చి లోభగుప్తున కందీయ ప్రక్కనున్న మంత్రి దానిని తీసికొని యిట్లు చదివెను.

ఓరీ! లోభగుప్తా!

నీ మోసమును గ్రహింతిని. కారాగారవాసుడగు క్షత్రియ కుమారుడు పుష్పమాలికను నా ప్రియ తనూజమెడలో బడ గొట్టి యుండగా ధనుష్పాండిత్యముగలవానివలె నీవు నేనే కొట్టితినని యసత్యమాడి విద్యుల్లతను వివాహమాడ నెంచితివి. నీగుట్టు బయటబడినది. ఇక నీవు మణిపురనగరమునకు జనుదెంచిన నీ మర్యాదదక్కదు. ఇట్టి పాపకార్యమున కొడిగట్టినందు లకే భవానీదేవి నీకు తగిన పరాభవముజేసి పాఱిపోవజేసినది. ఇక నారాజ్యపరిసరములలో నడుగుబెట్టిన నీ రక్తము భూమిపై ప్రవాహముగా పాఱజేసెదను. బుద్ధిగలిగి సంచరించుము.

జాగ్రత్త

ఇట్లు మణిపురాధీశ్వరుడు,

రామసింహుడు.

పాపము లోభగుప్తుడు భటుడు లేఖ నిచ్చుటతోడనే మామగారు మంచి ముహూర్తమునుబెట్టి పెండ్లిజేసికొనుటకు రమ్మని పిలువనంపెనని యుత్సాహపూరితుడయ్యెను. ఇక నిప్పుడో పెల్లికల బరుండబెట్టి యెదురు రొమ్ముపై పదిబారు వుల బండను బడవేసినట్లయ్యెను. శోకసముద్ర తరంగముల మధ్య చిక్కుకొనిపోయెను. హృదయసీమ నవ్యసనమారుతము వడివడిగా వీచుచు కామమోహ వృక్షములకు నల్లుకొనిన వాంఛాలతలను వేఱుపరచుచు శోకబిందువులతోగూడిన తుపాను చెలరేగెను. చెమ్మటచేనిండి దేహము చల్లబడెను. అకటకటా! మదనమోహనుడే యా మాలికను గొట్టెనా? పోనిమ్ము ఖైదియయిన మదనమోహనుడు మరణమయ్యెనుకదా? వీరికిప్పుడెవ్వరు చెప్పిరి. ఎట్లు తెలిసెను. విద్యుల్లతనింకెవరికిచ్చి వివాహ మొనర్తురు. ఆ భామామణిని చేపట్టక నేను బ్రతుకుటెట్లు.

అయ్యయ్యో! నేను చేసినప్రయత్నమంతయు నేలపాలై పోయెను. ఇప్పుడు నాకు కర్తవ్యమేది. ఇట్లనుకొనుచు నేమియు దోచక యిరువురు మిత్రులం దప్పితదితరులందరిని వెళ్ళుట కాజ్ఞనీయ వారివారి స్వస్థానంబులకు జేరిరి. అట్లు వారు పోయినవెనుక లోభగుప్తునకు నాతనిమిత్రులకు నీక్రింది రీతిగా సంభాషణ జరిగెను.

లోభ:— మిత్రులారా! విద్యుల్లత నాకింకెట్లు దక్కును. ఎన్ని ప్రయత్నములు జేసినను వృధయగుచుండెను.

1 మిత్రు:— పూలహారమునుగొట్టిన బంధితుడెవ్వరో?

లోభ:— ఎవ్వరోనని యూహింపనేల? మదనమోహనుడే.

2 మిత్రు:— మదనమోహనుడైన కారాగారమున నెందుల కుండెను.

లోభ:— ఎందులకుండెనోగాని విద్యుల్లత స్వయంవరము రోజున నింటికి వచ్చునప్పుడు కారాగారములో కనపించితేనేగదా! చోరులం దీసికొనివచ్చి కాళికి బలి యొసంగినది.

1 మిత్రు:— మదనమోహనుడు మరణమైన తదుపరి వీరికెట్లు తెలిసెను.

లోభ:— అదే చిత్రముగానున్నది.

2 మిత్రు:— మదనమోహనుడే మాలికను కొట్టెనని పూర్ణముగ నమ్మెదవా?

లోభ:— దాని కింకను సందియమా మొట్టమొదటినుండియు నా ప్రేమలతను మొదలంట గోయుచున్నదివాడే. ఆనాడు పెద్దతల్లి గృహమునుండి వచ్చుచున్న బండికి నడ్డముగాపోయి విద్యుల్లతను పట్టుకొనివచ్చు తస్కరులను తరిమికొట్టినదివాడే.

1 మిత్రు:— అది నీకెట్లు తెలియును. మదనమోహను డచటపు కెందులకుండెను.

లోభ:— మదనమోహను నిర్మూలించుటకని మహారణ్యమునకు బంపుటయు, వాడు తప్పించుకొని పోవుటయు మీ

కెరిగిన విషయమేక దా? అట్లు వా డ స్తమానమగు
న ప్పుడు పారిపోయి యరణ్యంబునంబడి తెల్లవారు
జామున కచటికి చేరెను కాబోలు.

2 మి:— మదనమోహనుడే యచటికి చేరెనని యెట్లు నిర్ధారణ
చేయగలవు.

లో:— చెప్పెదను వినుడు. ఆనాడు చోరులను తరుముకొని
వచ్చి పల్లపుభూమిలో దుమికి దారి గానకనేమో
దిక్కులు పరికించుచు నిలువంబడిన ప్రచ్ఛన్నకు లోలుగ
చోరులు బాగుగాజూచి చోరగుహజేరబోయిన ట.
మొన్న కారాగారమునుండి పట్టుకవచ్చి కాళికిబలి
యొసంగిననాడు గుర్తుపట్టి నాతో మప్పుతరిమికొట్టిన
దీ మనుష్యుడేయని చెప్పిరి.

1 మి:— మదనమోహనుడు తస్కరులను తరిమికొట్టి ముప్పు
తప్పించెనని విద్యుల్లతకుగాని నామె తలిదండ్రులకుగాని
తెలియనట్లేక దా.

లో:— తెలిసియున్న నిట్లేల జై లునందుందురు.

2 మి:— మనమిపుడేమి చేయవలెను.

లో:— నాకేమియు దోచలేదు.

1 మి:— మనమేమి చేయుటకు సమర్థులముకాము. చోర
నాయకునితో సంప్రదించుట మంచిదని నా యభి
ప్రాయము.

ఇట్లు వారు కొంతవడికేమేమియో ముచ్చటించి భోజనవేళ
యయినదని యచటనుండి లేచి కొంచెము ముందునకువచ్చి
కోటద్వారము వీక్షింప రాజవీధిలో నొక బ్రహ్మచారి కాషా
యాంబరధారియై పోవుట గనుంగొని త్వరత్వరగా వారు
మువ్వురు కోటదాటి బయటకువచ్చి వాకిటనిలచి బ్రహ్మచారిం
బిలచి లోభగుప్తుడు, గోసాయీ! నీవు ప్రశ్నలు చెప్పెదవా
యనెను వెంటనే బ్రహ్మచారి లోభగుప్తుని ముఖమును పార
జూచి రాజా యొక స్త్రీ నిన్ను జంపదలచియున్నది.
జాగ్రత్తగా నీ ప్రాణములను గాపాడుకొనుము నీ కోరికలెల్ల

నిష్ఫలంబగును. ఇంతకన్న నీ సమయమున నెక్కువగా చెప్ప జాలనన లోభగుప్తుడు, మహాత్మా! ఆ మానినీమణి యెచట నుండెనో తెలియజేయుమన నా బ్రహ్మచారి రాజా అట్లుం చెప్పుటకు వీలులేదు. మరల కొద్దిరోజులలో నీ మార్గమున నే వచ్చెదను అప్పుడు విశదముగా వివరింతుననుచు నచట నిలువక నా పట్టణ చివరకు నడచుచుండెను. లోభగుప్తుని దృష్టికి దూరమైపోయెను హృదయమున బండబడవేసినట్లయ్యెను వారు భోజనము చేయుటకు సౌధమును జేరబోయిరి. అట్లు నా బ్రహ్మచారి యా పట్టణముదాటి యరణ్యమార్గమున సాయంత్రము నాలుగు గంటలకు మణిపురోద్యానవన సమీప మునకు చేరబోయెను. అట్టి సమయమున నుద్యానవన నశోక వృక్షముక్రిందనున్న శశికాంతశిలావేదికపై చెలులతోడంగూడి విద్యుల్లత కూర్చుండియుండెను. వారింజూచి బ్రహ్మచారి అమ్మలారా! మంచి నీరెచటనుండెనని యడుగ నందొక చెలి లేచి ఇదిగో! ఇక్కడ నొక సరోవరముండెనని చెప్ప నా గోసాయి త్వరగానడచి సరోవరముంజేరి కాళ్ళు చేతులం ముఖమును గడుగుకొని పానీయంబునుంద్రావి స్త్రీలున్న చోటునకు రాగ విద్యుల్లత చంద్రకాంత శిలావేదికపై నుండి లేచి భక్తి వినయములతో నమస్కారముచేసి యిట్లు దయ చేయుడనిపల్క నా బ్రహ్మచారి శశికాంత శిలావేదికపై గూర్చుండి యాలసటను దీర్చుకొని విద్యుల్లతనుగాంచి, అమ్మాయీ! నీ తల్లిదండ్రుల పేరేమి నీనామాక్షరము లెవ్వియన నా యబల మహాత్మా! మాతండ్రి రామసింహమహారాజు మా తల్లి రత్నావళి నా పేరు విద్యుల్లత యని చెప్ప నా బ్రహ్మచారి తన మనంబున, ఔరా! ఏమి యీ కాంత సౌందర్యము ఇట్టి సుందరముగలది గనుకనే లోభగుప్తుడీమె కౌగిలి కెంతయో శ్రమపడుచున్నాడు ఇట్లనుకొనుచు నా బ్రహ్మచారి విద్యుల్లతను తదేకనిష్ఠతో విలోకించుచు గూర్చుండగా విద్యుల్లత నాతపసితో నిట్లనియెను.

వి:— మహాత్మా! మీదేదేశము మీ నివాస స్థానమెద్ది.

బ్ర:— అమ్మా! మా యాత్రశమము రామేశ్వరముకడనున్నది.

వి:— మహానుభావా! మీ రిప్పుడెచ్చటికి నేగుచుండిరి.

బ్ర:— తల్లీ! మా బోటివారికేమిపనియున్నది. భగవద్ధ్యాన పరాయణులమై పుణ్యస్థలములకు దిరుగుచుండుటయే కదా? పని.

విద్యు:— మహాత్మా! కొందరు బిక్షాటనముజేయుచు దిరుగుచు చేతులను జూచుచు సోదులను జెప్పుచుందురే వా రెవ్వరు?

బ్ర:— అమ్మా! అట్లు తిరుగువారు బైరాగులు. నాకును హస్త సాముద్రికము అంగసాముద్రికము జ్యోతిశ్శాస్త్రము మొదలగునవి తెలియును. కాని మేమట్లుతిరుగము. మాకేమియవసరము వారు ధనమున కాశించి తిరుగుదురు. మాబోంట్లకు భగవద్ధ్యానమే సకలసౌభాగ్యము.

విద్యు:— మహాత్మా! మీకు హస్తసాముద్రికము దెలిసినట్లైన నా చేతిని పరీక్షింపుము. (అని నా బ్రహ్మచారికి దగ్గఱగా కూర్చుండి కరముసందించెను.)

బ్ర:— (చేతినిబట్టుకొని) అమ్మా! నీకొక చోరగండము తప్పినది. నీకు కష్టకాల మంతరించినది. కాని యిం కొక ముప్పువాటిల్లునేమోయని నా కనుమానము దయిం చుచున్నది. నీ కోరిక రీతినే పతిని బడయుదువు. కొద్ది కాలములోనే కల్యాణమగును. ఆయుర్భాగ్యరేఖలు నీ కధికముగనుండెను. నీకు తోడబుట్టువగు నొక్క బాలుండుండెను. కాని యీ బాలుడిప్పుడు మీస్వగృహమున ప్రస్తుతము లేడని తోచుచున్నది.

విద్యు:— (ఆత్రముతో) మహానుభావా! ఏమయ్యెనో యెచటి కేగెనో దయయుంచి నాసోదరు తెఱఁగెరిగింపుము.

బ్ర:— తల్లీ! భవిష్యత్తుఁ జెప్పుటకు నింటికి పెద్దవారువచ్చిన గాని, కాలముఁబట్టి లగ్నకోటివేసి ప్రశ్నరూపమున జెప్పుటకు వీలులేదు. సాముద్రికమున సరిగాజెప్పుట చాల కష్టము.

ఇట్లు బ్రహ్మచారి చెప్పిన విద్యుల్లత యాజ్ఞచే నొకచెలి రాజనగరునకు బరుగిడెను. కొంతసేపటికి రత్నావళియు రామసింహుడును అచటికివచ్చి బ్రహ్మచారికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి కూర్చొని మహాత్మా! మీ దరిశనంబున మేము ధన్యులమైతిమి. మాకు భవిష్యత్తునుదెల్పి మమ్ము కరుణజూడవేయన నా బ్రహ్మచారి చిరునవ్వునవ్వుచు ప్రొద్దు వైపుజూచి పాదచ్ఛాయలను లెక్కనిడి లగ్నకోటిని వేసి యప్పుడప్పుడు పైకి పారజూచుచు నిట్లు చెప్పదొడంగెను.

బ్ర:— రాజా! మీకు శనిగ్రహము మూడింటనున్నాడు. చాలామంచిది గురువు స్వక్షేత్రమైన ధనుస్సులోయుండి లగ్నమును దిలకించుచున్నాడు. శుక్రుడు కేంద్రస్థానమున బలముగా నున్నాడు. అంగారకుడుమాత్ర మష్టమంబుననుండి ముందొకప్పుడు కొద్ది యనిష్టము గలుగజేయును. నీకు నొక కుమారుడును కూతురునుగలరు. ఆ కుమారుని చోరులు పట్టుకొనిపోయిరి. ఆ బాలుడు మృతినొందెనని మీరు దలచుచుండిరి. కాని సజీవుడుగానే యున్నాడు. మీరు పట్టుకపోయిన చోరులకు తెలిసికొనక నిరపరాధియగు నొక క్షత్రియ కుమారుని బందితునిగాజేసితిరి. ఆ కారాగారవాసుడే నీ కుమార్తె స్వయంవరకాలమున ధనుష్పాండిత్యమహిమ జూపినది, ఇదిగాక నా క్షత్రియ కుమారుడే యరణ్యమున నీ కుమార్తెను పట్టుకొనిన తస్కరులను తరిమికొట్టి యీ తరుణీమణిని కాపాడినది. నీ కూర్మి తనూజను మాత్రము నొక క్రూరుడు మోసముచేసి వివాహ జేసికొననెంచెను. ఇప్పుడా గండము తప్పినది.

రామ:— మహాత్మా! నా కుమారుడెచ్చటనుండెను.

బ్ర:— రాజా! నీ కుమారున కింతవరకు ప్రాణాపాయమేమియు లేదు. దినదిన ప్రవర్ధమానుడై పెరుగుచున్నట్లుగా గ్రహములనుబట్టి తేలుచున్నది. స్థలనిర్ణయ మొనర్చుటకు భవిష్యత్తునకు పార్వతీదేవి శాపమున్నందు

వలన చెప్పుటకు వీలుగాదు. కొన్ని రోజులలో నిన్ను కలిసికొనగలడు.

రామ:— మానితిలకా! కారాగారమునుండి యువకు డెట్లు తప్పించుకొనెను ఎందులకట్లు చేసెను.

బ్ర:— పాపమాయువకుని చోరులెత్తుకొనిపోయి భవానికి బలిగా నొసంగబూనిరి భగవంతుని యనుగ్రహమున నాగండమును తప్పించుకొని బయటబడెను.

రామ:— ఇప్పు డాతడు కుశలముగ నున్నాడా.

బ్ర:— ఆ క్షేమముగానేయున్నాడు. కొద్దిరోజులలో మీ గృహమునకు జనుదెంచునని తోచుచున్నది అట్లు వచ్చిన నతిత్వరలో నీ బిడ్డనిచ్చి పరిణయముచేయుట బహు మంచిది.

ఈ మాటను విని విద్యుల్లత వదనపద్మము వికసించి మంద హాస తరంగాబ్ధిలో మునింగి తేలుచుండెను. అంత నా బ్రహ్మ చారిలేచి పదిబారలదూరమరగి విద్యుల్లతను బిలిచి తల్లీ! నీ నాధుడు తప్పక వచ్చును నాతని మనస్సు కరుగునట్లు మరు కేళి జేసి వాని మన్ననబొందుమని మరింకేమేమియో జెప్పి రాజున్న స్థలమునకుంజేరి రామసింహునిజూచి రాజా! నేనింక నాలస్యము చేయరాదు. త్వరితగతి నరుగవలయునన, మహాత్మా! ఈ రాత్రి మా యింట నుండుమని కోర నాబ్రహ్మ చారి, రాజా! నేనిప్పుడిచట నుండుటకు వీలులేదు పట్టణము లలో కొన్ని రోజులకు పాదము పెట్టరాదు ఇది నావ్రత మన వారింకేమియు మాట్లాడలేకపోయిరి. మరల నాబ్రహ్మ చారి రాజా! నీ కుమారు డెచ్చటనుండెనో నేను తెలిసికొన ప్రయత్నము చేయుదును కాబట్టి యా బాలునకేమేమి గుర్తు లుండెనో చెప్పుమన మహానుభావా! నా కుమారునకు కుడి నేత్రములో నొక పుట్టు మచ్చయును, నాభిస్థానమునకు వలయాకారముగ రోమరాజియు నుండెనని మరింకేమేమియో గుర్తులు చెప్పెను. అంత నా బ్రహ్మచారి యచటనుండి యుద్యానవన పశ్చిమ భాగమునందున్న మార్గమున వేబడి మహా

రణ్యామువైపునకరిగెను. ఆ బ్రహ్మచారినిదృష్టి కగోచరమగు నంతవరకు రామసింహుడాదిగాగలవారు జూచుచు నిలువంబడి తదుపరి వారిలోవారు బ్రహ్మచారి ప్రత్యక్షముగా జూచినట్లు చెప్పుటను గురించి వింతనొందుచు, నచటనుండి యంతఃపుర మార్గమునుబట్టి పోవుచు రామసింహుని గాంచి విద్యుల్లత తండ్రీ! నిజానిజము లిప్పటికి దెలిసినవికదా ఆనాడు బంధితుని విచారింపుమని చెప్ప నాతడు పాపాత్ముడని పలికితివి ఆతడే నన్ను నా పాదసన్నిధి చోరులపాలబడి యిదివరకే చచ్చిపోదును కదా యనెను.

రామసింహుడు తాను నిజము తెలిసికొనక నిరపరాధిని శిక్షించినందులకు హృదయమున పశ్చాత్తాపపడుచు బ్రహ్మచారిని మరిమరి బొగడుచు అంతఃపురాంతర్భాగమునకు చేరిరి.

ఘండాంశుడు పశ్చిమ సముద్రమున మునిగెను తమోదేవత దశదిశలకు తన చేతులను జాచుచుండెను క్రతుభుజులు భుజించు కంచమునునట్లు చంద్రోదయము కాగా రాలిన మెతుకు లేమోయనునట్లు నక్షత్రములు గనుపింపదొడగెను. పద్మములు ముకుళించెను కుముదములు వికసించెను కొంతసేపటికి నిశ్శబ్ద దేవతమూర్తిభవించెను జనులందరికి గుండెలపై చేతులు చేరెను.

# 12

మధ్యాహ్నకాలంబున మార్తాండుని కిరణంబులు మహారణ్యమున తరులతాది పత్రముల నెండించి ధరణిపై రాలునట్లు జేయుచుండెను. ప్రభంజనుడు పరదేశములకు పారిపోయెనేమో కాని యరణ్యమున మాత్ర మొక యాకునైన నల్లాడించుటలేదు చల్లనినీడనుండినను శరీరములు తుక తుక నుడికి చెమ్మటబిందువులు క్షితిపై బడుచుండెను. నీలాకాశమున నెక్కడ జూచినను కడుచు బిశ్శంత మేఘమైనను కనుపించుటలేదు కాసారముల జలమంతయు కళపెళమని క్రాగుచుండెను. అట్టి సమయమున నరణ్యమున నొక వృక్షము క్రిందనున్న

పచ్చికపై చెమ్మట నార్చుకొనుచు నొక క్షత్రియకుమారుడు
కూర్చుండియుండెను శిరోజంబులు జడలుకట్టి శరీరము చిక్కి
పోయి, చొక్కాయు, ధోవతియు చినుగుబట్టి నల్లగా
నుండెను ఆ కర్ణాంత నేత్రమ్మృదులకపోల సుస్నిగ్ధఫాలభాగము
లచే నొప్పి సుందరంబింపొందు ముఖబింబ చంద్రికలు మాత్రము
దశదిశలను దాకుచుండెను. తన కోమలకరములచేత మృదు
పదముల నొత్తుకొనుచు తరుశాఖలపై దృష్టిని బరపుచు
నేనేమిరో యనుకొనుచు దీనవదనుడై కన్నీరు విడచుచుండెను
ఆ యువకు డెవ్వరోనని దలంపవద్దు సుక్షత్రియసంజనిత
స్వర్ణపాల సార్వభౌమ ప్రియసూనుడగు మనమదనమోహనుడే
అట్లు కూర్చొని యాతని మనంబున నిట్లనుకొనుచుండెను.

అయ్యయ్యో! నేనెంత యదృష్టహీనుడను. జనపాలుని
గర్భమున జనియించి శౌర్యధైర్యస్థైర్యములఁగల్గి శరణాగత
త్రాణ బిరుదాంకితుడనై, భూతదయాళుడనై, బుధజనవిధే
యుడనై, పుణ్యాపాపవిమర్శకుడనై, ధర్మాధర్మ విచక్షణుడనై,
ధనధాన్యవస్తువాహన భటనటకవిగాయక బృందసమృద్ధుడనై
రత్నరజితకనకరాసులతో తులదూగవలసిన నేను వంది
మాగధులు కైవారములుసేయ వామాంకమున మనోరమయుండ
వరమణిమయ రత్నసింహాసనము నధిష్ఠించి పట్టాభిషిక్తుడనై
ప్రజలను పాలింపదగిన నేను, ఈ భయంకరాటవులలో, ఈ
క్రూరమృగసంచారఘోరారణ్యములలో, ఈకంటకావృతమైన
కొండదారులలో, ఈ నరులు చొరనశక్యమైన గిరిగహ్వరము
లలో, ఈ నాగుబాములు నివశించు వాగువంకలలో, ఈ
కాలుబెట్ట సందులేని కుటజములలో, కట్టగుడ్డలేక, తినతిండి
లేక, పండమంచములేక, నివసింపనిల్లులేక కాలమును గడుప
వలసివచ్చెను గదా!, హా పాపిదైవమా యెంతపని జేసితివి.
ఉద్యానవనములలో విహరించుచు సౌధములలో సంచరించుచు
సర్వసౌభాగ్య సంతోషములలో కాలము గడుపవలసిన నాకు
నేటికి కాక ఘూకగృధ్రజాతుల యరపులే శుకశారికానినదంబు
లయ్యెనా? సింహశరభశార్దూల భయంకరశబ్దములే సంగీత

మయ్యెనా ? వృక్షములనీడలే వివిధహర్మ్యములయ్యెనా? పచ్చికబయళ్లే పట్టెమంచములయ్యెనా ? పాచిబట్టిన బండలే బంగారు గద్దెలయ్యెనా ? ఫలపత్రమూలములే పంచభక్ష్య పరమాన్నములయ్యెనా ? ఈచేలములే యీనాడు దుకూల వస్త్రములయ్యెనా ? హావిధీ ! నన్నింకేమి చేయుదువు. పడరానికష్టముల పాల్పరచితివి చెప్పరాని యవమానంబుల చేకూర్చితివి భరింపరాని బాధలం బెట్టితివి ఆహారములేక నాకలిమంట లతిశయిల్ల నల్లాడుచు నర్ధరాత్రములలో నరణ్యమున సంచరించునట్లుజేసితివి పాడుబడిన గోడలక్రింద పరుండ జేసితివి నిరపరాధినగు నన్ను కరుణలేక జైలునందుజేర్చితివి తుదకు కారాగారమునుండి చోరుడు పారిపోయెనను ప్రజల నిందలకు పాత్రునిగా నొనర్చితివి.

ఇక జీవమును తీయు నొక్కపనియే చేయదగియున్నది. ఆనాడు కాళికాదేవి నన్ను మ్రింగినప్పటికి కైలాసముజేరి యుందును. అట్లైనను నేనానంద మనుభవించెడివాడనే కానిమ్ము. ఎన్నిశ్రమలబడనున్నానో యేమి కానున్నానో యని తలపోసుకొనుచు మరియు నిట్లనుకొనెను.

ఆనాడు చండాలుడగు లోభగుప్తుడు సమరంబునకుం జని చంద్రవర్ధను నేమిజేసెనో, మనోరమ గతియేమయ్యెనో, దుష్టుడగు లోభగుప్తుని దుండగములను భరించుచు నుదయపురమున ప్రజలెట్లుండిరో, విద్యుల్లత వివాహవిషయమెట్లు జరిగెనో, మనోరమ విద్యుల్లతలు మదాంధుడగు లోభగుప్తునకే స్వాధీనమై రాయనుకొనెను. ఒక్కసారి మనోరమ విద్యుల్లతల రూపములు మదికితట్టెను. హృదయసీమన మదనబాణాగ్ని మంటలై రెగసెను. దేహము గగుర్పొడిచెను. చెక్కిళ్ళయందు చెమ్మటబుట్టెను. మనస్సుతొందరించెను. గుండెలు దడగొట్టెను. వెచ్చని యుచ్ఛ్వాసనిశ్వాసములు వేగముగా సాగెను. కామజ్వరము చెలరేగెను. కన్నులకేమేమియో గాన్పించుచుండెను. ఇక నచటనుండలేకపోయెను. అడవిలో నొక మార్గమున బోవుచుండెను. అసంఖ్యాకములగు నాలో

చన లాతని హృదయకమలమును బెసంగొనుచుండెను. అట్లు కొంత దూరమరుగ రంగరాజు పట్టణమునుండి మణిపురమునకు బోవుమార్గముననున్న తటాకము కట్టపైని వటవృక్షశాఖను దాని కెదురుగానున్న మరియొక వటవృక్ష శాఖను దారి కడ్డముగా నొక యినుపగొలుసు కట్టి దానికి కంఠములవరకు ఖండింపబడిన తొమ్మిది మనుష్యశిరములు కట్టబడియుండెను. ఆ తలలు నోరులు దెరచుకొని దీర్ఘదంతములు బయటబడ నాలుకలుజాచి భయంకరముగా నుండెను. ఇంకను నెత్తురు చుక్కలు వడియుచునే యుండెను. ఒక్కొక్క తలకు సరిగా బండిచక్రమంతభూమి రుధిరమున మునిగిపోయెను. ఈ దృశ్యము మదనమోహనుని కంటబడెను. గుండె జల్లుమనెను. ఆపాద మస్తకమువరకు నవయవములదరెను. నలుదిక్కులం గలయ జూచెను. ఎవ్వరు గాన్పింపలేదు. నిశ్చేష్టుడై నిలువబడెను. కొంతవరకట్లే జూచెను. తదుపరి దగ్గరకుబోయి ధైర్యంబవలం బించి యిట్లనుకొనెను.

ఆకటా! వీరెవ్వరో మార్గస్థులై యుండవచ్చును. చోరులు వీరి సొమ్మపహరించి శిరములను ఖండించి కసిదీరక నిట్లు కట్టి యుండిరి కాబోలు పాపము. వీరికెట్టిగతి సంభవించినది. యిట్లనుకొనుచు నటునిటు పారజూచెను. ఆ తటాకమును, దోవలను, గుట్టలను జూచిన నానాడు బండికడ్డముగావచ్చి తస్కరులు తరుణీమణిని బట్టుకొనిన స్థలమిదేనని తన మనంబు నకు దట్టెను. స్ఫురణకు దెచ్చుకొనిన నా ప్రదేశపుగుర్తు లన్నియు సరిపోవుచుండెను. అయ్యయ్యో! ఈ ప్రదేశమున నెచటనో భిల్లులు నివసించుచు ప్రజలను బాధించుచుండిరి. నేనిప్పుడిచ్చట తడవుచేసిన తప్పక ముప్పువాటిల్లును. ఈ మార్గస్థులు సజీవులైయున్నను. సహాయముచేసిన బాగుండును. ప్రాణములుపోయినవారియెదుటనుండి నేను చేయుపని యే మున్నది. ఆలస్యముచేసిన నాకేమి యాపదలు సంభవించునో యని వెనుకకు తిరిగితిరిగి జూచుచు దిక్కులను పరికించుచు నాదారి తప్పించి యతిత్వరగా నడచి ఎచటికిపోయెనో

యొవ్వరికి తెలియదు.

అట్లు మదనమోహనుడు మాయమైన వెనుక కొంతసేపటికి ఖండితశిరములున్న స్థలమునకు లోభగుప్తుడును నాతనిమంత్రియు నశ్వారూఢులై భిల్లుడొకడు ముందు పరుగెత్తుచుండగా వచ్చి తురగములనుండి దిగి వటికి వ్రేలాడగట్టిన శిరస్సులను జూచిరి. గుండె జల్లుమనెను. కన్నీరు కాలువలై పాఱెను.

చోరనాయకుని మరణమునకు శోకముప్పొంగెను పెద్దపెట్టున బావురనియేడ్చెను. కుడిభుజము కూలిపోయెనని గుండెలు బాదుకొనెను ఆకస్మికమరణములను గాంచి యవనిపైబడి పొర్లాడెను. చెలికాండ్రు చచ్చిరని తలపై మోదుకొనెను. అంత లోభగుప్తుని మంత్రి యోదార్చిన నేడ్పుమాని లోభగుప్తుడు చోరునిజూచి మీరెచ్చట పరుంటిరని ప్రశ్నింప వాడిట్లు చెప్పదొడగెను.

రాజా! మేమందరము మీయొద్దనుండి తెల్లవారుజామున వచ్చి చల్లనిగాలి కాయుసుకదిబ్బలపై నొక్కచోటనే విశ్రమించితిమి రేయంతయు నిద్రలేకుండుటచే మా ప్రాణములెటుపోయినవో మాకు తెలియదు. ప్రొద్దుపొడిచిన తదుపరి నేను మేల్కాంచి లేచిచూడగా మొండెములు గాన్పించెను. గుండెగుభిల్లనెను కెవ్వున కేకవైచి క్రిందబడితిని కాళ్ళు గడగడ వడంకెను మరిలేచిచూచితిని మనుష్యులెవ్వరు గన్పింపరైరి. దిక్కుదోచక నేను తత్తరపడుచు నీ తటాకమునొద్దకు పరువెత్త తలలు గాన్పించెను తక్షణమే మీ దాపునకు వచ్చితిననగా లోభగుప్తుడు మితిలేక వచ్చు దుఃఖమును మ్రింగుకొనుచు దగ్గఱకు బోయి తలలను పరికించుచుండెను ఇనుపగొలుసుల మధ్యనున్న యిత్తడిరేకుపై "లోభగుప్త మహారాజు" అను యక్షరములు రూఢిగా గాన్పించెను ఇదేమి వింతయని కొంచెమాకడజూడ తాళపత్రమొకటి వ్రేలాడుచుండెను. తస్కరునిచే నా తాటి యాకును దీయించి చదువగా నిట్లు వ్రాసియుండెను.

ఓరీ లోభగుప్తా!

నీ గొలుసుచేతనే నీ మిత్రుల శిరములను వ్రేలాడజేసితిని.

ఇక నీ మిత్రునిఖడ్గముచే నిన్ను తుదముట్టింపనుంటిని ఇదితప్పదు పరుండిన పులిని కదలించితే పైబడకుండునా కొద్దికాలములోనే నిన్ను కాలసర్పము కరువగలదు బుద్ధిగలిగి భ గ వ ం తు ని ప్రార్థించుము. విద్యుల్లతను కౌగిలించు వెఱ్ఱి మానుము. "ఎట్లైనను నా పగదీర్పుము" అని చెప్పిన నాతండ్రి వాక్యము లింతలోనే మరచితిననుకొంటివా! నీకును నీ మిత్రుల గతియే పట్టునని ముమ్మాటికి నమ్ముము.

ఇది నా ప్రచండశాసనము.
ఇట్లు నీ ప్రాణాపహరణ దేవత
మ నో ర మ.

ఇది జూచి లోభగుప్తుడు తత్తరపడెను. దడదడమని గుండెలు తల్లడిల్లెను అకటా! ఆకులట యెట్టిఘోర కార్యమును గావించినది పరులు చొరరాని ప్రదేశంబుల నివసించుచు నిమిషమాత్రంబున నిర్జరులనైన మాయోపాయంబున మహింకిందే గలిగిన సమర్థతగలిగి హఠాత్తుగా జూచిన నడలి చచ్చుభయంకర రూపముగలిగి బలపరాక్రమముచే ప్రజ్వరిల్లు చోరనాయకుడగు నాగనినే సంహరించెనే నన్ను మాత్రము బ్రతుకనిచ్చునా? నేను మృత్యుముఖమునం బడుట ముమ్మాటికి తప్పదు. ఇచ్చట నెంతకాలముండిన నేమిప్రయోజనము స్వగృహమునకేగి సర్వాంగసుందరియగు విద్యుల్లతను కౌగిలించుకొని వేడుకతో ర తు ల ం దే లు చు బ్రతికినంతకాలమైనను పరమానంద మనుభవింతును ఆలస్యముచేసిన నాయబలను గూడకముందే యీ పాపాత్మురాలు నా ప్రాణములుతీయునేమో ఈ మాయలమారి మనోరమ చెప్పినంతపని చేసితీరునని తోచుచున్నది జీవము కొంచెము శరీరమునుండి తొలగెనా? చేసిన ప్రయత్నమంత వృధయగును చేజిక్కిన యమృతమును క్షితిపై పాఱబోసినట్లగును.

కావున నేను విద్యుల్లతను కలిసికొన నింటికి వెళ్లుచేమంచి దనుకొనుచు చోరునిజూచి, ఓరీ! విద్యుల్లత బండిని బట్టు

నా డిచ్చిన యినుపగొలుసే యిది. ఇంతవరకెచ్చటనున్నదన నాచోరుడు రాజా! ఆనాడు దారికడ్డముగా వృక్షములకుగట్టితిమి మేము బాణముల దెబ్బలకు నిలువలేకపోయి పదిరోజుల వరకు నీ స్థలముకడకు వచ్చుటకుగూడ భయముగలైను. తదుపరి యొక దినమువచ్చిచూడ నీ గొలుసు కనుపడలేదు. బండిలో వేసికొని వారి పట్టణమున కేగిరని తలంచి తిరిగిపోతిమి. ఇపుడెచటనుండి వచ్చెనో వింతగానున్నదన లోభగుప్తుడు చోరుని జూచి ప్రొద్దుతూలిపోవుచున్నది. మరణమైన వారు మరల రారుకదా? నీవుమాత్ర మొంటరిగా నిచ్చోటనెట్లు వసింతువు. కాన సుదయపురముననే నుందువు పదమని తానును మంత్రియు తురంగంబులనెక్కి చోరుడు వెనుకభాగమున చనుదెంచగా చీకటిపడువరకు పట్టణము చేరవచ్చిరి. అశ్వంబునుండి దిగి నగరిలోనకు ప్రవేశించి స్నానముచేసి భోజనముగావించి చందనాది పరిమళద్రవ్యములను శరీరమున కలందికొని తాంబూలమును సేవించుచు తన పడకటింటికిబోవ తల్పము నమర్చి దాసీజనములు దయసేయుడని తలుపులు దెఱచిపోయిరి. అంత నా పాపాత్ముడు పర్యంకముపై బవ్వళించి భావంబునం దేమేమియో యనుకొనుచు పరమానందంబున నుబ్బితబ్బిబ్బులై పోవుచుండెను. రాత్రి పదిగంటలకాలమైనది. పడకటింటిలో నాల్గువైపుల పెద్దపెద్ద దీపములు వెలుగుచుండెను. మాటిమాటికి లోభగుప్తుడు మంచముపైనుండిలేచి ద్వారముకడకు వచ్చి తొంగిచూచి పోవుచుండెను. చీమ చిటుకుమన్నను చంచలాక్షి వచ్చుచుండెనని యుల్లము జల్లుమన నుబికియుబికి జూచుచుండెను. ఇంతలో నిరువురు దాసీలు విద్యుల్లతను నెట్టుకొనివచ్చి పడకటింటిలోనకు త్రోసి తటాలున తలుపులు మూసిపోయిరి. కవాటమును దీసికొని బయటకు బారనెంచు విద్యుల్లతను వెనుకకులాగి లోభగుప్తుడు గడియబిగించెను. పాపము విద్యుల్లతమేను కంపించిపోయెను. వీని పిశాచరూపమును జూచి భీతినొందెను. వీని దనుజకృత్యమునుజూచి తల్లడిల్లెను. కాత్యాయనీదేవియు నీమారు గండము తప్పింప దను

కొనెను. గొంతు బ్రద్దలగునట్లు గోలగానఱచెను. ఆ పాపుడు గ్రుడ్లెఱ్ఱజేసిన భయభ్రాంత చిత్తయయ్యెను. అన్నా! నా ప్రార్థన మాలించు మనుచు నవనిపై బడెను. పడిపోయిన విద్యుల్లతను పాసుపకడకు లాగుకొని భామామణీ! ఈ పెంకె తనమేల నా పంచప్రాణములను నీ యధీనమందుంచి పట్టపు దేవిగా నొనర్చెదను. నీవు చెప్పినట్లు నడచుకొనుచు నీయాన శిరమున ధరింతును. తప్పక సమరతులదేలి నన్ను ధన్యునిగా జేయుము. సకలమ్ము నీవయేయని నమ్ముకొనియున్న నామదికి సంతసము జేకూర్పుమనఁగా విద్యుల్లత లోభగుప్తుని పాదము లను బట్టుకొని, తండ్రీ! నన్ను దయజూడుము. నాకు దడ బుట్టుచున్నది. నీ తాపమును దీర్పదగిన దాననుగాను. నీ పట్టువల వీడకున్న ప్రాణములను విడచెదను. నీకు పదివేల వందనము లర్పింతును. బ్రతికినంతకాలము నీమేలు మరువనని బహువిధంబుల బ్రార్థింపగా పకపకనవ్వి లోభగుప్తుడు పిచ్చిదానా! ఈ వృథాప్రయాసయెందులకు నీవు స్త్రీవిగావా! నేను పురుషుడనుగానా! నీకొరకెంత శ్రమపడితినో నాకే తెలియును. పరిహాసమున కిట్లనుచుంటివాయని పైటను బట్టు కొని బలవంతముగా లేవదీసి పరమహర్షంబున గౌగలించుకొన బోయెను ఎదురుగొమ్మున చేయిబెట్టి విద్యుల్లత లోభగుప్తుని వెనుకకు బడద్రోసి వేగముగ తలుపును దెఱచుకొని సోపాన పంక్తిని బరుగుతో దాటి కరిరథాశ్వశాలలగడచి కోట కవా టము చెంతకువచ్చెను కోటద్వారమింకను మూయలేదు విద్యుల్లత వేగమున వీధికి బరువెత్తెను. అంత క్రిందబడిన లోభగుప్తుడు తొందరగాలేచి పండ్లుపటపటనూరుచు బజారు వఱకు బరువెత్తెను కన్నులెఱ్ఱచేసి విద్యుల్లత జడను గట్టిగ పట్టు కొని గిరగిరద్రిప్పి క్రిందబడవైచి యీడ్చెను ఆమె బావురమని యేడ్చెను.

భవనంబులనుండి జనులు బయటకురాగ కవాటములుమూసి లోపలనుండుడని గద్దించిపలికెను. వీధిలో దీపములు వెలుగు చునే యుండెను విద్యుల్లతలేచి కురులను విరబోసికొని వెక్కి

వెక్కి యేడ్చుచుండెను. ఎదురుగానుండి లోభగుప్తుడు, ఓసీ! కులటా! నన్ను తప్పించుకొని పోవుటకు నీతాత తరమా నే. కండ్లకావరమున నన్ను క్రిందబడవైచి వచ్చితివి నీకు మంచికాలములేకనే నన్ను వంచనజేయదలంచితివి ఈ వీధి యందుననే నిన్నిచ్చవచ్చినట్లు జేయుదును నీ యబ్బయెవ్వ డడ్డమువచ్చునో వీక్షించెద ఇచటనే కామసుఖముం దేలుదును నన్నుగాదను వారెవ్వరో కనుగొందుననుచు బాహువులచే బలముగా గౌగలించుకొని యురము నురమునజేర్చి యొక యరుగుకడకు నెట్టుకొనిపోయి పరుండజేయవలయునని పెనగు లాడెను బలమెంతజూపినను ప్రయోజనములేకపోయెను విద్యుల్లత గుండెలు వేగముగా గొట్టుకొనసాగెను ప్రాణములు దేహామునుండి పైకి లేచిపోవ నుండెను. లోభగుప్తుడు ప్రపం చమునే మరచిపోయెను లజ్జాభిమానంబులను విడచెను మే పులకరించెను మనస్సుత్వరపెట్టెను ఆ ముగ్ధచెక్కిలిని ముద్దు పెట్టుకొనబోయెను చెంపపై విద్యుల్లత చటాలునగొట్టెను. అంత లోభగుప్తుడు దశదిశలదరదంతఘట్టనమొనర్చి క్రూరా కార రక్తనయనుడై యా సారసాక్షి శిరముపై సుత్తువకోలదె మోదెను ప్రేటు వెంటనే విద్యుల్లత వెనుకనున్న యరుగుపై బడెను మెదడవరెను, కర్ణములు దిమ్ముపడెను, కనురెప్పలు నిలచిపోయెను, కదలకపరుండెను. భవనంబులలో నున్నవారు గవాక్షంబులకడనుండి యీ ఘోరకార్యమునుజూచి పాపము పాపమని పశ్చాత్తాపపడుచుండిరి. ప్రయోజననేమి? ఆ పాపుని జూచి భయపడని ప్రజలెవ్వరు.

అంత లోభగుప్తు డరుగునెక్కి యీ చిలుకలకొలికి నాచే జిక్కినదని కులుకుచు బంగరుబొమ్మ నాపాలబడినదని పరమా నందము నొందుచు విద్యుల్లత వదనము వీక్షించుచు పయ్యెద బాపి గుబ్బలను పరికించుచు ప్రక్కన బరుండబోయెను విద్యుల్లత యిదంతజూచుచున్నది కాని యామె కేమియు దోచ లేదు చచ్చినట్లు చలనరహితయై పరుండెను ఇంతలో చప్పట్లు గొట్టిన శబ్దము వినబడెను లోభగుప్తుడు తలయెత్తి దశదిశల

నీక్షించెను తనకేమియు గన్పడలేదు కను తెప్పపాటుకాలము తమపరి ఖంగుఖంగుమని కత్తులు దాకుకొనినధ్వని కర్ణములం జొచ్చెను లోభుడు దిగ్గునలేచెను "ఓరి లోభగుప్తా!" ఎక్కైనను నా పగదీర్పుమనుట యింతలోనే మరచితివా యనుమాట వినబడెను, హా చచ్చితినని యఱచెను అవనిపై లోభగుప్తుని శిరమెగిరిపడెను రక్తము చిందించెను మొండెము క్రిందబడి గిజగిజ తన్నుకొనుచుండెను భటులు పరుగులతో విద్యుల్లత కెదురువచ్చిరి కరవాలములచే ఖండింపనెంచిరి భటుల మస్తకములు భూమిపై దొర్లాడెను ఆ నారీమణి నడచుచునేయుండెను. సైన్యాధిపతివచ్చి విద్యుల్లతను సంహారింపబూనెను తలపగిలి ధరణిపై తన్నుకలాడెను. ఈ ఘోరకార్య మీక్షించి జనులు కవాటములను బిగించుకొనిరి ఇక వీధుల నిశ్శబ్దదేవత విహరించుచుండెను చంద్రోదయమగుచు తూర్పుదెస తెల్లబడెను ఆ భీత హారిణేక్షణపట్టణముదాటి భీకరారణ్యమున ప్రవేశించెను తెల్లవారుజామైనది.

సతీపతుల వియోగ నుబాసి చక్రవాకములు సంతోషమున చంచువులతో నొకటి నొకరీతి ముద్దుపెట్టుకొనుచుండెను. చంద్రకిరణములను గర్భములనుండ చకోరములు మెక్కుచుండెను. వేగుచుక్క బొడిచెను. విహంగముల ధ్వని చెలరేగెను. ఇంకను విద్యుల్లత నడచుచునే యుండెను. ఇట్లు మనంబున నాలోచించెను.

ఆ పాపాత్ముల శిరములెట్లు భూమిపై బడెను? "ఎక్కైనను నా పగదీర్పుమనుటింతలోనే మరచితివా" యను వాక్య మెవ్వరిది. నేత్రములకు గన్పడకపోయెను. నేలపై తలబు తెగిపడెను. నిశ్చయమున దుర్గాదేవియే దుష్టుల సంహారించినది. నాకింక భయమేమిలేదు. భవాని పాదపద్మములకు పదివేల వందనములను కొనుచు కొంతవరకేగిపోవ నదియొకటి ప్రవహించుచుండెను. ఆనది లోనకుదిగి కాళ్ళుచేతులను గడుగుకొని ఆవలకుంజేరి యొన్నడు నడచి యెఱుగనిది గనుక కాళ్ళు నొప్పులుబుట్ట కరములచే నొత్తుకొనుచు నిసుకతిన్నెపై

కూర్చొనెను. అంతకుముందా స్థలసమీపమున పరుండిన యొక ఘోటకము చప్పుడువిని త్రుళ్ళిపడిలేచెను. దానికి కళ్ళెము మెడకు వ్రేలాడుచుండెను. పల్లముమాత్రము బిగింపబడెను. విద్యుల్లత దిక్కులను పరికించెను. ఎవ్వరు గాన్పింపలేదు పార్వతీదేవి నన్ను రక్షింప నీ గుఱ్ఱమును పంపెనేమోయను కొనెను. అట్లు గాకున్న నాకేమిభయము. ఎవ్వరైనవచ్చి నాదియనినప్పుడే విడచిపెట్టి పోయెదననుకొని కళ్ళెమును నోటికి దగిలించి పల్లమును బాగుగా సవరించి పైననెక్కి బాటకు మరలించెను. భానోదయమగువరకు తన పట్టణము చేరెను. ఇంక విద్యుల్లత తలిదండ్రులు వేడుకలెట్లుండెనో యెవ్వరు వచింపగలరు.

# 13

మణిపురమున రామసింహమహారాజు సింహాసన మధిష్ఠించి యుండగా పండిత బంధుమిత్ర కవిగాయక పాటక విద్వజ్జన దండనాయకులు క్రిక్కిరిసినట్లు కచ్చేరియందు కూర్చుండి యుండిరి. రామసింహమహారాజు సింహాసనమునుండిలేచి తన ముందున్న బల్లపై చేతులు నానించి సభను విలోకించి.

సభాసదులారా! మిమ్మిపుడు రావించిన దెందులకో చెప్పెద నాలకింపుడు. నాప్రియసుతయగు విద్యుల్లత మొన్నటి రోజ స్తమానమైన వెనుక యుద్యానవనమునుండి యొంటరిగా నింటికి వచ్చుచుండ నాకస్మికముగా నలువురు చోరులామెను పట్టుకొని యరువకుండ నోటికి గుడ్డలుగ్రుక్కి యెత్తుకొని పోయిన సంగతి మీకు తెలిసియేయున్నదికదా!

అట్టి నా ప్రేమపట్టిని నాదాపునజేర్చి నన్నానందాబ్ధిని నోలలాడించిన యశ్వమును పసుపుకుంకుమ నానావిధనూనము లచే పూజించి బహువిధవాద్యములచే పట్టణమంతయు నుత్స వము చేయవలయునని సంకల్పించుకొంటినన సర్వజనులు సంతోషహృదయాంతరంగులై సమ్మతించిరి.

సాయంత్రము నాలుగుగంటలైనది. చల్లగా పైరగాలి వీచుచుండెను. ఆ ఘోటకమును పసుపుకుంకుమచేత పూజించి పుష్పహారములను మెడనిండ సలంకరించి సుగంధద్రవ్యములను దాని శరీరమెల్లయెడల నలంది పట్టుపీతాంబరములు పైనగప్పి కాళ్ళకు గజ్జియలనుగట్టి గాంచువారి కానందము గల్గునట్లు శృంగారముజేసిరి. భేరీమృదంగఢమరుఢక్కా వాదిత్రా బహువిధ మంగళవాద్యములు దిక్కులు పిక్కటిల్ల మార్మోతలు బెట్టుచుండెను. వీక్షించువారు విరులను గైకొని ఘోటకములపై పుష్పవృష్టిని గురిపించుచుండిరి. భావజునిచేతి సాయకములోయన దగిన సర్వాంగ సుందరులగు చంచలాక్షులు కనక పళ్ళెరంబుల కరములం దిడుకొని కడుభక్తితో హారముల నిచ్చుచుండిరి. వేశ్యలు నాట్యమొనర్ప వందిమాగదులు కైవారములుసేయ నిరుప్రక్కల పరిచారకులు వింజామరములు వీవ సేవకులు ఛత్రములుబట్ట సతీసుత సహితుడై రామసింహ మహారాజు రథము నెక్కి వాజివెనుక భాగమున వచ్చుచుండెను. ఇట్లు దక్షిణము నుండి యుత్తరదిశ రాజవీధినబోవ నొక్కచో రామాలయ మొకటుండ నచ్చట విశాలమైన స్థలముగలదు. ఆ స్థలమునకుంజేరి ప్రజలందరిని కూర్చుండజేసి విద్వాంసులు తమ శక్తిసామర్ధ్యములను జూపుచుండిరి. వారినిగురించి వివిధ రీతుల వీక్షించువారు చెవులను కొఱుకుకొనుచున్నారో యనుకొనునట్లు చిన్నచిన్నగా చెప్పుకొనుచుండిరి. రామాలయమున కెదురుగా కొంచెమాకడ మెరకప్రదేశమున నొకయువకుడొంటరిగా నిలువంబడి వీక్షించుచుండెను సభలోనున్నవారొక్కరైన నాయువకుని జూచియుండలేదు. కాని యాతని చక్కదనమిట్టిదని యెట్లు వక్కాణింపగలము. దూరమున నుండి కాంచిన దుష్యంతుడని శకుంతల పురూరవుడని యూర్వశి, చంద్రుడని తార, భానుడనిఛాయ, పద్మనాభుడని రాధ, ప్రద్యుమ్నుడని రతి, భ్రమంజెందకపోరు.

ఇట్లొంటరిగానున్న యువకుడు గుజ్జుమ్మ కంటబడెను. వీనిని జూచుటతోడనే గుజ్జమ్మ కిలకిలారవముల చెవులు గింగురు

మనునట్లుగా సకిలించి శ్రవణంబుల నిక్కునట్లుజేసి తోక నెగ బట్టి సభనుదాట ప్రయత్నించుచుండ నిదేమిటని కూర్చున్న వారు ప్రక్కకుతొలగి యెచటికి పోవునోయని వీక్షించుచుండిరి అట్లాయశ్వము ప్రజలందరిని తప్పించుకొని పరువెత్తి యొంట రిగానున్న యువకునిజేరి సకిలించి శిరము వాని పాదములపైజేర్చి యలముకొనుచుండెను. అంత నా సుందరు డానందబాష్పము లొలుక దాని శిరమెత్తి చేతితో నవరించుచు చిత్తమున నేదియో నాలోచించుచుండెను. జనులందరు యువకుని దగ్గఱకుచేరిరి నేవకుడగు జయపాలు డరుదెంచి సాష్టాంగ దండ ప్రణామంబులాచరించి వెనుకకు తిరిగి రథము కడకు చనుదెంచి రామసింహునితో నేమియోజెప్ప నా రాజు తక్షణమే యువకు డున్న స్థలమునకువచ్చి యా క్షత్రియకుమారుని రూపురేఖా విలాసాదులకు నచ్చెరువందుచు నిట్లు ప్రశ్నించెను.

రామ:— ఈ గుఱ్ఱమెవరిది నీ కడకు రాగతంబెయ్యది.

యువ:— ఇది నా యశ్వము. నన్ను గుర్తుపట్టి నా దగ్గఱకు వచ్చినది.

రామ:— నీ వెవ్వరవు.

యువ:— నే నొక దిక్కుమాలినవాడను. మీ కారాగారము నుండి పాఱిపోయిన చోరుడను.

రామ:— క్షమించుము. నేను తెలియక నిరపరాధివగు నిన్ను శిక్షించిన నాతప్పు సైరింపుము.

యువ:— రాజా! అందు నీ తప్పేమున్నది. అర్ధరాత్రమున కారాగారమునుండి పాఱిపోయినందులకు నీవే నన్ను క్షమింపవలయును.

రామ:— నీ పేరేమి.

యువ:— నా పేరు మదనమోహనుడు.

రామ:— మదనమోహనా! చచ్చిన బురదపామును గొట్టెద వేల. జరిగిన విషయమంతయు స మ గ్ర ము గా జెప్పెదను వినుము.

అని చేయిబట్టుకొని మదనమోహనుడును, రామసింహు
డును కలసి యితరులు వెంటనడువ రథముకడకువచ్చిరి విద్యుల్లత
మందస్మితవదనారవిందయై నయనాంబుజ శృంగారవీక్షణముల
మదనమోహనునిజూచెను. తాను జూచినది యితరులు గాంచి
రేమోయనుకొని లజ్జాబ్ధితరంగ పరంపరలు హృదయసీమను
ముంచివేయ తలవంచుకొనెను ఆమె చూపులలో వినయవిధేయ
ప్రేమభావములచే నమస్కారమొనర్చినట్లు మదనమోహనుని
మానసంబునకుదోచెను మదనమోహనుని కరుణాకటాక్ష
వీక్షణములు విద్యుల్లత సుస్నిగ్ధఫాలభాగమునుండి మృదుల
కపోలారుణాధరకంబు కంఠచక్రస్తన నతనాభ్యున్నతోరు
పాదకములపైగావచ్చి తనముందు భూమిపై ప్రసరించెను.
ప్రద్యుమ్నుడు మదనమోహన విద్యుల్లతలమధ్యనుండి సమరంబు
సలుప సవ్యసాచికాకన్న ఘనుడాయని తన సామర్థ్యంబుజూపు
చున్నాడోయన సవ్యాపసవ్యంబుల సాయకములు సంధించి
విడచుచుండెను. ఆ పుష్పశరతూణీరంబుల తాపులకు వారి
దేహంబులు పులకరించుచుండెను. రామసింహ మదనమోహ
నులు రథముపైనెక్కి క్షణములో రాజనగరునకుచేరిరి ఆ పట్ట
ణములోని యాబాలగోపాలము కచ్చేరీయందు గూర్చుండిరి.
రామసింహుడు సింహాసన మధిష్టించి యుండగా నెదురుగా
మరియొక పీఠముపై మదనమోహనుడు కూర్చుండియుండెను.
ఆ సభకు సమీపముననున్న సౌధముపై చెలులతో దంగూడి
విద్యుల్లత సభను గాంచుచు వారిమాట లాకర్ణించుచు, చెలులు
చెతురుమాటలాడ సిగ్గున తలవంచి నవ్వుచు కూర్చుండియుండెను
అంత రామసింహుడు మదనమోహనునిజూచి నీ చరిత్రమంతయు
మాకు దెలియజేసి మమ్ము ధన్యులనుజేయుమని ప్రార్థింప నా
మదనమోహను డిట్లు చెప్పదొడగెను.

అయ్యా! మాపట్టణముదయపురము మాతండ్రి ధర్మపాలుడు
నాకు హేమపురాధీశ్వరుండైన చంద్రవర్ధన మహారాజు కూతు
రగు మనోరమనిచ్చి పాణిగ్రహణముజేయు నట్లనుకొనునంతలో
మాతండ్రి స్వర్గ మలంకరించెను. నాటినుండి మాపినతండ్రియగు

లోభగుప్తుడు, మనోరమను తాను వివాహము జేసికొననెంచి మాయోపాయమున నన్ను మరణమొందింపదలచి నలుగురు మనుష్యులతో మూలికలదెచ్చు నెపంబున మహారణ్యమున కంపవారు నన్ను ఖండింపబూనుట తెలిసికొని యశ్వమునుండి క్రిందకు దుమికి తప్పించుకొని యరణ్యమున పరుగిడితిని. వారు నన్ను కనుగొనజాల కెటు బోయిరో నాకు తెలియదు సూర్యుడస్తమించెను చీకటి వ్యాపించెను కళ్ళుచినుకు లొక్కొక్కటియే రాలుచుండెను ఆ గాఢాంధకారములో నొంటరినై తెల్లవారుజామున నొక తటాకముకడకు జేరితిని ఆనాడు నేనెన్ని కష్టములనో పడితినిగాని నేనొక్క విషయము దలచుకొనిన సంతోషముపొంగుచుండును.

రామ:— అదియేమిటి.

మద:— ఆ తటాకముకడ చోరులబారిబడిన యొక సుందరీ మణిని రక్షించితిని అట్లు రక్షించుటకు సమర్థతగలుగుటకుగూడ దైవానుగ్రహమేనని తలంచవలెను. అనెవరకా చోరుల మాటలను వినుచు వారి వెంబడే నడచుచుంటినిగాని చేతులో ధనువు లేనందుకు చింతిల్లుచుంటిని తస్కరులు తటాకముపై కూర్చుండ వారికెదురుగా నేను గుట్టల నడుమ కూర్చొనబోవ నొక ధనస్సునంబులపొదియు గన్పించెను. వానిని బాగుగా పరిశీలింప నవి నావియే యయ్యెను.

రామ:— మదనమోహనా! నీధనుర్బాణము లచట నెందుల కుండెను.

మద:— మేమశ్వముల నెక్కిపోవునపుడు నన్ను జంపదలచిన వారు నావెనుకభాగమున గుఱ్ఱముపై నున్నవానిని నాకు తెలియకుండ నా స్థలమున దీసినైచిరి కాబోలు.

రామ:— తరువాత నేమి జరిగెను.

మద:— అంత నేను వానిని గైకొని గుట్టల నడుమకూర్చొని యుండ కొంచెము చీకటియున్నప్పు డా మార్గమున వచ్చుబండిని పట్టుకొని చోరులుం దానిలోని స్త్రీని నె

గొని పోవుచుండ తస్కరులను తరిమికొట్టితిని తిరిగి వచ్చు దారి తెలియక నింకొక మార్గమున బోయితిని.

రామ:— మదనమోహనా! నిన్నెంత గొనియాడదగును ఆ తస్కరులచేజిక్కిన తరుణీమణి యెవ్వరోయని దలంప వద్దు నా ప్రియతనూజయగు విద్యుల్లతయే నీ కరుణా కటాక్ష వీక్షణమువల్లనే ఆమె ప్రాణము దక్కినది.

ఇట్లన మదనమోహనుని ప్రజలెల్లరు వేనోళ్ళ బొగడుచుండిరి విద్యుల్లతనుజూచి నవ్వుచు చెలులు, ఇదేమి చిత్రనుమ్మా ఇట్లు బొగడుచుండిరి భార్యను కాపాడుకొనుటది యొక పెద్ద సంగతియేనా యన విద్యుల్లత చిరునవ్వునవ్వెను అంత రామసింహుడు మదనమోహనునితో నిన్ను కారాగారమున బెట్టునపుడు నీ మెడలోనున్న హారమెట్లులభించినదన నాయువనుడు, రాజా! నేనొక రోజుదయకాలమున నరణ్యమార్గమున నడచుచుండ హారమును నోటబట్టుకొనిన భల్లూక మొకటి గాన్పింప దానిని శరమునంగొట్ట క్రింద విడచి పరువెత్తెను.

ఆ హారమును కంఠమున కలంకరించుకొని మీ పట్టణముచేరి వీధిలో కూర్చొనియుండ నన్ను బంధించి కారాగారములోన బెట్టితిరి. అట్లుజేయుటకు కారణమేమి?

రామ:— ఆ రాత్రి నా కుమారుడగు విద్యుద్దీపుని హారముతో సహా చోరు లెత్తుకొనిపోయిరి. అది నీ మెడలో గాన్పించినందువలన నీవే శిశుహంతకుడవని దలచి జైలునందు జేర్చితిమి. తదుపరి నీవు కారాగృహమునుండి పాఱిపోయిన దెందులకు.

మద:— రాజా! నేను పాఱిపోలేదు. నన్నెందులకు బంధించినది తెలియక భగవంతుని ధ్యానించుచు కాలము గడుపుచుంటిని. నీ కుమార్తె స్వయంవరకాలము నాటి రాత్రి చోరులు నన్నెత్తుకొనిపోయి కాళికి బలినొసంగబూనిరి. ఆ కరుణార్ద్రహృదయయగు నా కాత్యాయినీదేవికి నాపై జాలికలిగినది. కాబోలు. ఆ కతిను లందరిని కన్నులంటూఱి కొనదని చెప్పి నన్ను పాఱి

పొమ్మని నా చెవిదగ్గఱ తిన్నగా జెప్పెను. ఆ పరమ
పావని కృపవలన నా ప్రాణము దక్కించుకొంటిని.

రామ:— నా ప్రియసుత మెడలోని పుష్పమాలికను పడగొట్టిన
దెవ్వరు?

మద:— నేనే కొట్టితిని.

రామ:— నీ దగ్గఱ ధనుర్బాణములు లేవుగదా! ఎట్లా పనిని
నిర్వర్తించితివి,

మద:— జయపాలుడు ధనస్సులను బాణములను స్వయంవర
స్థలముకడకు దెచ్చుచుండ వానిని ప్రార్థించి యొకవిల్లును
బాణమును గొని నేనే కొట్టితిని. దుష్టుడగు నా పిన
తండ్రియైన లోభగుప్తుని మాటలన్నియు వింటిని. ఎట్లు
జరుగునో చూతమని యూరకుంటిని. తదుపరి నాతం
డింటికిపోవునపుడు నన్ను జూచి లోభగుప్తుడే చోరుల
చేత నీపనిని చేయించెనని నాకు దోచుచున్నది.

రామ:— తరువాత నేమిజరిగినది.

మద:— కొన్నిరోజు లచ్చటచ్చట నివసించుచు నిన్నటిదిన
మొదయమున నొక మార్గమున నడచుచుండ తస్కరులను
తటిమికొట్టిన తటాకముకడ నొక యినుపగొలుసును
వృక్షములకుగట్టి దాని కినిమిద మనుష్య శిరస్సులను కట్ట
బడియుండెను. నేనిచటతడవుచేసిన తప్పక ముప్పు
వాటిల్లునని యాదారి తప్పించి కొంతవరకు నడచి
యొక్కచో విశ్రమించి యుదయమున నేలేచి యీ
పట్టణముచేరితిని. ఆనాడుపోయిన గుఱ్ఱము మీ కెచట
లభించినదో మనోరమసంగతి యేమయ్యెనో లోభగుప్తుని
విషయమెట్లుండెనో యింతవరకు తెలియదు. ఇప్పుడీ
పట్టణమునకు నేనువచ్చిన దెందులకన అర్ధరాత్రిమున
దొంగతనముగా పారిపోయెనన యాబాల గోపాలమను
కొందురు గావున నిందబాపుకొనుటకై యిచటకువచ్చి
తిని. మఱియు లోభగుప్తునకు నీ కుమారి నీయకుండ
నెట్లు తప్పించుకొంటివో యడుగ తదుపరి చెప్పెదను

రమ్మని మదనమోహనుని తీసికొని యంతఃపురమున కరిగెను. సభలోనున్న ప్రజలెల్లరు స్వస్థానంబులకు జేరిరి.

తమపరి నాల్గురోజులకు పట్టణమంత నలంకరించి యొక శుభముహూర్తంబున నానావిధ మంగళవాద్యములు భూనభోంతరాళములునిండ పురోహితులు మంత్రంబులఁ జదువ పెద్ద లాశీర్వదింప ప్రజలెల్ల పరమానందంబు నొంద మదనమోహన విద్యుల్లతలకు వివాహముచేసి యేనుంగుపై వారి నెక్కించి రాజవీధిన నుత్సవముజేయుచుండ బాజారులందు జనులు క్రిక్కిరిసినట్లుండి వేడుకతో వధూవరులనుజూచి యెవరికిదోచినట్లు వారు పార్వతీపరమేశ్వరులలాగు రాధాకృష్ణుల పగిది, రతీమన్మథుల విధము, నలదమయంతులమాడ్కి, సుభద్రార్జునీయులభంగి రోహిణీచంద్రులవలె సీతారాముల రీతిగానుండిరని వేనోళ్ళ బొగడుచుండిరి. వీధులన్నియు తిరిగి రాజనగరికి వచ్చిరి.

ప్రొద్దుక్రుంకినది, అంధకారమంతటావరించినది పూర్ణచంద్రుడాకాశము నలంకరించెను, కాసారములకు ముదములు వికసించెను, చల్లనిపిల్లవాయువులు మెల్లమెల్లగా వీచుచుండెను శశికాంతమణులు కరగి చక్కగా ప్రవహించుచుండెను. పురములోని ప్రజలెల్లరు భోజనములుచేసి పాన్పులపైజేరి పుక్కిటపురాణములను పూర్తిగా జదువుచుండిరి అలరువిల్తుడు చిలుకరథమునెక్కి కామినీ కాముకులపై పుష్పశరములను ప్రయోగించుచుండెను. నిశ్శబ్దదేవత యచ్చటచ్చట జనులను నిక్కినిక్కిజూచుచుండెను నిద్రాంగనశిశువులకడజేరి జోకొట్టుచుండెను మదనాగ్ని చెలరేగి పురుషులు మగువల మంచములను సమీపించుచుండిరి నిదురబోయి నట్లభినయించుచు స్త్రీలు కదలక పరుండిరి క్షణములో నికవారి సుఖానంద సంతసము అను వర్ణించువారెవ్వరు ? నోటితోవచియించు వారెవ్వరు ? ఇట్టిదని లిఖియించువారెవ్వరు ? అంతులేని యానందాబ్ధిని యింతయని చెప్పుటకు వీలెట్లుకలుగును సంసారలంపటులందరు స్వానుభవమును స్మరణకు దెచ్చుకొని దానిలోని సౌఖ్యమిట్టి

దని మీమానసంబులమీరే దెలిసికొనుడు. అఖిల దంపతులు
మునింగి తేలు సంతోష సాగరమిదియేగా.

# 14

రాత్రి పదిరెండుగంటలకాలమైనది రాజాంతఃపురమున పడక
టింటియందు నాల్గువైపుల నాలుగు పెద్ద పెద్ద దీపములు
వెలుగుచుండెను. తద్దీపపుకాంతులలో చంద్రవరాతితో కట్ట
బడినగోడలు తళతళమని మెఱయుచుండెను ఆ గోడలకు నెటు
తిలకించినను కళాశాస్త్ర కోవిదులయిన చిత్రకారులు వ్రాసిన
పటములు కట్టబడియుండెను నానావిధసుగంధముల కమ్మని
తావి గుప్పుగుప్పున గదినిండ గ్రమ్ముకొనుచుండెను ఒకవైపు
బల్లపై దాడిమీద్రాక్షజంబీరనారింజ నారికేళరసాల కదళి
ఖర్జూరాది బహువిధ ఫలములు కన్నులు మిఱుమిట్లు గొల్పు
చుండెను మరియొక పీఠముపై గోక్షీరములును, ఆ మందిర
మధ్యభాగమున పట్టెమంచముపై పరుపునమర్చి పట్టుపీతాంబ
రములను పైనపరచి మల్లికాకుందవిరజాజి పున్నాగ పారిజాత
చంచకాది కుసుమంబులను జల్లియుండెను. దానిప్రక్కబల్లపై
జాతిఫలజాతిపత్రలవంగ కర్పూర సహితతాంబూలమును కనక
పళ్ళెరంబున బెట్టి అత్తరుపన్నీరగరుగంధము మొదలైన శరీరము
నకు నలందికొను పరిమళద్రవ్యములు కూర్చియుండెను. ఆ
పర్యంకముపై మదనమోహనుడు ప్రక్కవాటుగా పరుండి
యిట్లనుకొనెను.

ఆహా! నాయదృష్టమెంతని వర్ణింపదగును ఇక కొంచెము
కాలమునకు నాకోర్కెదీర విద్యుల్లతను గాగలించుకొని వివిధ
రీతులరతులందేలి వేడుకతో కాలము గడుప నుంటిని ఇప్పటికి
గదా సార్వభౌముని కుమారుడనైనందులకు సకల భోగము
ల ను భ విం ప గ లు గు ట ఎంతలో నెట్టి మార్పు గలిగినది
రాజకుమారుండనై జన్మించి, రజితకాంచనమణిమయరత్నఖచిత
సౌధములను విడచి ఆకలిజ్వాలలు గర్భము నుదహింప నల్లాడుచు
నహర్నిశలష్టకష్టంబులంబడుచు నరణ్యంబున సంచరించిన నేను

మారుతరహిత మశకమక్షికా సహితమార్తాండ కిరణ హీన దుర్గంధయుదాంధకార బంధుర క్రిమికీటక నివాసంబైన కారాగారంబున ఘోరదుఃఖమును బొందుచు కాలము గడపిన నేను తస్కరుల చేజిక్కి త్రిపురాపుత సంహారిణి వదన గహ్వారంబున బడ సంసిద్ధుడనై యొడలెల్ల గడగడలాడ భయభ్రాంతచిత్తుడనై తత్భవానీ కృపవలన బ్రతికి బయటబడిన నేను, చోరత్వమున శిశువునుజంపి హారముంగొని కారాగారమునబడిన క్రూరుడర్ధరాత్రమున పాఱిపోయెనను ప్రజల నిందలకు పాత్రుడనైన నేను, జనకుడు స్వర్గము చేరిననాడే నా సర్వభోగ భాగ్యములు క్షితిపాలై పోయెనని దలంచి యిక జీవించుటే నిరర్థకమని బ్రతుకుపై రోసి ప్రాణంబుల విడచు మార్గంబుగానక పరిపరివిధుల చింతించిన నేను, ఈనాడు విద్యుల్లతను వివాహమాడి యిట్టి సౌధమున బరుంటిని. ఆహా! దైవము దలంచిన క్షణములో ధరిద్రుని ధనవంతునిగను ధనవంతుని దరిద్రుని జేయును గదా?

ఇట్లనుకొనుచుండు నంతలో గుసగుసమాట్లాడు స్త్రీలవాక్యములు వినబడెను. విద్యుల్లతవచ్చుచున్నదనుకొన స్మరశరతాడనములకు నుల్లము జల్లుమన గుండెలు వేగముగా గొట్టుకొనసాగెను. విద్యుల్లతవచ్చి యేమిచేయునో చూతమని నేత్రయుగళమును మూసికొని నిద్రబోయినట్లభినయించుచుండెను. ద్వారముదగ్గఱ విద్యుల్లత తరుణీమణులను జూచి పడకటింటిలోనకు నేను పోనని పెంకెతనమును జూపుచు బిక్కమొగము పెట్టిన నందునొక వృద్ధస్త్రీ విద్యుల్లతతో అమ్మా! నా మాటలు వినుము నీకు భయమెందులకు నిన్ను ప్రేమించు ప్రాణేశ్వరుడు కాడా! పిచ్చిపిల్లా! తెలియ కిట్లనుచుంటివి. మేమందరమిట్లు మాట్లాడినవారమే. ఇప్పుడు కాంతుని పాన్పు జాసిఘడియుద్దైన నుందజాలము కాన నామాటను త్రోసివేయక మందిరములోన కరిగి నాథుని పాదములకు నమస్కారమొనర్చి ఫలములను పాలనొసంగి పాన్పునజేరి బహురీతుల సుఖముల నిచ్చి ప్రాణేశ్వరుని మనస్సు కరగునట్లుజేసి యాతని మన్నన

బొందుమని ప్రతిమాలుచుండెను. ద్వారశాఖలను గట్టిగ పట్టుకొని విద్యుల్లత కదలక నిలుచుండెను. ఈ మాటలన్నియు మదనమోహనుని వీనులకు వినబడుచునేయుండెను. అంత వారిలో నొక బలముగల స్త్రీ విద్యుల్లత చేతులను బలవంతముగా లాగి పడకటింటిలోనకు నెట్టి కవాటమును బంధించెను, అప్పుడు మదనమోహనుని మది యెట్లుండెనో విద్యుల్లత హృదయ మేరీతిగా నుండెనో యెవ్వరు చెప్పగలరు. అట్లు నా యువతీమణి లోనకరిగి ప్రాణేశ్వరుని పాదపద్మములకు ప్రణమిల్లి పర్యంకము ప్రక్కనున్న పీఠముపై సిగ్గున శిరము వంచి కూర్చొనియుండెను. మదనమోహనుడు నిదుర మేల్కాంచినట్లు శరీరము నిగిడ్చి యావలించి కన్నులందెరచి చూచెను. హృదయము తొందరించెను, దేహము పులకరించెను. మోహమతిశయించెను. మంచముపైలేచి కూర్చొనెను. విద్యుల్లత వదనమును వీక్షించెను. పైటచెరగును బట్టుకొని కొంచెము లాగెను. విద్యుల్లత విదలించుకొని కొంచెమాకడకు పీఠమును జరుపుకొని మొగ మటువైపునకు ద్రిప్పి చేతులను వదనమున కడ్డముగా జేర్చి కూర్చొనెను. అంత మదనమోహనుడు మందస్మిత వదనారవిందుడై యా మానినీమణి దక్షిణకరంబును బట్టుకొని పరిహాస పూర్వకముగా నికనీ బెట్టు చాలింపుమని నవ్వుచు పర్యంకముకడకు జేర్చుకొని ప్రక్కన కూర్చుండబెట్టుకొన పట్టు వదలించుకొని విద్యుల్లత లేచి తలుపుదగ్గఱకుపోయి యచట తరుణు లుండిరేమోనని కాబోలు తొంగిచూచి తిరిగి పీఠముకడకుబోవు చంచలాక్షిని మదనమోహనుడు మరల మంచముమీదకు లాగగా పర్యంకముపై విముఖురాలై పరుండెను.

అంత మదనమోహనుడు, ప్రేయసీ! ఇటు జూడుమని విద్యుల్లతపై చేయివైచెను ఆమె కొంచెము తత్తరపడుచున్నట్లాతనికిదోచెను భయమును విడచునట్లుగా మృదుమధుర వాక్యంబులతో ప్రాణేశ్వరీ! నాపైపుమరలుము నిన్నేమిచేయను ఒక చిన్నమాట నడిగెదనన, విద్యుల్లత నిజముగా నన్నేమి

చేయవాయనెను ఏమిచేయనని మదనమోహనుడు చెప్ప నాకురంగాక్షి భర్తకెదురుగా తిరిగి సిగ్గున శిరః వంచి చిరు నవ్వులొలుక జూచుచుండెను అంత నారాజనూనుడు గోరం టాకును బెట్టుకుంటివాయని యాసామజయాన కోమలాంగుళ్యా గ్రములను యొత్తిచూచెను. ఇది పుట్టుమచ్చయాయని పరికించు నెపంబున చెక్కిలిని గోటితో నొక్కను భూషణముల పరిశీలించుమిషచే స్తనములపై హస్తము నానించెను గుండె యిట్లేల కొట్టుకొనుచుండెనని యడుగు వంకచే పాలిండ్ల నదిమి పట్టెను జడలోని పూగుత్తులను సవరించుచు దేవీ ఇటు జూడుము నేనొక చిన్నమాట నడిగెద నిజము చెప్పవాయన నావిద్యుల్లత నాథా అట్లందువేల, నీకు చెప్పక నింకెవరికి చెప్పుదునన ప్రేయసీ! పడకటింటిలోనకు పోనని కవాటముదగ్గఱ కాంత లకు జెప్పించుంటివికదా ఇప్పుడెందులకు వచ్చితివి మరియు పెండ్లేలచేసికొంటివి ఇది మీ స్త్రీలకుండు చపలత్వమా పొమ్మ నుటతోడనే భర్తదగ్గఱకువచ్చిన నీమనసు మెత్తనిదని మగువలు పరిహాసింతురనియా పరిణయమైన వెనుక భర్తపాన్పున పరుండ వలయునని నీకు తెలియదా యని నవ్వుచు చెక్కిళ్ళు నిమురుచు ముంగురులను సవరించుచు ముఖమును ముఖము చెంతకుజేర్చి శిరమును పైకెత్తి నిజము చెప్పుమన శిరమునువంచి చిరునవ్వు నవ్వుచు నూరకుండెను. అంత మదనమోహనుడాసాధ్వీమణి భయము తొలంగునట్లు చనువిచ్చి మాట్లాడుచు చాళీతిబంధం బులచేనొప్పు చిత్రపటములను జూపుచు, సిగ్గుపడెదవేలయని చెక్కిలిపై తనచేతివ్రేళ్ళతో తిన్నగాకొట్టుచు చతురోక్తుల మధ్యమధ్య శరీరాలింగనముచేయుచు మన్మధనివాసస్థానము వివిధరీతులముట్టుచు, ప్రాణేశ్వరీ! నీకింతబిడియమేలనని యురము నురమున జేర్చుకొని గాఢప్రేమను జూపుచుగట్టిగ గాగలించుకొని గండపలకములపై ముద్దుపెట్టుకొన విద్యుల్లత మదనమోహనునిజూచి నన్నేమి చేయనంటిరి గదాయన, ప్రేయసీ! ఇప్పుడు నిన్నేమి బాధించితిని నీకు సౌఖ్యమును జేకూర్చుటకే సంసిద్ధుడనగుచుంటిని. తరుణిమణీ! నీకింకను

దానిలోని సుఖము తెలియదు తెలిసికొన్న తదుపరి
డిట్లనవు ప్రపంచములోని స్త్రీ పురుషులు దీనికొరకేయును
సాహసముల జ్ఞప్తికి దెచ్చుకొనుచు బంధుమిత్రులనువిడచి
పరువుమర్యాదల విచారింపక భోగభాగ్యములను వదలి కన్న
బిడ్డల విసర్జించి కష్టము లెన్నిటికైననోర్చి అర్ధరాత్రములలో
నతిధైర్యంబవలంబించి తాను మోహించిన పురుషుని దాపును
జేరు స్త్రీలచరిత్రల నెరుంగవా, అట్లే పురుషులుపోవుట యెసుం
గొనవా, కాబట్టి దీనిలోని యానందమెట్టిదో నీవే యోచించు
కొనుమనుచు విద్యుల్లతను వీక్షించి నాకు తాంబూలమీయవా
యన పర్యంకముపైనుండి లేచి యాలతాంగిపక్కరంబునయున్న
పచ్చకర్పూరాది ద్రవ్యములనుగూర్చి సున్నమును రాచి పోకల
నాకులందుజేర్చి యందింప నోటితోపట్టుకొని నమలి బాగుగ
పండినదాయని జిహ్వనుజాచి జూపించువానివలె విద్యుల్లత
యధరమున కానించెను, నవ్వుచు విద్యుల్లత దర్పణమును దెచ్చి
యిచ్చి చూచుకొమ్మన నారసికశిఖామణి మన యిరువురలో
నందముగానున్న దెవ్వరో చెప్పుమని కంఠమును గౌగలించుకొని
మోమును మోముకడకుజేర్చుకొని యద్దములో కనబడునట్లుముద్దు
పెట్టుకొనెను.

విద్యుల్లత ముసిముసి నవ్వులు నవ్వుచు నత్తరుపన్నీరు మొద
లగు యఖిల సుగంధవస్తువులను పైనజల్లి శరీరమునకు నలంది
విసనకఱ్ఱతో విసరుచుండ నా మదనమోహనుడు ప్రాణేశ్వరీ
నీవు నాకు బహుప్రయాసచే నుపచారములను జేసితివి. నీ శ్రమ
దీర విసరెదను నీ పైటచెరగు నీయుమనుచు పయ్యెదను క్రిందికి
లాగెను, బంగరు బంతులోయన నొప్పు పాలిండ్లు బయట
బడగా వాటిపై దృష్టిబరపు వరుని గాంచి నగుచు పైటను
మరల వేసుకొనుచుండ బాహుమూలములకడ భర్త గిలిగింతలు
బెట్టు పకపక నగుచు విద్యుల్లత పర్యంకముపై ప్రక్కవాటుగా
పరుండ నెదురుగా మదనమోహనుడు పరుండి లాలాటిక నిరూ
పణాఖ్యంబను నాలింగనముజేసి ముంగురులను చేతదువ్వి నొస
లును కన్నులను చుంబించి అధరమాని చెక్కిలి ముద్దాడి

చంకలయందు నఖక్షతములుంచి సక్షోజములనుబట్టి
చేత రొమ్ము లంఘించి, పొక్కిలినితట్టి మడిమబొటన
వ్రేలు ఆరకాలనుమట్టి విద్యుల్లతను మరులుకొల్ప నామె
భర్తనుజూచి నాకు సిగ్గగుచున్నదన మదనమోహనుడు మంద
హాసముతోడ పిచ్చిదానా! సిగ్గ చిన్నవాడేపోలేదా మిగిలిన
దీ మంచముపై చేరినవెంటనే నిన్ను వదలలేదా. అట్లయిన
నీవు కన్నులను మూసికొనమని చెప్పెను. అప్పటికి రాత్రి
మూడుగంటల కాలమైనది. రేయెండ పిండియారబోసినట్లు
కాయుచుండెను. చల్లని గంధవహుడు మెల్లమెల్లగా నడుగు
లిడుచు వచ్చి పడకటింటి నాల్గుమూలలను పరీక్షించుచుండెను.
అంత మదనమోహను డారోజు బహుళపాడ్యమిగా నెరింగి
ఆ కాంతామణి కంఠమును గౌగలింపుచు శిరంబును చుంబించి
దంతాగ్రములచే నోష్ఠముల పీడింపుచు, పార్శ్వములయం
దును, వెనుకభాగమునను, బులకలు జనించునట్లు ముట్టుచు,
గండఫలకముల నుద్దిదుకొని నితంబములపైన మెల్లగా గోరు
గీతలను గీయుచు, మందసీత్కారముతో విద్యుల్లత చిత్తమును
రంజింపజేసి, ఫాలమును గండస్థలమును, నాశికాగ్రమును
తాలువులును, నాలుకను, సీత్కారముతో చుంబించుచు, నాభి
మూలమునందును, గబ్బిగుబ్బలందును, ఊరుద్వయమందును,
ఘురితమను నఖక్షత విశేషమును నెరపుచు, తెలుచు స్త్రీలకంటె
ముందు పురుషులు భావావసానమును బొందుదురుగావున దేశ
కాల ప్రకృతి లక్షణములను గ్రహించి, స్పృష్టక, విద్ధక, లతా
పరివేష్టిత, వృక్షనిరూఢ, తిలతండుల, క్షీరనీరాది ద్వాదశవిధా
లింగనములచేతను, నమిత, స్ఫురిత, ఘటిత, భ్రాంత, పీడిత,
విఘటితాఖ్యాది పంచదశ చుంబనంబులచేతను, మూర్ధకో
చ్ఛూన, బిందుక, బిందుమాలిక, కోలచర్చిత, ఖండాభ్రక,
చురిత, మండలక, మయూరాది త్రయోదశ దంత నఖక్షత
ములచేత నొప్పారు బాహ్యరతులచే మదన మోహనుడు
విద్యుల్లతను ముందు విహ్వలభావమును బొందచేసి, గిరిగహ్వర
తటినీప్రహారదారణ్యాంబరాదిక దుఃఖంబులను తన మనంబున

నిల్చి త్వరపడక పంకజాసన బంధంబున ప్రథమ సురతంబును జేయుచుండ నా భామామణి పావురపు పల్కులంపల్కుచు చిత్రవాక్యములచే తిట్టుచు, కొసరికొసరి మాటలాడుచు మనస్సు బిగబట్టి యుచ్ఛ్వాసనిశ్వాసము లధికముగాగ దేహ స్మరణతప్పి నేత్రములంమూయుచు పరవశత్వము నొందెను. మదనమోహన విద్యుల్లతల వేగంబు సమంబైన సమరతలంబున వారిరువురి శరీరములు స్వేదబిందు పూరితమై సుఖార్ణోరాశిలో క్రుంకిరి. చెరియొక ప్రక్కన పరుండిరి. వా రిద్దరు నొకరి నొకరు జూచుకొనుటకు సిగ్గు జనించెను. కొంచెము కాల మట్లే చలనరహితులై మారు మొగంబులతోడ బరుండియుండ కొక్కొరోకో యని కోడికూసెను. వారిగుండెలు గుభుల్ల నెను. అప్పుడే తెల్లవారవచ్చినదాయని యాశ్చర్యపడిరి. తూర్పుదెస తెల్లబడెను. తుహినాంశుని ప్రకాశము తగ్గిపోవు చుండెను. పట్టణములోని ప్రజలు భవనంబుల దీపములు వెలి గించి పనులుచేయుటకు ప్రారంభించిరి. వీధిగుమ్మములలో కసవునూడ్చు ధ్వనులు వీనులంబడుచుండెను. గూండ్లనుండి వెడలి కూయు పక్షులధ్వని గంద్రగోళముగా నుండెను. దాసీ జనములు తలుపుకడకు వచ్చుచున్నట్లు కాళ్ళచప్పుడు విన వచ్చెను.

మదనమోహన విద్యుల్లతలు దిగ్గునలేచి మంచముపై కూర్చుండిరి మదనమోహనుడు విద్యుల్లతను కౌగలించుకొని మృదుల కపోలములను ముద్దుపెట్టుకొనుచు మోవియానుచు ముంగురులనెగదువ్వుచు వేణిలోని సూనములతావి నాఘ్రా ణించుచు ప్రేయసీ! ఈ దినము త్వరగా తెల్లవారినట్లున్నదన నావు నట్లే యున్నదని విద్యుల్లత నవ్వుచుండ నింతలో తలుపు తట్టినధ్వని వినబడగా త్వరగాలేచి విద్యుల్లత నేను పోయెదనని నాధునిపాదములకు ప్రణమిల్లి నిలుచుండ మదనమోహనుడులేచి గాఢముగా కౌగలించుకొని మరిమరిముద్దాడి యిక పొమ్మన నాతరుణీమణి తలుపును దెరచుకొని చెలికత్తెలంజేరి తలవంచు కొని మెల్లమెల్లగా నడచుచుండ విద్యుల్లత యవయవములను

పరీక్షించి నెచ్చెలులు, వారిలోవారు మందస్మిత వదనార విందులైనవ్వుటాలకు విద్యుల్లత నేత్రము లీనాడేల్లిగానున్న వెందులకోనని యొకచెలియన, నిద్రపోలేదేమోనని యొక స్త్రీ చిరునవ్వునవ్వెను మరియొకలతాంగి, బింబాధరముగంటువడి యున్నదేలకోయన చిలుకను గూర్చాడెనేమోయని యొక చిగురు బోడియనెను. నున్నని చెక్కిలినొక్కులెందుకు గలిగెనని యొక నెలంతయడుగ కేతకినిగోసెనేమోయని యొక నాతి నవ్వెను వెంట్రుకలు చిక్కుపడియున్న వేయని యొక వెలదియన పుష్పములు చెదరి కాబోలునని యొకపూబోడిచెప్పెను ఇట్లు వారనేకవిధంబుల చతురోక్తుల నాడుచుండ విద్యుల్లత సిగ్గున శిరమువంచి చాలులే మీ మాటలు పరులువిన్న పరిహసింతురని పకపకనగుచు నా తరుణీమణులంగూడి తల్లియగు రత్నావళిని జేరంబోయెను. భానోదయమగుచుండెను పర్వతశిఖరములను భూరుహాగ్రభాగములను.

సౌధగోపురాగ్రములను, ప్రాగ్దిశ నీలాకాశమును తాకు టకు ప్రయత్నించుచున్నట్లు సూర్యుడు తనచేతులను జాచు చుండెను. మిత్రుని రాకచే మితిలేని యుత్సాహమున సరో వరముల ముడుచుకొనియున్న శతపత్రములు జలములజాడ జీవు లకు గానిపింపకుండ గ్రమ్ముకొనునట్లు విప్పారుచుండెను. తామర పత్రములపై నీటిబిందువులు తళతళమని ముత్యములవలె మెరయుచుండెను. భీకరారణ్యముల పెద్ద నదుల జలములం దిగి మత్తగజంబులు తామరతూండ్లను కదలింప నందుండి ఝుం కార ధ్వనితో చెలరేగిన భ్రమరములు కరికరరంధ్రంబులం జొచ్చి పెట్టు బాధలకు భరింపజాలక తొండమును గిరగిరత్రిప్పు కొనుచు ఘీంకారధ్వనిజేయుచు తిరిగి యొడ్డునకు బరువెత్తు వేనుంగులజూచి చావుమూడెనని జిహ్వలజాచి రొప్పుచు వేగగమనంబునవచ్చి పొదలలోదూరువ్యాఘ్రంబులగని యచట పరుండి దిగ్గునలేచి ప్రాణాయంబుగలైనని భయంబుదోప చెంగు చెంగున దుముకు దుప్పులకాలిగిట్టలు తోకలపైబడ పవన ను భక్షించుచు శిరముల నెత్తికొనియున్న నాగుబాములు ఫణములను

ముడిచి భూమిపైకెగిరి దుప్పులు చప్పరించి మ్రింగుచున్న వెఱ
పున ప్రాణముల రక్షించుకొన బురదగుంటలలోని కర్కాటక
రంధ్రంబుల జొచ్చు విషధరముల నీక్షించి దరినున్న మండూక
ములు మృత్యువును దప్పించుకొన బురదనీటిలో దబదబమను
శబ్దములంబుట్ట నెగిరిపడు వానినిగాంచి దుర్వ్యాసన జలముల
మూగియున్న మక్షికములు మొయ్యిమనుధ్వనితో మహారణ్యాము
లందంతట ముసురుకొనుచుండెను. మదనమోహనుడు పర్యం
కముపైనుండి లేచి బయటకువచ్చి మరియొక భవనంబునకుం
జేరెను. అందరును దంతధావన స్నానభోజనాది కృత్యము
లను దీర్చుకొని హాయిగా విశ్రమించిరి. కాని మదనమోహన
విద్యుల్లతిలకు మాత్రము మార్తాండు డానాడు మరింతకాలము
ప్రయాణమొనర్చుచున్నట్లు మతులకుదోచి, అస్తమానమెప్పు
డగునాయని పగటికాలమును దలంచుకొనిన విసుగు జనించు
చుండెను. ప్రాణులను రక్షించు ప్రత్యక్ష భగవంతుడని ప్రజ
లెల్లరు వేనోళ్ళ బొగడుచుండ నూతన దంపతులుమాత్రము పడ
మటి సముద్రములోనబడి చావరాదాయని దినకరుని తిట్టుచు
పాన్పులపై పొర్లాడుచుండిరి. క్రొత్త మిధునముపై కరుణ
గలిగినదేమో కాని కొంతసేపటికి ప్రభాకరుడు పశ్చిమవారాశి
లోనబడి మునింగెను. శత్రువు జచ్చెనని సంతసమున దాగు
కొనియున్న తమోదేవత ధరణీచక్రము నాక్రమించుకొనుటకు
దారసిల్లెను. అఖిలస్థలముల నాక్రమించుకొనుట కామెకు
సాధ్యమగునా గర్వింపకుమని చంద్రుడు గగనమార్గంబున
గాన్పించెను. అశ్విన్యాది నక్షత్రము లాత్మేశ్వరుని వెంటనే
నడచుచుండెను. తెల్లని వెన్నెల తరులతాది పుష్పముల
ప్రకాశమునకు మరింత శోభ గలుగజేయుచుండెను. రాత్రి
పదిగంటలైనది. రమణీయ సౌధమగు కేళికాగృహమున
విద్యుల్లత మదనమోహనులు పర్యంకమున బవ్వళించి సరస
సల్లాపముల నాడుకొనుచు సంతోష హృదయారవిందులై
జరిగిపోయిన స్వచరిత్రల నొకరినొకరు చెప్పుకొనుచు నప్పు
డపుడు కౌగలించుకొని యానందరసమునుగ్రోలుచు గళరములు

చెలరేగగా గండభాగముల చుంబించుచు చిత్రవాక్యములచే శృంగారచేష్టలతో కొంతకాలమూ జరిపి పుష్పశర ప్రయోగ ములకు దేహములు పులకరించి తనువు లుప్పొంగనంత మదన మోహను డానాడు విదియ యగు టెరింగి గుబ్బలనుబట్టి మోవి చవిగ్రోలి చెక్కుటద్దములను విశాలాక్షులను ముద్దాడి గాఢా లింగనముజేసి కక్షములను, ఉదరమునను గోళ్ళుంచి, హర్షా బ్ధిని తరచి యానందా మృతమును గ్రోలునట్లుగా సురతంబును దేల్చ, చంద్రకిరణంబులు సోకిన చంద్రకాంతమణివలె నామె మనస్సుకరిగి నీ ప్రేమబంధంబుల పట్టుబడి నీకు నేవశమైతిని నీ యిచ్చవచ్చినట్లు జేయుమని సర్వాంగము లొప్పగించినట్లు చలనరహితరై పరవశత్వమునొంది పరుండెను. తదుపరి కొంత సేపటికి వా రిరువురులేచి ఆ యింటిప్రక్కనున్న పూలతోట కుంజని పరిమళమిళితమైన చల్లగాలి నాఘ్రూణించుచు శరీరముల నిండియున్న ఘర్మవారి నార్చుకొనుచు పండువెన్నెలయందు పూపొదరిండ్లను చంద్రకాంతపు రాలప్రవాహంబులను కాసారముల వికసించియున్న కలువలను మధురచంద్రికలను మెక్కు చకోరబృందములను సతీపతుల వియోగమున బాసి సంతసమున సంచరించు చక్రవాకములను జూచుచు, నొకరితో నొకరు ప్రకృతి చిత్రములగురించి ప్రశ్నోత్తరములను జరుపుచు సరససల్లాపముల నాడుకొనుచు నిష్టరీతుల పుష్పశయ్యల మరు కేళిందేలుచు రేయంతయు నొక త్రుటికాలముగా గడపుకొనిరి. ఇట్లువారు పగలురేయనక పరమహర్షంబున నొక పక్షము దినములవరకు బహువిధభవనములలో పరుండుచు. నుద్యాన వనములలో నిష్టరీతుల దిరుగుచు, నిసుకతిన్నెలపై విహరిం చుచు, పూపొదరిండ్లలో, పొద్దుబుచ్చుకొనుచు, సరోవర ప్రాంతములలో స్వేచ్ఛగా చతురోక్తుల నాడుకొనుచు మరుకేళిం దేల మనస్సు గలిగినప్పుడు మదనమోహనుడు హంసతూలికా తల్పములపై, పుష్పశయ్యలమీద సైకతస్థలములను పూపొద రిండ్లయందును, స్తంభకుడ్య శిలాదుల సమీపమున అరకాలు మడిమ, మోకాలిచిప్ప జఘనము, నాభి, ఉరము, స్తనములు,

చంకలు, కంఠము, గండపలకములు, అధరము, రెప్పలు, ఫాలము మస్తకము మొదలైన యంగముల వివిధరీతుల ముట్టుచు ఉత్తానకరణంబులగు.

గ్రామ్య, నాగరిక, ఫుల్లక, విజృంబిత, ఇంద్రాణిక, ఇంద్రక, పార్శ్వసంఘటిత, ఉత్తమసంఘటిత, పీడిత, వేష్టిత, బాడబ, యుద్భుగ్న ఉరస్ఫుట, అర్ధాంగనిపీడిత, జృంభిత, వేణు విదారిత, ప్రాసారిత, శూలచిత, కార్కటక, ప్రేంఖాయిత, పంకజాసన, అర్ధపద్మాసన, బంధురిత, నాగపాశ, సంయమన, కూర్మ, పరివర్తిత, విపరీత, సమపాద, త్రివిక్రమ, వ్యోమపద, స్మరచక్ర, అవిదారిత, సౌమ్య, నౌకా, చాప, కరపాద, సాచీముఖ, అర్ధచంద్ర, ఉపాంగాది, నారీరత్నము పర్యంకముపై వెలికల బరుండియున్నపుడు పట్టుబంధంబులచేతను తిర్యక్కరణంబులగు, సముద్గక, పరివర్తన, సమాంగక, అభిత్రిక, నాగ, సంపుటిత, వేణువిదారణ కుక్కుటమానితాదులైన పువ్వుబోడి ప్రక్కవాటుగా నెడమపార్శ్వంబుగానైన, కుడిపార్శ్వంబు గానైన బవ్వళించియుండ పురుషుండభిముఖంబుగా పరుండి పట్టుబంధంబులచేతను, స్థితకరణంబులగు, యుగపాద, వితర్ధిత, ఘట్టిత, మార్కట, సమ్ముఖీ, ప్రస్ఫుట, ఉద్గ్రీవ, జఘనాదులగు అంగనామణి కూర్చున్నపుడు పురుషుడుపైకొని పట్టుబంధంబులచేతను, ఉద్ధితకరణంబులగు, జానుకూర్పర, సింహావిక్రమ, ద్వితల, కీర్తి, పార్శ్వవేష్టిత, ధృతాదులగు మగువ నిలుచున్నప్పుడు స్తంభకుడ్యశిలాదులూనికగా నుంచి పురుషుడు పట్టు బంధంబులచేతను, వ్యానకరణంబులగు, నివీటిత, నిఘాతుక, చటకవిలసిత, జాప్య, వరాహఘాతక, వృషాభిఘాత ధేనుక, గజ, మార్జాల, హరిణ, చాటుకాదులగు కోమలాంగి పాదంబులు కరంబులు పానుపుననాని తిర్యగ్జంతువులరీతి వ్రాలి యున్నపుడు, పురుషుండు వెనుకభాగంబున నిలచి పట్టుబంధం బులచేతను, జాతి, క్రియ, గుణము, హృదయము నెరింగి, సమరతులదేలి. ఒకానొక సమయంబున మదనమోహానుడు రతివిశ్రాంతుడై బవ్వళింప విద్యుల్లత ప్రేమాతిశయంబున తనివి

దీరక భర్తను పైకొని విపరీతకరణంబులను, పురుషాయిత, భ్రామర, ఉత్కలిత, ప్రేంఖావతాది బంధములచేత నాలతాంగి రతంబుసలుప నావధూవరు గాఢానురాగులై కొనింతకాలమైన నొకరినొకరు నెడబాయక రోహిణీచంద్రులవలె ప్రకాశించుచు, రోజులు గడపుచుండిరి. మదనమోహనుని కామ మను తరువు నను విద్యుల్లత మోహమను లత యల్లిబిల్లిగానల్లుకొని వాంఛాను రాగములను సూనములు వికసించి పరమహర్షమను ఫలములు ఫలింపవానిలోని యానందమను రసమును వారిరువురు గ్రోలు చుండిరి. అట్టి ఫలరసమును ద్రావనఖిల జనులకు లభించునా. ప్రపంచములోని సతీపతులకందరి కట్టివి సమకూరిన సుఖసాగర మున జలమంతయు హర్షజీమూతములుగ్రోలి ఆనందవర్షమన్ని ప్రాణులపై వర్షింపకుండునా ప్రేమప్రవాహము ప్రకృతి నంతయు ముంచివేయకుండునా పరమానందవారాశినిండి రంగ దుత్తుంగతరంగమాలికా సహస్రములచే మనుష్యరత్నములను మెఱపింపకుండునా అట్టి రత్నాకరమున దుమికి నప్పుడుకదా ఇహలోకతనువులు ధన్యతనొందుట, సర్వసౌఖ్యములనుభ వించుట, అదృష్టవంతులమని గర్వించుట, అప్పుడుగదా, ప్రణయాంబరజని తానురాగానిలము మనపైవీచిన విరహోష్ణభవ స్వేదబిందువులారి సుఖజీవనములు గడపుట, సంతతానంద వార్ధినితఱచి, పరమానందామృతమును గ్రోలుట, అట్టిది చేకూర్చుట కనుదినము పరమేశ్వరుని పాదపద్మములకు భక్తితో ప్రణమిల్లుడు, భక్తులవాంఛలను భగవంతుడు తప్పక తీర్చును.

# 15

మణిపురరాజనగరున నొక సౌధములో రామసింహుడును రత్నావళియు, మదనమోహనుడును విద్యుల్లతయు, మరి కొందరు దాసీజనంబులును, కూర్చొని లోకాభిరామాయణ మును జెప్పుకొనుచుండగా శీఘ్రగమనమున నచటికి జయపాలు డరుదెంచి రా మ సిం హు న కు నమస్కారమొనర్చి రాజా ! ఆనాడుద్యానవనమున మీకు భవిష్యత్తును జెప్పిన బ్రహ్మచారి

కోట కవాటముచెంత కూర్చుండి తమకు తెలియజేయుమని
నన్ను పంపెననగా పరమానందభరితుడై రామసింహుడు,
జయపాలా! ఆ మహాత్ముని త్వరగా నిచటకు ప్రవేశపెట్టుమని
చెప్పెను, క్షణములో బ్రహ్మచారి సౌధమున నడుగుబెట్టెను.
బ్రహ్మచారిని గాంచుటతోడనే పీఠములపై నుండి దిగ్గునలేచి
రామసింహుడాదిగాగలవారు దండప్రణామంబు లాచరింప
విద్యుల్లత కనకకలశంబున శుద్ధోదకమునుదెచ్చి బ్రహ్మచారి
పాదముల గడిగి భక్తితో ప్రణమిల్లి నిలుచుండ నాకాషాయాం
బరధారి యొక పీఠముపై కూర్చుండెను. వారందరు వినయ
విధేయులై కూర్చుండి యుండ రామసింహుడు, భక్తివినయములు
ప్రజ్వరిల్ల బ్రహ్మచారినిజూచి, మహాత్మా! ఆనాడు మీరు
చెప్పినదంతయు సత్యమే యయినది. తదుపరి కొన్ని రోజులకు
నీ మదనమోహనుడు రాగా వెంటనే నా ప్రియసుతయగు
విద్యుల్లతనిచ్చి పరిణయముచేసితిని. మీ యాశీర్వచన ఫలముచే
నఖిలసౌఖ్యములు చేకూరినవి లోభగుప్తుడు కూడ మృత్యు
ముఖంబునబడెననగా నా బ్రహ్మచారి, రాజా! విద్యుల్లతను
చోరులెత్తుకొనిపోవుటయు, లోభుడు పొంద గోరుటయు,
ఆ దుష్టునియొక్కయు, సైన్యాధిపతియొక్కయు, భటుల
యొక్కయు, మస్తకములు ధారుణీస్థలినిబడుటయు, విద్యుల్లత
యశ్వమునెక్కి యింటికి వచ్చుటయు, నేను దివ్యదృష్టిచే
నప్పుడే తెలిసికొంటినన నందరాశ్చర్యమానసులై,
మహానుభావా! మీకు తెలియరాని యంశముగలదే యని మరి
మరి బొగడుచుండ నా బ్రహ్మచారి చిరునవ్వులొలుకు తల
నూపుచు కూర్చుండెను. అంత రామసింహుడు, మహాత్మా!
ఆ పాపుల శిరములెట్లు భూమిపై బడెనన భవానీకృపవలననే
నని బ్రహ్మచారిచెప్పెను తదుపరి కొంతసేపటికి రామసింహుడు
మహాత్మా! నా కన్ని విషయములందు సంతోషము కలుగు
చున్నది కాని నాకుమారుడగు విద్యుద్దీపుని దలంచుకొన కడుపు
పగిలిపోవుచుండెను. కాన నా మీద మీ సంపూర్ణానుగ్రహ
ముంచి నాసుతునిజాడదెల్పి నన్ను దయజూడవేయని ప్రార్థింప

నా బ్రహ్మచారి రామసింహునితో రాజోత్తమా! నే నిప్పు డందులకే నిచటకు జనుదెంచితిని మీ కుమారుడు దినదిన ప్రవర్ధమానుడై యొక్కొ వృద్ధ శ్రీచెంత పెరుగుచున్నాడు. ఆ బాలుడచటకు చేరుటకు కారణము తరువాత చెప్పెద నిప్పుడు మీ యల్లుడగు మదనమోహానుని నా వెంట పంపినట్లైన మేమిరు వురము పోయి విద్యుద్దీపుని సురక్షితముగా నిచటకు తీసికొని రాగలమనగా బ్రహ్మచారి పాదములకు వారందరు ప్రణమిల్లి మీ కరుణారసమూమాపై జిలుకు నంతవరకు మాకు కొఱతే మున్నదనుచు రామసింహుడు సేవకుని బిలిచి యేమియో చెప్పి పంపెను. అంత బ్రహ్మచారియు మదనమోహానుడును ఫలాహారమును భుజించి ప్రయాణమునకు సిద్ధముగానుండిరి. శరవేగంబుననడచు నాల్గుతురంగంబులగట్టిన యరదము వీధిలో నకువచ్చి నిలంవబడెను. బ్రహ్మచారియు, మదనమోహానుడును రథముపై నెక్కి సారధి నగలపై జేరి సంజ్ఞచేయగా వాయువేగం బున వాజినములు నడచుచుండెను. ఇట్లు కొంతసేపటికి అశ్వద్ధ యశోక, రసాల, కరక, కదళి, కర్జూర, శమీర, మలయజ, మాతు లుంగ్గక నారదనారికేళాదివృక్షములు క్రిక్కిరిసినట్లుండి, ఉంద్ర, చంద్ర, పరిగెపక్కెపలు మెరుపులుగుడుమోదు గొరుగచ్చ కొరింద గేదంగి గురివెందకసుమాది పొదలచేనిండి, సింహాశరభ శార్దూలశాఖామృగ శల్యశశసూకర స్రృగాలకాసరగవయ, వృకభల్లుకహరిణమృగాదనాది మృగములచే గూడుకొని పారావత, నారదభరద్వాజ కపోతకాకోల బర్హిణ కాకఘూక గృద్ధాది విహంగ బృందములచే నొప్పారు ఘోరారణ్యమును చేరెను.

ఆ భీకరారణ్యమున నెటు తిలకించినను సింహగర్జనంబు లును, శార్దూలముల గాండ్రింపులు, శరభమృగముల యరవులు, మదపుటేనుగుల ఘీంకారములు, గార్ధభముల యోండ్రగింపులు, కపిబృందము కిచకిచలు, సైంధవముల సకిలింపులు, పెద్దపక్షుల భయంకరశబ్దములే వినబడుచుండెను. ఆహారముకొఱకు నరణ్య మంతయు సంచరించి యత్యలసటబొంది దప్పిదీర్చుకొన త్వర

త్వరగా నీటిలోపలకు బరువెత్తుచు వేటగాండ్రు పాతిపెట్టిన వాడికత్తులపైబడిన రక్తంబుగార గృచ్చుకొని దేహము జీల్చ బడిన వ్యాఘ్రములరోదన శబ్దములకు తత్తరపడి యందున్న జలపక్షులు రెపరెపమని రెక్కలుం గొట్టుకొనుచు లేచుచుండ సెలయేటి కెంబుల నీరు కల్లోలపడుచుండు ధ్వనులచ్చటచ్చట వినబడుచుండెను. రధగమనమున రేగినదుమ్మరణ్యమంతయు గ్రమ్ముకొనుచుండెను. ఇట్లు పోవుచు బ్రహ్మచారింగని మదన మోహనుడు మహాత్మా! నిన్నొకమాట యడుగుగదలంచితి నడుగమందువా యన రాజకుమారా! నన్నడుగుటకు మీకు సందేహమేల నీ వడిగిన దానికి సమాధానమిచ్చుటకు సంసిద్ధ ముగ నున్నానన మదనమోహనుడు మహానుభావా! చంద్ర వర్ధనమహారాజు కూతురగు మనోరమ యంతఃపురమునుండి తప్పించుకొని వెళ్లినదట ఆమె యిప్పుడు సురక్షితముగానున్నదా యని ప్రశ్నింప నా బ్రహ్మచారి కన్నులను మూసికొని కొంత వరకు మౌనము వహించియుండి తదుపరి మదనమోహనునివైపు జూచి క్షత్రియసూనుడా! మనోరమ క్షేమముగానేయున్నది. నీకొరకనేకశ్రమ లనుభవించుచు నిన్ను వెదకుచు తిరుగుచున్నది కొద్దికాలములోనే నిన్ను కలసికొనగలవు. కాని ఆమెను నీవు ప్రేమించెదవాయనెను. అందులకు మదనమోహనుడు మందహాసముచే మహాత్మా! మనోరమ నాదగ్గఱకుచేరిన భాగ్య లక్ష్మి నన్ను వరించినట్లే యనుకొందుననగా బ్రహ్మచారి చిరు నవ్వు నవ్వెను.

ఇట్లు వారింకేమేమియో మాట్లాడుకొనుచు నస్తమానమగు వరకు నవ్వగారింటికి చేరిరి. అరదముదిగుటతోడనే యవ్వగా రెదురుగావచ్చి బ్రహ్మచారి పాదకమలములకు భక్తితో ప్రణ మిల్లి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యింటిలోపలకు దోడ్కొనిపోయి కొంతవరకేదియో మాట్లాడి యాయవ్వ బ్రహ్మచారింగని మహాత్మా! ఈ యువకు డెవ్వరనియడుగ నా కాషాయాంబరధారి యిట్లు చెప్పదొడంగెను.

అవ్వా! ఈత డుదయపురాధీశ్వరుండగు ధర్మపాల సార్వ

భోషుని ప్రియతనూజుడు మదనమోహనుడు. ఈ సుందరా
కారుడు మణిపురాధీశ్వరుండగు రామసింహ మహారాజనకల్లుడు.
మీ యింటనుండి నీచే సంరక్షింపబడు బాలుడు రామసింహుని
కుమారుడగు విద్యుద్దీపుడు. ఈ బాలుని చోరులెత్తుకొనివచ్చి
భల్లూక ప్రమాదవశమున నా గుట్టలనడుమ పారవేసిపోయిరి.
ఇప్పుడు నా వలన దెలిసికొని రామసింహుడీ మదనమోహనుని
నావెంట బంపెననగా నా యవ్వ పరమానందభరితురాలై నవ
మన్మథాకారుడైన యీ బాలునెత్తుకొని ముద్దిడుచు, మహాత్మా!
ఈ చిట్టినాన్నను చోరులెందుకు తీసుకొనివచ్చిరనగా నవ్వా!
అది యంతయు రేపు సాయంత్రమునకు నీకు చక్కగా తెలియ
గలదు. రేపుదయమగువరకు కొన్ని చిత్రములను నీ విచటనే
చూడగలవనగా నా యవ్వ నా బాలునచట కూర్చుండబెట్టి
వంటగదిలోనికరిగెను, మదనమోహనుడా బాలునెత్తుకొని
ముద్దాడి వాని రూపురేఖావిలాసాదుల కచ్చెరువందుచు
సంతోష హృదయారవిందుడయ్యెను. అప్పటికి రాత్రి
తొమ్మిదిగంటలైనది. అంత మదనమోహనుడును బ్రహ్మచా
రియు స్నానమొనర్చి భోజనముచేసిరి. తదుపరి యవ్వగారు
సారధినింబిలిచి భోజనముపెట్టి తానుకూడ భుజించెను. బ్రహ్మ
చారి యవ్వనుజూచి అవ్వా! నేనును మదనమోహనుడు
నొక మంచముపై పరుండెదము.

కాన నీ పర్యంకమును మనవెనుక దొడ్డిలో వేయుమని చెప్ప
మంచిదనుచు నా యవ్వ వారిద్దరికి నింటి వెనుక భాగమున
దొడ్డిలో పాన్పునమర్చి యింటిముందు గుమ్మముకడ నామె
మంచము వేసికొని బాలుని పరుండబెట్టుకొని పన్నుండెను.
సారధియశ్వముల కప్పుడప్పుడు మేతవేయుచు రథముపై
బరుండెను అవ్వగారు గుండెపై చేయినిడుకొని హాయిగా
నిదురించెను అంత మదనమోహనుడు బ్రహ్మచారియు పాన్పుపై
చేరిరి. అచటొక చిన్నదీపము వెలుగుచుండెను. చల్లనిపిల్ల
వాయువులు మెల్లగా నేతెంచుచుండెను కరదీపికలంబోలి గగన
మున తారలు గాన్పించుచుండెను అట్టిసమయమున వారిక్రింది

రీతిగా సంభాషణ జరిగెను.

బ్ర:— రాజకుమారా! మనోరమ, నీకు గాన్పించిన నామ త్రైభ యానను నీవు నిజముగ ప్రేమించెదవా.

మ:— మహాత్మా! నీకడ దాచనేల మనోరమను జూచు భాగ్యంబుగలిగిన నా పంచప్రాణము లామె కర్పింతును,

బ్ర:— మదనమోహనా! విద్యుల్లతను పరిణయమాడితివిగదా. మనోరమ నెట్లు పరిగ్రహింతువు.

మ:— మహానుభావా! ఇరువురను ప్రేమింతును. ఇదివరకే మనోరమనుగూర్చి విద్యుల్లతతో ముచ్చటించితిని విద్యుల్లతకుకూడ మనోరమను జూడవలెనని మనస్సుగలిగి యున్నది.

బ్ర:— అట్లయిన నిక కొద్దికాలములోనే నామె గాంధర్వ వివాహంబున నిన్ను కలిసికొనగలదు.

మ:— మహాత్మా! నీ కరుణ నాపై యుండిన నాకు కొఱతేమి యుండును. అని యనుచుండగా బ్రహ్మచారి నిదుర పట్టించినట్లు మదనమోహానునకుదోచెను. మదనమోహా నుడుకూడ కన్నులుమూసికొనెను గాని మనోరమను మనస్సునందు దలంచుకొనుటచే నిద్దురపట్టలేదు కొంత సేపటికి నెదురుగా తిరిగి బ్రహ్మచారి మదనమోహానుని వక్షమునకు తనయురము నానించి శరీరముపై చేయివైచి కౌగలించుకొనెను బ్రహ్మచారి సుషుప్త్యావస్థను జెందు చున్నట్లుగానే యుండెను,

ఎప్పుడైతే బ్రహహ్మచారి యురము నానించెనో గజనిమ్మ పండ్లంబోలి బిగువుగలిగిన కుచద్వయము మదనమోహానుని విశాలవక్షమునకు కఠినముగా తగిలెను. మదనమోహానుడు కొంచె ు వెనుకకుజరిగి బ్రహ్మచారి వక్షమున చేయిపెట్టిచూచెను చక్రవాకలంబోలిన స్తనయుగము చేతికితగిలెను ఇదేమిచిత్రమని మదనమోహానుడు కాషాయవస్త్రమును తొలగించిజూడ బంగరు బంతులట్లు పాలిండ్లు బాగుగాగన్పించెను. స్త్రీ యని గ్రహించి త్రుళ్ళిపడిలేచి పర్యంకముపై కూర్చొని భయంబుదోప గుండె

దడదడమని కొట్టుకొనుచుండ శరీరమున చెమ్మటలుగ్రమ్మ
చంచలనేత్రుఁడై చూచుచుండెను, అప్పుడాతనికేమియు
దోచలేదు అట్లే తత్తరపడుచు కూర్చుండ నా కపటవేషధారి
నయనారవిందముల దెఱచి నవ్వుచు, నాథా! తత్తరపడెదవేల
నేను నీ ప్రాణేశ్వరినిగానాయనెను మదనమోహనుని కీమాట
లేమియు నర్థమగుట లేదు. నిర్మలజలపూరితమానసకాసారోద
కము కల్లోల పడుచుండెను అంత నాకపటవేషధారి హృద
యేశ్వరా! ఇంతకుముందు నన్ను ప్రేమించెదనని నాతో
చెప్పలేదా నీ పంచప్రాణములను నాకర్పింతునని నుడువలేదా
చెప్పవేమి ఇంతలోనే మఱచితివా అని యింకేమేమియో
యనుచుండ మదనమోహనుని హృదయాబ్ధిని యూహాతరంగ
ములు చెలరేగ నాయువిదను తిలకించి నీవెవ్వర విట్లుండుటకు
కారణమేమని యడిగెను.

అంత నా యతివేషధారి పాన్పుపైనుండిలేచి చెప్పెద నిచ
టనే యుండుమని తలుపుతెఱచుకొని యింటిలోనికరిగి దీప
మును వెలిగించి తాను దాచుకున్న వస్త్రములనువిప్పి కుసుంభా
చ్ఛాయ మానమైన పావడధరించి దానిపై జిలుగు పలువనుగట్టి
కుంకుమలేపనము కుచద్వయమున కలంది పరిమళద్రవ్యములను
శరీరముపై జల్లుకొని పాలభాగమున కస్తూరితిలకము నమర్చి
వజ్రవైఢూర్య నీలగోమేదిక మరకత మాణిక్యాది బహువిధ
రత్నస్థాపిత హారములను ధరించి నానావిధ వితానసూన మాలి
కలను వేణిపై జీరాడునట్లు దురుముకొని శశిబింబమును పరిహ
సించు ముఖమండల చంద్రికలు నలుదిక్కులకు గ్రమ్ముకొను
చుండ కాళ్ళనందియలరవమునకు రాజహంసలు పదముల
కడకు పరువెత్తుచుండ సౌందర్యదేవత మూర్తీభవించినదోయన
యౌవన సంపూర్ణ యప్సరసవలె మదనమోహనున కెదురుగా
వచ్చి నిలువబడెను. ఆమెను జూచుటతోడనే మదనమోహ
నుని యాశ్చర్యానందముల కంతులేదు. దేహమంతయు పుల
కాంకుర మయ్యెను. నా పెం సుస్నిగ్ధ పాలభాగమును
చెక్కుటద్దములను విశాలాక్షులను పాటలాధరమునుజూచి

వలలోఁదగుల్కొన్న జక్కవ పులుఁగులరీతిగా జిలుగుపయ్యె
దలోనున్న కలువగుబ్బలపై దృష్టిబరపెను. తద్దృష్టి నింకొక
వైపునకు మరల్చుకొనలేకపోయెను. ఆమె వాలుచూపులలోని
భావము వలలోఁ దగుల్కొన్న జక్కదనపుపులుంగులను వెలికిదీయ
నీవే సమర్థుడవని సూచించుచున్నట్లుగా మదనమోహనుని
చిత్తమునకు దోఁచుచుండ ఱెప్పలార్పకట్లే జూచుచుండెను.
అంత నా లతాంగి మందస్మితహాస తరంగమాలికాబ్ధినిం దేలు
ముఖారవిందయై కాటుకకన్నులు గండఫలకకర్ణపాలభాగము
లను గ్రమ్ముకొనుచున్నవో యన ఱెప్పలెత్తి చిలుక పలుకులం
బోలిన మృదుమధురవాక్యంబులతో, మనోహరా! ఏలనట్లు
జూచెదవు, నీమనోనాయనికినగు మనోరమనుగా నాయనెను.
ఈ మాటా మెనోటినుండి వెలువడుటతోడనే మనోరమ
చిత్రపటము స్ఫురణకువచ్చెను పరమానంద ప్రవాహము ముందు
నకు నెట్టుకొనిపోవ నాముద్దుల మనోరమవాయని కఠిన
కుచద్వయమురమున గ్రుమ్ముకొన కక్షములసందు కరములను
దూర్చి గట్టిగా పృష్ఠమునుబట్టుకొని గండఫలకములను ముద్దు
పెట్టుకొని కమ్మనియధరమును చుంబించి యూరువుల కూరువుల
నానించి నితంబములపై హస్తములజేర్చి యదిమిపట్టుకొన,
వారిదంతక్షతములకంతులేదు. వారి యాలింగనములకు హద్దు
లేదు, వారట్లెంతకాలము నిలచియుండిరో వారికే తెలియదు.
తదుపరిపర్యంకముపైచేరి దిగంబరులై ముఖమునముఖమును
ఉరముననురమును జేర్చుకొని యొకరినితంబుల నొకరుపట్టి
యదుముకొనుచు తొడలు తొడలు పెనవేసికొని సర్వావయవ
ముల చక్కగా చూచుకొనుచు తనువులుప్పొంగ సమరతులదేల
బూనుకొనిరి అంత నాపద్మాక్షి పానుపున బరుండియుండ
మదనమోహనుడులేచి కూర్చొని పంకజాసనబంధంబున నధర
సుధారసమానుచు ఱెప్పలనప్పళించుచు ఫాలమును చుంబించుచు
ముంగురుల నెగదువ్వుచు, మృదులకపోలముల ముద్దుపెట్టు
కొనుచు మధ్య మధ్య మనోరమ మదనమోహనుని శిరమునుపట్టి
ముఖముచెంతకు వంచుకొని యధరోష్ఠముల పీడింపుచు

జిహ్వాగ్రమును వదన గహ్వరమునబెట్టి త్రిప్పుచు కపోలముల దంతక్షత చుంబనములజేయుచుండ మహారణ్యమున మధ్య రాత్రులందు సంచరించినప్పటి కష్టంబుల మనంబునం దలంచు కొనుచు త్వరపడక జఘనమను వేదికపైనుండి గబ్బిగుబ్బలను కలశంబులంబట్టి కంఠమున బుట్టెడు గుబగుబధ్వనియే మంత్రములుగానుండ నధరామృతమను సోమరసమును గ్రోలుచు, విరహాగ్నిలో ఘర్మవారియను ఘృతమును బోయుచు మదన యజ్ఞమును జేయుచున్నాడో యన సురతంబును జేయ మనోరమ శరీరము స్వేదబిందుపూరితమై నేత్రములు మూతబడి లేనడుము సడలి సకలావయముల సత్తువతగ్గి కామాగ్నియణగి కాయమంత చల్లబడి మైమరచిపోయెను.

దిగంబరిగానున్నది స్ఫురణకురాగ సిగ్గుజనించెను చటాలున లేచి చీరధరింప మదనమోహనుడును వస్త్రముకట్టుకొని పాన్పుపైపరుండిరి. ఇట్లారాత్రి యెన్నిమారులు రతిక్రీడలందేలిరో యెవ్వరుచెప్పగలరు ఇంతయేల విద్యుల్లతతో మదనమోహనుడు పక్షము దినము లనుభవించిన కామసుఖము మనోరమతో నొక్కరాత్రియే యనుభవించినాడనుట యతిశయోక్తికాదు. ఏలనన, మద్యపానముచేసిన మగువను దూరగమనమొనర్చిన తొయ్యలిని నాట్యమున నలసిన నెలంతను భర్తపై కోపించినభామను, చెఱగుమాసి నాలవనాడు స్నాన మాచరించినస్త్రీని, షణ్మాసగర్భము ధరించినసతిని, విరహము చేత పైబడినతరుణిని ప్రథమరజస్వలయై పాలిపోక నుండిన ప్రమదను, మరుకేళిదేలు సౌఖ్యమిట్టిదని మన్మథుడైనను చెప్ప లేడని వాత్స్యాయనాదులు వచించిరి గావున తనంతటతాను విరహముచేతపైబడి లజ్జను దరిజేరనీయక సర్వాంగము నొప్పగించి రతిచాతుర్యమును జూపుచు సిగ్గును బోనాడి చుంబనాదులను జరుపుచు నాత్మేశ్వరుని నానందాబ్ధిని నోలలాడునట్లు మరుకేళిందేలుటచే మదమోహన కీ ప్రథమ దినము న నే విద్యుల్లతతో ననుభవించిన సౌఖ్యమునకన్న వేయిరెట్లధికముగ దోచెను. కొక్కొరోకోయని కోళ్ళుకూసెను వారిగుండెలు

జల్లుమనెను వేగుచుక్క బొడిచెను విహంగముల కలకలము చెలరేగెను తూర్పుదిశ తెల్లబడెను పల్లెలోని ప్రజలందరులేచిరి మదనమోహన మనోరమలు మంచముపైనుండి లేచి కవాటమును దెఱచుకొని యరుణనయనములతో, గంటువడిన గండఫలక .. లతో చిక్కువడిన శిరోజములతో నొక్కులుగలిగిన యధరోష్ఠ ములతో బిగువుసడలిన నడుములతో జేలొప్పయిన ప్రాణములతో అడుగుటం తడబడునడకలతో బయటగుమ్మముకడకువచ్చిరి. వీరి యాకాంక్షలగాంచునపేక్షతోనేమో భాను డుదయాద్రి పూటుననుండి నిక్కి జూచుచుండెను. అంతకుముందులేచిన యవ్వగారు ఇంటిముందు వీధిని శుభ్రపరచి మదనమోహన మనోరమల కెదురుగావచ్చి వారిని జూచి యాశ్చర్యమానసయై నిలువబడెను. ఆమెహృదయ మపుడెట్లుండెనో యెవ్వరు చెప్పగలరు వారివైపు చూపట్టే నిలచిపోయెను అంత మనోరమ యవ్వకు నమస్కరించి, అవ్వా! ఏలనిట్లు జూచుచుంటివి నేను బ్రహ్మచారిని నేను పురుషవేష ధారిణినై నీచేపూజలందిన నాతప్పు సైరించి నా వందనశతంబుల గొనుమనగా నా యవ్వ యమ్మాయీ! నీ వెవరవిట్లు కపట వేషధారివై యుండుటకు గతంబెయ్యది దెల్పుమన నామనోరమ యవ్వా! మనమిప్పుడు మణిపురమున కరుగవలయు నచటికి పోయిన తదుపరి నాచరిత్రనంతయు పూర్ణముగ జెప్పెదను గాన ప్రయాణముకావలయు ననుచుండ సారథిరథమునకు గుఱ్ఱములను కట్టి వీధిగుమ్మముకడకు తోలుకొనివచ్చి నిలువబెట్టెను, అంత నా యవ్వయు మదనమోహనుడును రథముపై నధిష్ఠింప విద్యుద్దీపు నెత్తుకొని మనోరమయరథముపైనెక్కెను చుట్టు ప్రక్కలిండ్లజనులు జూచుచునే యుండిరి. కాని వారికేమియు తెలియుటలేదు రథముసాగెను క్షణములో జూచుచున్న వారి దృష్టికగోచరమయ్యెను. రథగమనధ్వనికి నరణ్యమున భీకర మృగంబులన్నియు మూకలై మరుగులంజేరి చీకాకు నొందు చుండెను. రెపరెపమని రెక్కల నాడించుచు పక్షులన్నియు లియన్మార్గమున పరువులెత్తుచుండెను బిలములలోనున్న భుజంగ

బృందములు భూకంపము గలిగెనని భయంబుదోప బయటకు
వచ్చి ఫణములనువిప్పి యటునిటు పాఱ జూచుచుండెను.
పర్వతముల ప్రతిధ్వనులు దిక్కులు పిక్కటిల్లుచుండెను ఇట్లా
రథము సాయంత్రము నాలుగు గంటలకు మణిపురరాజనగరు
ద్వారముకడనిలచెను.

రథమునుండి వారందరు క్రిందికిదిగి కవాటమునుదాటి విద్యు
ద్దీపు నెత్తుకొని ముందు మదనమోహనుడును ఆ వెనుక నవ్వ
గారును తదుపరి మనోరమయు, అంతఃపురమువంక నడచు
చుండిరి. వీరినిగాంచి యచటున్న పరిచారికలు పరువులెత్తు
కొనిపోయి రామసింహరత్నావతులతో నేమిచెప్పిరో కాని
వారు శీఘ్రగమనమున నెదురుగావచ్చి యానందబాష్పము
లొలుక రత్నావళి మదనమోహనుని దగ్గరనున్న విద్యుద్దీపు
నెత్తుకొని ముద్దాడెను. వారి మానసకాసారోదకముల మునుచు
కొనియున్న హృదయకమలములు విద్యుద్దీపుడను భానునిరాకచే
వికసించెదనని వేరుగ జెప్పనేల., ఈ వార్తవిని పట్టణములో
జనులెల్లరు బరువులెత్తిరాగ పూర్ణానిలయమువీచి పరమానం
దాబ్ధి తరంగపరంపరలు ప్రజలందరిని ముంచివేయుచుండెను.
అంత రామసింహుడా యవ్వనుజూచి తల్లీ! నిన్నెంతని కొని
యాడుదును నీ దయవలన నా తనయుడు బ్రతికెనన నాయవ్వ
రాజా! ఇందు నాదయయేమున్నది. అంతయు భగవంతుని
యనుగ్రహమేననెను. అచటున్న నఖిలజనులు రామసింహుని
యదృష్టమునుగురించి వేనోళ్ళబొగడుచు విద్యుద్దీపునిపై రెప్ప
లార్పక జూచుచుండిరి. ఇట్లొక గంటకాలము గడచిన తదు
పరి రామసింహుడా యవ్వనుజూచి అవ్వా! మహాత్ముడగు
బ్రహ్మచారి యెక్కడనుం జనెనన ప్రక్కనున్న మనోరమ
రామసింహునకు ముందు నిలచి నమస్కరించి నవ్వుచు తండ్రీ!
బ్రహ్మచారితో నింకేమి యవసరము. మీ పని తీరినదిగదా
యనెను. ఈమె మాట్లాడునంతవరకు విద్యుద్దీపుని జూచు
సంతోషమున నచటి జను లొక్కరైనను మనోరమను జూచి
యుండలేదు. ఇప్పుడందరి దృష్టులా యప్సరసవలె నిలువం

బడిన మనోరమపై మరలెను. ఎవ్వరైనదియు వేమియు నర్థము
కాక నాబాలగోపాల మట్లే వీక్షించుచు నిశ్శబ్దముగానుండిరి.
రామసింహు డేమియో యాలోచించుచుండెను. అంత మదన
మోహనుడు మామగారూ! ఏమట్లాలోచించుచుంటిరి. మీకు
భవిష్యత్తును దెల్పి మీ కుమారుని జాడ లెరిగించిన కాషాయాం
బర వేషధారి యా సుందరియేనన వారందరాశ్చర్యమానసులైరి.
అంత రామసింహుడు మనోరమను జూచి అమ్మాయీ! నిన్ను
గుర్తింపలేకపోతిని నీ వెవ్వరవు. నీ జననీ జనకు లెవ్వరు. నీ
విట్లు కపటవేషధారివై యుండుటకు గతంబెయ్యదియన మనో
రమ తండ్రీ! నా చరిత్రనంతయు చెప్పుటకు కొంతకాలము
పట్టును, గాన సభామంటపమునకు జేరి నిశ్శబ్దముగా కూర్చుండి
యాలకించిన చెప్పెదనన మంచిదని రామసింహుడు మొదలగు
వారు ఫలహారముల జేసిన తదుపరి సభామంటపమునకు జేరి
యొకవైపు రామసింహ మదనమోహనులు సింహాసనాసీనులైరి.
వారి కెదురుపీఠములపై నొకవైపు రత్నావళియు విద్యుల్లతయు
మనోరమయు నవ్వగారును కూర్చుండిరి. పట్టణములోని
యాబాలగోపాలము స్త్రీలొకవైపునను పురుషులొక ప్రక్క
నను వరుసవరుసలగా న్యాయస్థానమంత నిండునట్లు కూర్చొ
నిరి. అంత మనోరమ లేచి రామసింహ మదనమోహనులకు
నమస్కార మొనర్చి మధ్యనున్న బల్లసమీపమునకు జేరి తన
వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

నేను హేమపురాధీశ్వరుండగు చంద్రవర్ధనున మహారాజు
కూతురను నా పేరు మనోరమ. నన్ను మాతండ్రి యీ మదన
మోహనునకిచ్చి పాణిగ్రహణము చేయ నిశ్చయించుకొనియుండు
నంతలో వీరిజనకుడగు ధర్మపాలుడు మృతినొంద నాతనిసోదరు
డగు లోభగుప్తుడు నన్ను పెండ్లిచేసికొననెంచి కొన్ని లేఖలను
వ్రాయగా నందులకు మా తండ్రి సమ్మతింపనందున నర్థరాత్రి
కాలమున సైన్యసమేతుడై మా కోటను ముట్టడించెను. ఆనాటి
సాయంత్రమే మా జనకున కీ నా ప్రియుడగు మదనమోహను
డీ లేఖను వ్రాసి పంపెనని తనదగ్గఱ దాచి యుంచిన యుత్తర

మునుదీసి యీాయ రామసింహుని మంత్రి దాని నందుకొని
యిట్లు చదివెను.

మహారాజరాజశ్రీ
హేమపురసార్వభౌముండగు చంద్రవర్ధన మహారాజుగారికి—
నమస్కారము.

అయ్యా!
నేడోరేపో నా పినతండ్రియగు లోభగుప్తుడు సర్వసైన్య
సమేతుడై మీ పట్టణమును ముట్టడించి నిన్నుజంపి నీ సుతయగు
మనోరమను చెరబెట్టవలయునని సిద్ధపడుచున్నాడు. గాన తగు
జాగరూకతతో మెలగవలయును. ఇంతకన్న మీకేవిధమైన
సహాయమిప్పుడు చేయజాలను నేను స్వస్థానమును విడచి
యరణ్యమున కేగుచున్నాను.

చిత్తగించవలెను
ఇట్లు మీ శ్రేయోభిలాషి
ధర్మపాలసార్వభౌమ ప్రియతనూజుడు
మదనమోహనుడు

ఆనాటిరేయి తెల్లవారుజామున మా తండ్రిగారు రణరంగ
మున ప్రాణములు విడచుచు నీ పవిత్రశీలమును గాపాడుగొను
మనియు నా పగదీర్పుమనియు తాళపత్రముపై వ్రాసి భటునిచే
బంప ప్రక్కనున్న ద్వారమున యుద్యానవనమునకేగి తెల్లవారు
నప్పటికి భీకరారణ్యమునకు బరువెత్తితిని.

మద:— ఈ బ్రహ్మచారివేషమునకు తగిన దుస్తులెక్కడ నీకు
లభించెను.

మనో:— విద్యుద్దీప్రుని చోరులపహరించినరోజు కాషాయాం
బర కపటవేషధారులైన చోరులవెంట చోరగుహజేరి
యచ్చట లోభగుప్తుని జూచితిని. వారిమాటలనువిని
చెట్టునకు తగిలించిన దుస్తులనుగైకొని చోరగుహలోని
కొన్ని రత్నములను తీసికొంటిని. నివిగోనని రత్నములను
బల్లపై బోయ అచటున్న వారందరాశ్చర్యమానసులైరి.

మద:— తరువాత.

మనో:— కాషాయాంబరధారివై భల్లూకమును తరుముకొని పోవు నిన్ను పలుకరించిన నేనొక దిక్కుమాలిన వాడనని సమాధానమిచ్చిపోతిరి. జ్ఞప్తికియున్నదా ?

మద:— (ఆశ్చర్యమున) ఆనాడునన్ను పలుకరించినది నీవేనా? యెంత తెలివిలేమివాడను.

మనో:— అంతట నేను కొన్నిరోజులకు నీ యవ్వగారింట విద్యుద్దీపుని గాంచితిని. అదృశ్యకరణియను మూలిక నీ మహానుభావురాలివలన దెలిసికొంటిని. ఆ మూలిక నెవ్వరైనను కాల్చి మసిజేసి లలాటమునధరించిన ధరించిన వారి కందఱు నగుపడుచుందురుగాని ధరించినవారు మాత్ర మితరుల కగుపడరు. అట్టి యదృశ్యకరణి మూలముననే కాత్యాయనీదేవికి బలిదీయ నున్న నన్ను రక్షింపగలిగితిని. విద్యుల్లత వివాహమంటపమున లోభగుప్తుని పరిభవించితిని.

మద:— ఒకరోజరణ్యమున నొక యినుపగోలునుకు యెనిమిది మనుష్య శిరముల గాంచితిని అట్లుచేసిన దెవ్వరు ?

మనో:— మన విద్యుల్లతను దొంగిలించినరాత్రి చోరగుహ ప్రాంతమున పరుండగా నేనే యట్లు గావించితిని అచ్చటకు వచ్చిన లోభగుప్తునివెంట నుదయపురమునకరిగి యా రాత్రి వానిని సైన్యాధిపతిని వాని మంత్రిని అదృశ్యరూపినై సంహరించితిని. అనిచెప్ప.

నా ప్రాణరక్షణ మొనరించిన బంగరుబొమ్మవని మదన మోహానుడ నెను. నా పవిత్రశీలమును గాపాడిన పరమాప్తురాలవని విద్యుల్లతపొగడెను దుష్టసంహారముజేసి మాకష్టముల బాపిన కరుణార్ద్రహృదయవని రామసింహుడనెను. ఈ చిట్టి నాన్నను చేకూర్చిన సద్గుణరాశివని రత్నావళియనెను. శౌర్య ధైర్యస్థైర్యశక్తియుక్తులఖనివని యవ్వగారనెను. సకల రాజ పుత్రికాసముదాయ నక్షత్రమండల రోహిణీదేవివని యా బాల

గోపాలమనిరి. జయజయధ్వానములలో చప్పట్లు చెలరేగెను పుష్పవృష్టికురియుచున్నదోయన మనోరమపై విరులనుజల్లిరి. అప్పుడు మనోరమ చరిత్రను మార్తాండుడువిని సముద్రునితో జెప్పి సంతసించుటకు కాబోలు పశ్చిమవారాశిలోనకు బరువెత్తు చుండ నీ పగవాడు పోవుచున్నాడు భయములేదు రమ్మని తమోదేవతను బిలుచుటకేమో ప్రాకారసౌధమంటపముల వీడలు ప్రాగ్దిశవరకు ప్రాకుకొనిపోవుచుండెను. అస్తమానము కాగా నందరులేచిరి ఆ కా శ ప థ ము న తా ర లచ్చటచ్చట గాన్పించుటకు ప్రారంభించెను అఖిలజనులు స్వస్థానములవైపుల నడుగులు బెట్టుచుండిరి అంధకారమావరించెను అంతఃపురమున దీపములు వెలిగించిరి పక్షులాకాశమున శ్రేణులు కట్టి పరువు లెత్తుచుండెను.

పగలు పదిరెండుగంటల కాలమున పడమరగాలి ప్రాణులను బాధించుచుండెను. భవనంబులనుండి ప్రజలు బయటికి కదుగిడిన తీక్ష్ణమైనయెండవేడిమికి తికమకలగుచుండిరి ప్రపంచమున మృగ తృష్ణికా ప్రవాహములు పైకుప్పొంగుచుండెను అట్టిసమయమున మణిపురకోటద్వారము కిరుప్రక్కల నిద్దరుభటులు ఖడ్గపాణులై యుండ నొకవృద్ధుడు రాజవీధిన తడబడుచు నచటికివచ్చి దాహము దాహమనుచు ధరణిపైబడెను, కన్నులుమూతబడెను దేహాస్మరణతప్పెను వెంటనే యాభటులలో నొకడు పరువెత్తు కొనిపోయి చల్లటినీరునుదెచ్చి నోటిలో కొద్దికొద్దిగా బోయు చుండ తిన్నగా మ్రింగుచుండెను. వేరొకభటు డంతఃపురమున కరిగి రామసింహునితో నీ సంగతిజెప్ప తత్క్షణమే యావృద్ధుని లోపలకు తీసికొని రమ్మనిచెప్పెను. అంత నాభటు లావృద్ధుని చేతులపైవేసికొని రాజమందిరమునకు గైకొనివెళ్ళి యొక పర్యంకముపై బరుండబెట్టిరి కరుణాసాగరుడగు రామసింహు నాజ్ఞచే దాసీజనములువచ్చి సకలోపచారముల జేయుచుండిరి. ఆ వృద్ధుడు, డెబ్బదిసంవత్సరములవయస్సుగలిగి శిరోజములు తెల్లనై చిక్కువడి ముఖము ముడుతలచేనిండి కణతలులోనికేగి గర్భమువెన్నునకంటుకొని కాయము బలముతగ్గి చర్మము

పలుచనై శల్యావశిష్టుడైయుండెను. పాపము కొన్ని రోజుల నుండి యాహారము తినినట్లు గాన్పించుటలేదు అటులనే వారందరుపచారములను జేయుచుండిరి. రామసింహు డావృద్ధుని ప్రక్క పీఠముపై కూర్చొని యుండెను సాయంత్ర మైదుగంట లైనది చల్లనిపైరుగాలి వీచుట ప్రారంభించెను మృగతృష్ణలింకినవి ఆ చల్లగాలి శరీరముపై సోకుటచే నావృద్ధునకు కొంతతాప ముపశమించి కన్నులు తెరచిచూచెను. ఏమికావలెనని రామ సింహుడు ప్రశ్నించెను దాహమని యాతడు జబాబిచ్చెను అంత చల్లనిపానీయ మొసంగి కొంచెమాగి పలుచని యాహార మిడ దానిని భుజించి లేచి కూర్చొనెను. అంత రామసింహుడు బాబు నీ శ్రమదీరినదా కొంచెము నాతో మాట్లాడెదవాయన నా వృద్ధుడు హీనస్వరముతో మాట్లాడెదనని తలనూపగా వారికిట్లు సంభాషణ జరిగెను.

రాము:— బాబూ ! నీ వెవ్వడవు ఇట్లు శల్యావశిష్టుడవై యుండుటకుఁ గతంబెయ్యది.

వృద్ధు:— అయ్యా ! నానాక కష్టపడితిని, మధ్య కొంతకాలము తప్ప నా చిన్నతనమునుండి యిట్లేకడ లేనికష్టములను భరించుచుంటిని. ఎంతకాలము గడచినను నా మొండి ప్రాణములు పోకున్నవి. యీనాడు మృత్యుముఖమునం బడినను నేను సుఖించెడివాడనే మీ కరుణార్ద్రి హృదయమునన్నిట్లు కడతేరనీయకున్నది.

రామ:— అయ్యయ్యో ! ఎందులకిట్లు బ్రతుకుపై రోసితివి. దయయుంచి నీ తెరంగెరింగింపుము,

వృద్ధు:— అయ్యా ! నే నెవ్వరివి జూచుకొని యానందించుటకు బ్రతుకవలయు తండ్రిగారు ఘోరమరణమును జెందు చుండ తప్పింపలేక తిలవంచుక కూర్చుంటిని. గర్భి ణితోనున్న తల్లిని యగ్నిహోత్రమున కర్పించితిని కొంత కాలమునకు రాజ్యముపాలించుట కర్హుడనై శిశువును గని మృతినొందిన ధర్మపత్నికై చింతించుచు నా బాలి కపై ప్రేమచే మరల పెండ్లిచేసికొనక కన్నబిడ్డను బహు

గారాబముతో బెంచి పెద్దదానినిజేసి పగవానికి నొప్ప గించి రాజ్యభ్రష్టుడనై రణరంగమున దొంగనైవచ్చి యాకలిమంట లతిశయిల్ల "నన్నమోరామచంద్రా" యని యల్లాడుచు నఖిలదేశంబులఁ దిరిగి శల్యావశిష్టు డనైయున్న నేను చచ్చిననేమి బ్రతికినేమి.

రామః— అయ్యా! నీ మాటలేమియు నా కర్థమగుట లేదు. మీదేదేశము. తమ నామాక్షరములెవ్వి?

వృద్ధుః— ఈ దీనుని చరిత్ర వినుటకెందులకయ్యా నీకీ ప్రేమ ఇది రామాయణమా? భారతమా?

రామః— ఏ కథయైనను నిన్నుజూడ నాకేమో ప్రేమముదయించుచున్నది నీ చరిత్ర వినుటకు కుతూహలము గలుగుచున్నది.

వృద్ధుః— అట్లే చెప్పెద నాలకించుము.

రామః— సావధానచిత్తుడనై వినెదను, దయయుంచి నీ పేరు దెల్పగోరెదను.

వృద్ధుః— నేను హేమపురాధీశ్వరుండను, నా పేరు చంద్ర వర్ధనుడు.

అని చెప్పుచుండు నంతలో నీ వృద్ధునిజూచు నిమిత్తమై విద్యుల్లతయు, రత్నావళియు, మనోరమయు రాజమందిర ద్వారముకడకువచ్చిరి. యీ మాటల నాలకించి యాత్రముతో మనోరమ నీ ముద్దులపట్టి మనోరమయేనా యన, చంద్రవర్ధను డౌనౌనను చుండగానే హా తండ్రియని మనోరమ కవాటమును దాటి పరువెత్తి చంద్రవర్ధనుని గౌగలించుకొనెను. అంత నావృద్ధరాజాశ్చర్యహృదయుడై యానందబాష్పము లామె శిరమునబడుచుండ చెక్కిళ్ళు నిమురుచు శిరోజముల సవరించుచు అమ్మా! నీ పవిత్రశీలము నుగాపాడుకొని బ్రతికియే యుంటివా యనెను. జనకుని శరీరస్థితినిజూచి మనోరమగుండె జల్లుమనెను. తండ్రీ ఏల యిట్లుంటిరని తహతహపడెను అమ్మా నాకై నీవు చింతపడవలదు నీవు నాకన్నులకు గాన్పించితివంతియే చాలునని చంద్రవర్ధనుడనెను. అచటున్న వారందరాశ్చర్యమానసంబుల

నాలోచించుచుండిరి. రామసింహుడు మనోరమతో అమ్మా ! మీతండ్రిగారు మరణించెనని చెప్పితివిగదాయన మాతండ్రిగారు వ్రాసిన లేఖనుబట్టియు భటుని మాటలను వినియునట్లే యను కుంటినని యామెచెప్పెను. మఱియు మనోరమతండ్రి నీక్షించి, నాన్నా ! ఆనాడు రణరంగమునుండి యెట్లు తప్పించుకుంటివి. లోభగుప్తుడునిన్ను ద్రుంపకయెట్లు విడచెనన నా చంద్రవర్ధ నుడు డిట్లు చెప్పదొడగెను.

అమ్మా ! లోభగుప్తుడు నావిల్లును వికలముజేసి యేనుగ యొక్క కరచరణంబుల విరుగగొట్టి నాపై శరవర్షము గురి పింప నా శరీర మెల్లయెడల తూట్లుపడి రక్తధారలు క్షితింబడ నిలువంజాలక బ్రతుకుపై నాసవిడచి భూమిపైబడితిని. అంత నాతడు నేను చచ్చితిననిదలచి తగులబడుచున్న పురమువంకకు సైన్యసమేతుడైపోయెను. అంత మన భటుడురాగ నా లేఖను వ్రాసి నీకు బంపితిని. అట్లా సేవకుడా లేఖను నీకిచ్చి తిరిగి పానీయంబులను గొని నాచెంతకుజేరి నానోటిలో బోసెను. కొంత సేపటికి కదబట్టినప్రాణములు కుదుటజడినవి తదుపరి యాసేవకుని సహాయమున నా రణభూమినిదాటి కొంతవరకు నడచి తెల్లవారిన తదుపరి కాననమునకుచేరితిమి. అట్లా, కాననమున నొక్కచో కుటీరమును కట్టుకొని కాయలాకుల దినుచు కాలము గడుపుచుంటిమి. దేహమునకు పడినగాయము లన్నియు మానినవి. ఇట్లుండునంతలో ఫలముల కొరకు పోయిన సేవకుడు పులివాతబడెను. అదిచూచి దైవమును దూరుచు నచట నొంటరినై యుండలేక దేశదేశంబులను తిరుగ నారంభించితిని ఎచటవసింతమన్నను కాలు నిలువదేమిచేయుదు. నీవు తలవునకురాని క్షణమే లేదు. నిన్ను గాంచు భాగ్యము గలుగునని కలలోనైనను కానలేదు. ఇప్పటికి పక్షమురోజుల నుండి యాహారమును మాని పిచ్చివానిరీతిగ తిరుగుచుంటి. నీవు నా కన్నులకు గాన్పించినంతనే వేయి యేనుగుల సత్తువవచ్చి నది. తల్లీ ! నీవెట్లా దుష్టునిబారిబడక తప్పించుకొంటివమ్మా యని చంద్రవర్ధనుడడుగ మనోరమ తన కథనంతయు జెప్పెను.

ఇదంతయు విని రామసింహ రత్నావళీ విద్యుల్లతల యానంద మింతయని జెప్పుట కలవియేగాదు. ఈసంగతి పట్టణమెల్ల యెడల వ్యాపించెను. చనిపోయినాడనుకొనిన చంద్రవర్ధనుడు వచ్చె జూతమని పట్టణమున ప్రజలెల్లరు రాజభవనమునమూగిరి. నిశ్శబ్దముగా కూర్చుండిరి. లోలోపల మనోరమ యదృష్టమును మరిమరి పొగడిరి. అంత చంద్రవర్ధనుని పన్నీటస్నానము చేయించి పట్టు పీతాంబరములను గట్టనిచ్చిన వానిని ధరించి సింహాసనాసీనుడైన వెనుక రామసింహుడిట్లు ప్రశ్నించెను.

చంద్రవర్ధన మహారాజా! నీవు జనకు ఘోరమరణమునకు సహించియుంటివనియు, గర్భిణితోనున్న తల్లిని యగ్ని హోత్రమున కర్పించితివనియుఁ జెప్పితిరి. అదెట్లెందుకు జరిగెనో నీ చిన్ననాటి చరిత్రను విన కుతూహలము గలుగుచున్నది. చెప్పుమన చంద్రవర్ధనుడంతవరకు మనోరమకైనఁ జెప్పని తన చరిత్రను జెప్ప నారంభించెను.

రామసింహ! నేను హేమపురమున చంద్రవంశమున నొక పేదకుటుంబమున జన్మించితిని మాజనని పేరు భానుమతి. నా తండ్రి వీరసేనుడు. ఆకాలమున నా పట్టణమేలుచున్నది ప్రతాపసింహుడు వాని ప్రతాపానలజ్వాలలకు దేశదేశంబుల రాజులు భయభ్రాంతులగుచుండెడివారు. ఆతడు బహుజారుడు మా తండ్రిగారు నాతనికడనే చిన్న యుద్యోగియైయుండెను. ఒకరోజంతఃపురమున రాణిగారితో మాట్లాడుచున్న మాతల్లి సౌందర్యమునుజూచి ప్రతాపుడు మోహపరవశుడై యారాత్రి యొక దూతను మా జననికడకు బంప నామెవచ్చి రాజుకోరి కను జెప్పె సర్వాంగసుందర సాధ్వీరత్నమైన మా తల్లి యామెతో నేను భోగముపడుచును కానని యు రాజునకిట్టి దుర్బుద్ధి తగదనియు నాకు భాగ్య రాజ్య ములేకున్నను పతి భక్తియున్నదనియు మరింకొక మారిట్టి ప్రయత్నమొనరించిన నాతని మర్యాదదక్కదనియు, నతిఖండితముగ దెల్ప నా దూతిక తలవంచుకొనిపోయి యీ వార్త రాజునకెరిగింప భగ్గునమండిపడి నిరపరాధియైన నా తండ్రిని నేదోయొక నెపం

బున జైలునందుంచెను. ఇప్పటికైన మనస్సు మరల్చుకొని యీ కోరికను దీర్చుమని మరల నా క్రూరుడు ఘోరముగ దుఃఖించుచున్న మా తల్లికి కబురులంపిన నా పరమ పతివ్రతా తిలకము మా కుటుంబ నాశనమైన నా పాపకార్యమున కొడిగట్టనని కడు కోపోద్రేకురాలై చెప్ప నా ప్రతాపుడిది విని యీర్ష్యావేశుడై పాపము పాపమని బహుజనులు పశ్చాత్తాపపడుచుండ నేపాపమెరుగని నాపితరుని శిరము నరికించి మహాత్మ సగర్భిణియైన జననిని సహగమన మొనర్పవలయునని శాసించెను.

సజ్జనులైన పురవాసులు చాలమంది శిశువుగర్భమునున్న సతి సహగమన మొనర్చుట శాస్త్రసమ్మతము కాదని చెప్పిరిగాని ముండమోపులు మనపట్టణమున నుండరాదనియు ప్రొద్దునే లేచి వారిని పరికింపకూడదనియు అడ్డుమాటలబల్కిన మిమ్మందరశిక్షింతుననిపల్కెను. ఆ పాపాత్మునకు భయపడని ప్రజలెవ్వరు, అప్పటికి నాకు నెనిమిదివత్సరములుండును, అంత శ్మశానవాటికయందు చితింజేర్చి మా తండ్రిశిరమును మొండెమును దానిపైజేర్చిరి. పట్టణములోని ప్రజలెల్లరు రుద్రభూమిని నిండిరి. ఆ నాడాకాశపథమంతయు మేఘావృతమై పెటపెటార్భటముల దిక్కులు బ్రద్దలగుచున్న మేఘగర్జనంబులు, కన్నులు మిఱుమిట్లుగొల్పు మెఱుపులుంగలిగి గాలిచేత కూడుకొని ప్రళయమో యనునట్లుండెను. అట్టిసమయమున మాతల్లి నన్నుదగ్గఱకు తీసికొని నాన్నా! నేను పోవుచున్నాను దీర్ఘాయుష్మంతుడవుకమ్ము "ఎట్లైనను నాపగదీర్పుము" అని నన్నుముద్దాడి చేయునదేమిలేక తిరిగి తిరిగి జూచుచు చితికడకు చేరెను ఇక నేనామెను చూడలేకపోతిని నేనెక్కడనున్నానో నా మనస్సెట్లుండెనో నాకే తెలియదు కాష్టమునకు నిప్పంటింపబడెను. అగ్నిహోత్రుడు నాలుకలజాచుచు నాకాశమునకంటుచుండెను. మిన్నుదాక పావకజ్వాలలు ప్రజ్వరిల్లుచున్న నా కాష్టముపై మా జననిచేరెను నా కన్ను లీ ఘోరకార్యమును చూడలేక మూతబడెను ఇంతలో పెళపెళమని రాజ

భవనమున పిడుగుబడెను, భయమున ప్రజలెల్లరు పట్టణమువంక పరుగిడుచుండ రాజాజ్ఞచే నన్నొకభటుడు లాగుకొని రాజనగరు కడకుపోయెను. ఆ పిడుగు ప్రతాపుని భార్యపైబడి ప్రాణములను విడచెను. అదిచూచి రాజవనిపైబడి యేడ్చు చుండ నందరునట్లువైపే వీక్షించుచుండిరి చినుకులు పడ నారంభించెను కుంభవర్షము కురియుచుండెను అప్పటివరకు దిక్కు దోచని నాకునింక నిచ్చటనున్న మోసము వచ్చునని మదికి దట్టెను. అంత నేను రాజనగరుంగడచి, గాలివర్షమున గడగడ వడకుచు పట్టణముం దాటి భీకరారణ్యమునకు పరుగిడి యచ్చ టచ్చట నివసించుచు నాకులలములు దినుచు కొంతకాలమునకు గడపి రామచంద్రపురిమునంజేరి ధనుర్విద్యాపారంగతుడనై ధర్మ శాస్త్రంబులనేర్చితిని అప్పటికి నా కిరువదైదువత్సరముల వయస్సువచ్చెను అంత నేను బయలుదేరి హేమపురంబునకు వచ్చునప్పటికి సభామంటపంబున ప్రతాపసింహుడు కొలువుదీరి యుండెను. నేను లోనిగరుగబోవ భటులు నన్నడ్డగింప నేను క్షత్రియకుమారుడను ఇచ్చటనేదైన యుద్యోగమునకైవచ్చితినన రాజాజ్ఞనుగైకొని వారు నన్ను లోపలకుబోనిచ్చిరి. నా దగ్గర ధనస్సునంబులపొదియు నుండెను అంత నేను సభాభవనమునకు బోయి యాదుష్టుడగు ప్రతాపసింహుని వంకజూచితిని నాజననీ జనకులు స్మరణకువచ్చిరి కోపోద్రేకము నాపుకొనలేకపోతిని ఓరే ప్రతాపసింహా నీవింకను బ్రతికియేయుంటివా "ఎట్లైన నాపగదీర్పుము" అని మాజనని చెప్పినది ఇంతలోనే మరచితి ననుకొంటివాయనుచు నా పాపాత్ముని శిరము నొక శరముచే భూమిపైబడజేసితిని నారౌద్రమునుజూచి యచటున్న సభికు లందరికేమియుదోచక నిర్విణ్ణులైజూచుచుండిరి. అంత నేను వీరసేనుని నూనుండను మాతల్లి భానుమతి వారిఘోరమణములను గురించి మీకు తెలిసిన విషయమేకదా యంటిని యీ మాట వినుటతోడనే ప్రజలందరిపై పరమానంద సముద్రముపొర్లెను. ఈ రాజ్యమేల నీవే సమర్థుడవని నాకు పట్టాభిషేకముచేసిరి. అంతటనుంచి నలుబదివత్సరము లా రాజ్యమును పాలించితి

ననుచుండగా నంతవరకు నాలోచించుచు కూర్చుండియుండిన
యవ్వాగారానందాశ్రువుల వనీతలంబున బడుచుండ లేచి చంద్ర
వర్ధనుని గౌగలించుకొని కుమారా! సద్గుణగణపూర్ణహృదయా!
నిన్నెంతకాలమునకు జూచితిని నేనే మీతల్లినగు భానుమతిని.
ఆనాటి నా యాజ్ఞను శిరసావహించి ప్రతాపుని ప్రాణముల
దీసితివా యనగా చంద్రవర్ధనుడు మితిలేని సంతోషమున,
అమ్మా! నీ వా నాడు చితిపై జేరితివికదా? ఎట్లు బ్రతికితివి
పావకజ్వాలలనుండి యెట్లు తప్పించుకొంటివనగా నామె యిట్లు
చెప్పనారంభించెను.

కుమారా! ఆ నాడు నేనుచితిపై కెక్కిన వెంటనే చుట్టు
మంటలు క్రమ్ముకొన నడుమనుంటిని రాజభవనముపై పిడుగు
బడినతోడనే మీరందరు పరుగిడితిరికదా అట్లు మీరరిగిన
తదుపరి పెద్దవర్షముకురియుటచే చితి చల్లారినది. అంతట నేను
శ్మశానమునుండి యరణ్యమున కతిత్వరగా పరువిడితిని
సాయంత్రమగు వరకరణ్యాంతర భాగమునకుచేరి యచ్చట
శయనించి యుదయమున నొక కుటీరమును నిర్మించుకొని
యచ్చటనే నివసించుచుండగా నవమాసములు పూర్తియై యొక
రోజు మగశిశువును గంటిని అచ్చట నివసించియున్న చెంచుల
వారు నాకు సహాయమొనర్చిరి. ఇట్లొక సంవత్సరము గడచిన
తదుపరి యొకదివసంమున మీ నాన్నగారి ప్రియమిత్రుడగు
సత్యవ్రతుడు రాజాజ్ఞచే నన్ను వెదకుచు నాకడ కరుదెంచి,
ఇట్లుచెప్పెను..

అమ్మా! వర్షముచే చితియారిపోయిన తదుపరి ప్రతాపుడు
వచ్చి చూడగా నీ నాథుని కళేబర మొక్కటియే గాన్పింప
నీవెచటికో పారిపోతివని గ్రహించి కొంతమందిని నిన్ను వెదకు
టకుఁబంపియున్నాడు. అందు నేనొకడను, ఇంక నీముద్దుల
మూటయగు నీ బిడ్డనుంచుకొని యెచ్చట నివసించినను తప్పక
ప్రమాదము సంభవించును గాన నీచిన్నికుమారుని తీసికొనివెళ్ళి
యే రాజునకైననిచ్చి రహస్యముగా రక్షించునట్లు చేసెదనని
యనేకవిధంబులజెప్ప నే చేయునదేమిలేక భగవంతునిపై

భారమునువేసి ప్రియకుమారునిపై ప్రేమమును వదలి యాతని
కా బాలునిచ్చి నేనచటనుండి వెడలి సత్యపురమను చిన్నపల్లె
యందవ్వగారని యఖిలజనులు బిలుచుచుండ నివసించుచుంటిని
ఆ సత్యవ్రతు డా బాలు నెక్కడుంచెనో తదుపరి యేమి
జరిగెనో నా కింతవరకు తెలియదు. నేటికి నిన్ను నా యదృష్ట
వశమున తలవనితలంపుగ కన్నులార గాంచితిననగా నచటున్న
వారందరాశ్చర్య హృదయులైరి. ఈ చరిత్రయంతయు
నాలకించి రామసింహ మహారాజు సింహాసనమునుండి లేచి
వినయవిధేయుడై భానుమతి చంద్రవర్ధనుల ముందునకుజేరి,
తల్లీ! నమస్కారము, అగ్రజా! అభివందనములనగా నెవ్వరి
కేమియు నర్థముకాలేదు. అంత రామసింహుడు తల్లీ! ఏల
యట్లు జూచెదవు నీ చిన్నకుమారుడను నేనే. నన్నే నీవు
సత్యవ్రతునకొప్పజెప్పినదనగా భానుమతి, చంద్రవర్ధను
లాత్రముతో, నాయనా! నీవేయని నీకెట్లు తెలియునని
యడుగ రామసింహు డింటిలోనకరిగి తనజన్మపత్రమును దీసి
కొని, అమ్మా! నన్నుపెంచి పెద్దవానిగాజేసిన జయసింహ
మహారాజు చనిపోయిన తదుపరి నేను పట్టాభిషిక్తుడనైన వెనుక
నొక పేటికయందీపత్రము గాన్పింప నా జననమును గురించి
తెలిసికొంటిననుచు దానిని చంద్రవర్ధనుని కీయగా దానియం
దిట్లు వ్రాసియుండెను.

## రామసింహుని జన్మ పత్రము

శ్రీరస్తు చిరంజీవి రామసింహునితండ్రి హేమపురవాసుం
డగు వీరసేనుడు. తల్లి భానుమతి. ఈ భానుమతి భర్తతో
సహగమన మొనర్పంబూని భగవంతుని దయవలనం బ్రతికి
బయటపడి భీకరారణ్యమున నీ శిశువును ప్రసవించి ప్రతాప
సింహుని కోపానలజ్వాలలకు భయపడి సత్యవ్రతున కీబాలు
నొప్పగించి యేచటకో బోయెను. అంత నాతడు నేను సంతాన
ములేక చింతనొందుచుండు సమయమున నీ బిడ్డను నాకిచ్చి

వెడలిపోయెను. అంత నేనల్లారుముద్దుగా నత్యంతగౌరవ ముతో బెంచి రామసింహ నామకరణమును జేసితిని నా యనంతరము నా రాజ్యము సర్వహక్కులు నీ రామసింహునకే చెందునట్లు నా మనస్ఫూర్తిగా నీ పత్రమును వ్రాసితిని.

ఇట్లు మణిపుర సార్వభౌముడు,

జయసింహమహారాజు.

ఇట్లు వ్రాసియున్న జన్మపత్రమును వీక్షించి తన యరవిం దాక్షులం దానంద బాష్పములురాల చంద్రవర్ధనుడు తమ్ముని గాగలించుకొనెను. తన బాల్యముననే ప్రాణములు వీడి పరమ పదమును జేరెననుకొనిన పతివ్రతాతిలక మా తల్లిని స్వప్నమం దైన సోదరుడుండెనని తలంపని సద్గుణగణవిరాజిత సర్వసం పన్నుడైన తమ్ముని విరోధిహస్తగతురాలై వివిధకష్టంబులం జిక్కి యసువులబాసి యుండెనిక నా వశముగాదు వెదుకనని నిరాశజెందిన ముద్దుకుమారిని తన ప్రియసుతయెనని సుందర రూప మాకర్షణీయహృదయైక ప్రేమానురాగ బద్ధురాలైనదో ఎవని బిగికౌగిలింజిక్కి సర్వాంగముల స్వాధీనమొనర్చి సంతతా నంద మనుభవింపదలచినదో అట్టి సకల రాజపుత్ర శిరోమణి యైన తన యల్లుని యేకకాలమునందు జూచిన చంద్రవర్ధనుని విశాలహృదయసీమ శృంగార తరువులెట్టి పరిమిళమిళిత కుసుమ ములు వికసించినవో.

తన సంతతి యంతయొంది నేనేకాకిగా జీవించియుంటినని మనంబునదలంచి కుగ్రామవాసియైనతరి పగదీర్చిన పెద్దకుమా రుని సార్వభౌముడైన చిన్నకుమారుని కోడలిని మనుమరాం డ్రను వారి మనోహరుని ఇంతమంది నొక్కమారు తలపని తలంపుగా కలసిన భానుమతి మానసవీధిని సంతోష శకటము లెట్లు పరుగిడుచున్నవో.

ఎన్నడెరుగని కన్నతల్లిని అగ్రజుని కన్నులారగాంచిన రామసింహుని యంతరంగాబ్ధి హర్షరత్నములెట్లు ప్రకాశించు చున్నవో.

మనోరమ మదియెట్లుండెనో, విద్యుల్లత హృదయ మేరీతిగా నుండెనో ఎవ్వరుచెప్పఁగలరు? ఆనందమారుత మచటున్న వారందరిపై వీచెను. సూర్యు డస్తమించెను. చీఁకటి వ్యాపించెను. అచటి వారెల్లరు తమతమ యిండ్లకేగిరిగాని యా రాత్రియంతయు నే యింటివారా యింటిలోనే భానుమతి కుటుంబమునుగూర్చి చెప్పుకొనుటయే గాని నిదురబోయిన స్త్రీ పురుషులు వెదకినను లేరనిచెప్ప నతిశయోక్తి గాదు. అంత సూర్యోదయమాయెను. చంద్రవర్ధన రామసింహ మదనమోహనులు ఇరువుర భటులం బిలిచి యుదయపుర హేమపుర సంగతులను దెలిసికొని రమ్మని పంపగా వా రిరువురు నా పట్టణంబులకేగి యట పెద్దలంజెరి చంద్రవర్ధన మదనమోహనుల చరిత్రలం దెలుప నంతవరకు ప్రభువులేక పరితాపము నొందుచున్న ప్రజలెల్ల రాశ్చర్య సంతోష హృదయాంతరంగులై దరిద్రులకు ధనము దొరికిన రీతి యాకలికొన్నవారి కన్నము లభించిన పగిది. నాలుక యెండినవానికి నది గాన్పించిన భంగి. కాముకుని చక్కనికాంత వరించినట్లు భక్తునకు పరమేశ్వరుడు ప్రసన్నుడైన విధముగా వారి హృదయాబ్ధులు పొంగ పరమానంద భరితులైరి.

చదువరులారా! కానువిలువజేయని వస్తువు కనుపడక కొంతకాలమునకు గాన్పించిన మనకెట్లుండునో చచ్చినవారు మనకు స్వప్నంబులో కాన్పించిన మేలుకాంచిన తదుపరి మన మెంతకాల మా స్వప్నమునుగూర్చి సంతోషింతుమో, యెల్లర కనుభవమైన విషయమేకదా.

మదనమోహనుడు మరణించెను. చంద్రవర్ధనుడు చచ్చిపోయెను. మనోరమమాయమయ్యెను. మనకు వారి దర్శనము లభింపదని కన్నులువాయనేడ్చి కలవరించి నిరాశజెందిన బుద్ధిమంతులకీనాడు ప్రభువులు బ్రతికియుండి ప్రత్యక్షమాదురనియు ప్రజల బాలింతురనియు దెలిసిన యెంత సంతసము గలుగునో యెంత యుత్సాహపూరితమానసు లగుదురో వేరుగా చెప్పనేల.

అంత నుదయపురవాసులలో కొందరు కరిరథాశ్వసైన్య సమేతులై మణిపురంబునకరిగి భార్యాద్వయయుతంబుగ మదన మోహనుని మాతాసమేతంబుగ చంద్రవర్ధనుని దీసికొనివచ్చి మదనమోహనుని పట్టాభిషిక్తుంజేసిరి. చంద్రవర్ధనుడు వృద్ధుడగుటచే హేమపురంబునకుగూడ మదనమోహనుడే రాజుగా నుండెను ఇట్లు మదనమోహనుడు నిరువుర భార్యలతో సౌఖ్యములందేలుచు రెండు రాజ్యముల ప్రజలు వేనోళ్ళబొగడ సజ్జనసమ్మతముగ సకలైశ్వర్యయుతుడై పాలించుచుండెను. ఈ రీతికొన్ని వత్సరములు గడచిన వెనుక నొకనాటి సాయంకాలము నాలుగుగంటల సమయమున నుదయపురమునకు పశ్చిమ దిక్కుననున్న యుద్యానవనంబునందు చల్లనిపైరుగాలి మెల్ల మెల్లగా వీచుచుండనందు చందనమందారజంబీర మాకందపనస నింబకదంబ పారిజాతనారికేళాశోకచంపక వకుళరసాలాది వృక్షచ్ఛాయలు శీతలమై చలువపందిళ్ళకు సరివచ్చుచుండెను. ఈ భూరుహంబులకు పెనంగొనిన, మల్లెమొల్లవిరజాజి మాలతి మల్లిక మొదలగు లతలు సుగంధబంధుర సుమంబుల వికసించి మరింతశోభను గలుగజేయుచుండెను. నందనోద్యానమునకు మించు నాతోటయందు చంద్రకాంత శిలావేదికలను సైకత స్థలంబులను, పరిమళసహిత పుష్పవాటికలను శతపత్రకైరవ కల్హారకలితసురభిజాజితంబగు పద్మాకరంబులను ఘృతమునెత్తి గలుగు పరిశుభ్రమైనబాటలను, జతలుజతలుగా తిరుగాడు చక్రవాకములను, గుంపులు గుంపులుగా గూడియున్న చకోర పక్షులను శ్రేణులుకట్టి సంచరించుచున్న శారికములను, పింఛములవిప్పి నృత్యముచేయు బర్హిబృందములను పంచమస్వరంబున పాటలుబాడు పికసమూహములను నిర్మలజలపూరిత సరోవరములందీదులాడు రాజహంసలను పరిటీలంగొట్టుచు పోవుచున్న కపోతపంక్తులను, వింతగూడులం దూయెలలూగు గిజిగాడి పిట్టలను ప్రజమాటలపరిహసింపజాలి పలువిధ మృదోక్తులంబలుకు చిలుకగుంపులను చెంగుచెంగునదుముకుచున్న హరిణశాబకంబులన జూచిన నెట్టిమనుజులైనను నానందాబ్ధిని నోలలాడకపోరు. అట్టి

సమయమున పద్మాకరగ సమీపప్రాంతమున శశికాంతశిలావేదిక యందు మదనమోహనుడు కూర్చుండియుండ నిరుపైపుల మనోరమ విద్యుల్లతలు మందస్మిత వదనారవిందలై ప్రకృతి నీక్షించుచు మదనమోహనునిజూచి మనోరమ.

నాథా ఈ యారామమెంత గ మ ణీ య ము గా ను న్న దో చూడుము. ప్రాణప్రియులగు వృక్షరాజముల బాగుగా కౌగలించుకొని నవపల్లపపుష్పశోభితంబై యలరారు వివిధలతలను, మందారకుసుమమకరందమును తనమగువలకుజూప నవి మాధుర్యమును గ్రోలుచుండ జుమ్మను నాదముసచుట్టు తిరుగాడుతు మ్మెద గుంపులను చిగురుటాకుల చంచువునంగొనివచ్చి భార్యను నోసంగి రెక్కలసందున ముక్కుతో గిలిగింతలువెట్టి పరమానందమున పంచమస్వరంబునగూయు పికదంపతులను చక్కని మావిఫలంబుల ముక్కలుగాజీల్చి మ క్కు వ తో మగలకు మెక్కుటకునిచ్చి మరుకేళిదేల మామిడిమ్రాకుల బొరియలలోదూరు చిలుకజతలను కొమ్మలతోగిరి జిహ్వాచే శరీరమును స్పృశింప మదనపరవశయై మగనిపై మెడబెట్టి యందమైన చూపులతో నానందము ననుభవించు హరిణజంటలను.

అది యిది యననేల ప్రపంచమున సర్వచరాచర సముదాయ మంతయు భార్యాభర్తల ప్రేమానురాగాలింగన పరవశత్వమున పరమానంద మనుభవించుట జూడ జగమంతయు ప్రేమమయమే ననియు, సర్వసుఖములలో నుత్తమోత్తమమైనది. సతీపతుల ప్రేమయేననియుఁ, దోచుచున్నది. నీ వొప్పకుందువా ?

మద:— ఇం దబద్ధమేమున్నది. మీవంటి సరసిజాక్షులచెంత జేరి చెక్కిళ్ళ నొక్కుచు భటువుగుబ్బలబట్టుచు నధరసుధారస మానుచు, ననంగుని సంగరమునకు గడంగుటకన్న నధికసౌఖ్యమేమున్నది. పుడమిలో నంతకుమించు భోగభాగ్యమేమి కలవు.

విద్యు:— అవుననుచు ప్రేమించి వరించి వివాహమాడిన వధూవరుల ప్రణయసుఖమునకు మించిన పరమానందములేదు. అదియే బ్రహ్మానందమను టతిశయోక్తికాదు.

మనో:— కానీ స్త్రీలకు స్వేచ్ఛావిహారము తగదనియు, మను
గులలోనే మురిగి చావవలపినదనియు, ఇష్టమైనవరుని
వివాహమాడి సుఖింపక తల్లిదండ్రులయాజ్ఞలనే తల
దాల్ప వలయుననియు, బాలికలకే పరిణయములుచేయ
వలయుననియు, కాంతలకొక కట్టుబాటును గల్పించి
సుగ్గాంగనలను ముసలి ముండాకొడుకులకు ముడివెట్టి
పెద్దలు జెప్పినటు లొద్దికతో కాపురముజేయుచు పతి
వ్రతలుగానుండుటే పరమధర్మంబని ఆలుబిడ్డల సౌఖ్య
మెరుగక నాకులలములు దినుచు ముక్కుమూసికొను
మునివర్యులు బుద్ధికిదోచినట్లు పురాణములను
వ్రాసిరి. అట్లు వ్రాసినవారి కందులోని కష్టనష్టములు
గ్రహింపలేదని నా యభిప్రాయము. నీ వేమందువు.

మద:— ఏమందునా! మానినీమణుల ప్రేమల తలను మ్రండింప
దలచిన మతగ్రంథములందును, కోమలాంగుల కన్యాయ
మొనర్చు గుడ్డిశాస్త్రములందును, కులకాంతల కోర్కె
లను గూల్చు కుచ్ఛితపురాణములందును, పెద్దలని
పూజించిన పాపఫల పెడతలవాచిన సిద్ధాంతములందును,
సరసిజాక్షుల సంతోషహరణ సంఘనియమములందును,
యబలల నానందమును హరించు ననాచారములందును.

విద్యు:— నిజమువచించితిరి. లేకున్న గొడ్డుబోతుదానికి
బిడ్డలసౌఖ్యము దెలియునా? సన్యాసులకు సంసార
సుఖము దెలియుటకు భార్యా దూరులైనవారు ప్రణయ
సుఖమెట్లనుభవింతురు. ఎట్లు గ్రహింతురు.

మద:—వారు గ్రహించియేయున్న నీ కట్టుబాట్లేల జేయుదురు.
కాంతారత్నముల కష్టాబ్ధి నేలముంతురు. దూరదృష్టితో
తిలకించి యజ్ఞానమునుబాసి యాలోచించిన నీ యనా
చారముల నణగద్రొక్కక తప్పుడు ప్రపంచములో
నెంతమంది పడతులకు ప్రణయానందముపాడగుచున్నదో
యెందరు కురూపులకు శరీరముల స్వాధీనమొనర్చి కుళ్ళి
చచ్చుచున్నారో.

మనో:— అవును కనులార సుందర విలాసములను గాంచి మనసార ప్రేమించి, వరించిన భర్తతో గూడు ప్రణయ సౌఖ్యమే, పరమానందముగాని, పెద్దలమాటలకు బద్ధులై వృద్ధకురూపుల నంటగట్టుకొని బుద్ధితీరని ముద్దులను గొనుచు మొద్దులవలె కాపురములు చేయుట మహా నరకముగా కింకేమున్నది. అట్టివారు నాత్మలో వరించిన భర్తకొరకు పరువెత్తు లేచుంచిది.

మద:— బాగుగా పలికితివి పడతులబట్టి పనికి బూనకున్న నీ పాపకార్య పద్ధతు లడుగంటవు. ప్రణయసాగరమున నోలలాడరు. ప్రేమలోకమున విహరింపరు. బ్రహ్మానందమనుభవింపరనుచుండ మనోరమ విద్యుల్లత లు మనకుగదా యట్టి మహాభాగ్యమనుచు మదనమోహాస ని గాగలించుకొన జగమున నింతకన్న సౌఖ్యమే లేదనుచు మధనోద్రేకమందస్మితవదనారవిందులైై మదనమోహా నుడు మరింకేమియో జెప్పబోవుచుండ కాసాయ వస్త్రముసుగట్టి కమండలకరంబునందాల్చి భస్మధారణ మొనర్చిన భద్రాక్ష రుద్రాక్షులు ధరించిన తాపసి యొకండు వెనుక భాగమునుండి బిడ్డా! పొరబడుచుంటి వనుచు, ప్రత్యక్షముకాగా పడతులిరువురతో ప్రణమిల్లిన దీవించి కూర్చున్న తదుపరి యా తాపసి యిట్లు పలుక నారంభించెను.

బిడ్డా! మీ రెంతపొరబడుచున్నారు. శునకముమ సింహ మనియు, సెలుక నేనుగనియు భ్రమించు టెంత యవివేకమో క్షణకాలసుఖమును శాశ్వతానందమని భావించుటంత యజ్ఞానము నక్కకు నామముబెట్టి నారాయణమూర్తియన్నట్లు పిచ్చిభ్రమకు ప్రేమయని బిరుదునిచ్చిరి. విజ్ఞానము నుపయోగించి భక్తిశ్రద్ధలతో బాగుగా వినుడు మీరనుకొనుచున్న మోహభ్రాంతి జనిత సుఖమునకు ప్రేమానందమనియు, పరమానందమనియు, బ్రహ్మానందమనియు పేరులిడుట మురుగునీటి గుంటను నిర్మలజలపూరిత కాసారమన్నట్లుండును. అది కొద్ది

కాలమున వృద్ధిక్షయములుగల్గు కామేచ్ఛ, ఈ కామేచ్ఛ మానవుని శతవత్సరాయుష్య పరిమితిలో బాలకౌమారజరావస్థల మూటియందు గాన్పింపదు. ఒక్క యౌవనావస్థయందే యిది పువ్వువలె వికసించి యస్థిరానందమును గలుగజేసి వాడిపత్రియై పోవును. ఆహారమాతేమి యధికభయోత్పాతచింతావేశ సుషుమ్నావస్థరోగగ్రస్తాది సమయములందు దానికి నిలుచుటకు స్థలముదొరకదు నిత్యవ్యాపారముగా సాగించునిద్రకు అప్పు డప్పుడు సంభవించు నారోగ్యాధిక శ్రమలకుపోను మిగులు కాలమెంతయో గమనింపుడు.

మరియు, బిడ్డలమీదిప్రేమ ముదయించినకొలది భార్యా భర్తల మోహమంతరించుచుండును. కామోద్రేక గాఢాలింగన పరవశత్వమందైనను బిడ్డల రోదనమువిన్నచో భార్యాభర్తలు భరించియుండలేరు, భర్తకౌగిలిని పోద్రోసి బాలబాలికలకడకు పరువెత్తుట సహజము అప్పుడు కామినీకాముకులకామ మెక్కువైనదియో, బిడ్డలమీదిప్రేమ మెక్కువైనదియో మీరే యూహించుడు. వయస్సులోనున్నప్పుడు మిహాచ్ఛవర్ణనా తీతమైదోచును వయస్సుడిగినదది వల్లకాటి స్థలముగామారును. వయఃకాలములబట్టి వధూవరుల కామమోహములకు జననమరణ ములు సమకూరుచుండును. శరీరమే శాశ్వతమైనది కాదు అందు క్షణభంగురములగు కామమోహములకు ప్రేమ యను పేరిడి బ్రహ్మానందమునకు బోల్చుట పరిహాసాస్పదము స్వల్పకాల ముతోగూడిన యీ సంతోషానందము సర్వకాలసంతోష సహితచలనరహిత సౌఖ్యభరితమోక్షఫలితమై నాశమొందనిదైన బ్రహ్మానందమునకుసమమనుటపడియలోనున్న మండూకముపారా వారమున కిది సమమన్నట్లుండును. ఆనందమునకు బ్రహ్మానంద మునకుగల తారతమ్యము వర్షబిందువునకు వార్నిధిలోని జలమున కున్న పరిమాణవ్యత్యాసముకంటె చాలా రెట్లధిక మనుట సమంజసమేమో.

మరియు సంసారదూరులైన సన్యాసిముండకొడుకులు బుద్ధికి దోచినట్లు పురాణములనువ్రాసిరనియు కుమతులచే కల్పింపబడిన

గ్రుడ్డిశాస్త్రములనియు, ఆడవారి నన్యాయమొనర్చుటకే యట్టి గ్రంథముల సృజించిరనియు దూరాలోచనచేయక దుడుకు తనమున దూషించుచున్నారు. అది చాల పొరబాటు, కామాంధులైన మీ కన్నులకట్లు గాన్పించుచున్నది. కామ మనునదియే గ్రుడ్డిది. దానికి మన్ననమర్యాదమంచిచెడ్డ సిగ్గు భయలజ్జాదులెవ్వియు తెలియవు అది చెలరేగిన చేయరాని పనులను చేయించును. పడరాని బాధల పాలుచేయును. చెప్పరాని యవమానంబుల చేకూర్చును. అనరానిమాటల నాడించును. కామమనునది హృదయసీమ సరసగుణ తరువులను దహించు దావానజ్వాల మీబోటి కామినీకాముకుల హృదయాంబరమునకు గ్రమ్ముకొను కారుమబ్బు.

అవివాహితులైనవారు స్వయముగా వరించిన సంతోష మనుభవింపవచ్చునని పలికితిరి. ప్రేమించినవారినే పెండ్లి యాడవలెనంటిరి. ఆప్రేమ దేనినిజూచి గలుగును. గుణగత ముల దెలియుట కవిగోప్యమైయుండును. కన్నులకు ప్రత్యక్ష మగునది కాయముయొక్క సౌందర్యమేకదా. చక్కదనమును జూచి ప్రేమించుటయే జరుగవలెనా అందమునుజూచి వివాహ మాడిన వెనుక నా సుందరాంగి యితరులతో సరసమాడిన విభునకు విరక్తిగలిగి విడనాడుట తటస్థించుచున్నదికదా. అట్టి సమయమున తాను ప్రేమించిన యందముపోయినదా. ముందు కోరినయందముండగా విడచిపెట్టుట కేమిహేతువు. పోనిమ్ము సుగుణములగని మగలను వరింతురా సద్గుణరాసులను కురూపు లను నంటగట్టి కోమలాంగుల గొంతులు గోయుచున్నారని యిదివరకే యనుచుంటిరిగదా సద్గుణముల ఖనిరైన చక్కద నములేకున్న యెట్లు ప్రేమింతురు.

ఒకవేళ సద్గుణలావణ్యములు రెంటి నీక్షించి ప్రేమించి ప్రేమించెదరా. అట్లే కాంక్షించి పరిణయ మాడిన యతివ భర్త షండుడని దెలిసికొన్నప్పుడుగూడ సంతోషముండునా. అంతవరకు ప్రేమించిన యందచందములున్నవిగదా సంతసమేల యంతరింపవలెను.

అట్లుగాకున్న సుగుణ యౌవనసౌందర్యములజూచి ప్రేమిం
తురా అటులను కొన్నను వంశపరంపరవచ్చు భయంకరవ్యాధి
వానిని భాధింపక తప్పదని తెలియవచ్చినప్పుడు అప్పటివరకు
గలుగు ప్రేమ మంతరింపదా.

ఒకరు ప్రేమించిన రెండవవారు ప్రేమింపని పక్షమున
ప్రయోజనముండునా? అందువలన ప్రేమించినది ప్రేమనా?
అట్లనుకొనిన ప్రేమించినవారినెల్ల ప్రేమింతురా?

సతీపతులు ప్రేమించునది శరీరమునా? మనస్సునా?
సౌందర్యము శరీరమున గలుగును. సుగుణములు మనస్సునందు
జనించును. శరీరమును ప్రేమించెదనన్న సుగుణములతో పని
లేదు. మనస్సును కామింతునన్న సౌందర్యముతో సంబంధము
లేదు. అప్పుడు రెంటిని ప్రేమించవలెనా?

మనస్సు సంకల్పించును దానిని శరీరముచేయును. మనస్సు
సంకల్పింపకయే శరీరముచే చేయించునదియు మనస్సెక్కడనో
నిలచియుండ మానవ భాషల వినుచున్నట్లు భ్రమింపజేయునది
యుపైన మూడవ దింకొకటియున్నది. అదెద్దియన ఇతరులెదో
యొక కధచెప్పుచున్నప్పుడు వాక్యము పూర్ణమైనపుడే ఊ
కొట్టుచుందుము కధచెప్పువాతడు మనము వినుచున్నామనియే
దలంచును. కాని మేము పరధ్యానముతో నీ పలుకులు విన
లేదు. మా మనస్సొక యాలోచనలో మునింగినది మరల చెప్పు
మనుట మన కెల్లర కపుడపుడు జరుగుచున్న సంగతియే. అప్పటి
వరకెక్కడనూ కొట్టుటకు విరామస్థలముండునో యక్కడనే
సరిగా నూకొట్టుచుందుము. కొన్ని దీర్ఘసమాసములు కొన్ని
కులుచపదములుండునుగదా పరధ్యానముతోనున్న మనకు
పూర్తివాక్యముల గుర్తెట్లు తెలియుచున్నది. మనస్సునకు
దెలియకనే కొన్ని పనులు జరిగియుచుండుట సహజము. మరియు
మనస్సును నదియొక దానిని చూచుటకు సంకల్పించునుగాని
చూచుచున్నపుడు కంటినికాపాడు రెప్పలార్పుటకు సంకల్పిం
పదు. ఒక స్థలమున కరుగవలెనని సంకల్పించునుగాని పాదము
పైకెత్తవలెననియు భూమిపై బెట్టవలెననియు ప్రతియడుగునకు

సంకల్పింపదు. అదియేమూఢవది. అది మనోదేహములమధ్య తెలియని ప్రకృతిలోన జనించుశక్తి అట్టి దానిని పోద్రోసిన ప్రేమకు భంగము వాటిల్లునేమో.

నాలుగవది యంతరాత్మయున్నది ఇంకను మీబోంట్లు దెలిసి కొనవలసిన వశేకము లీ పాంచభౌతిక శరీరమందుగలవు ఇక దేనిని మీరు ప్రేమించెదరు మంచి వధూవరులను సమకూర్చు కొనుట మానవప్రయత్నమున జరుగునా బాగుగా పండినదను కొన్న ఫలములో పురుగులున్నవేమో బుద్ధి కెట్లుదోచును, మీరనుకొనుచున్నప్రేమ యెక్కడ బుట్టునో యెప్పుడుదయిం చునో యెందులకు జనించునో యెంతకాలముండునో యెందణగి పోవునో యేమగునో యూహింపగలరా యౌవనకాలమున జవ్వాలయందు కామమోహము లు కాంక్షించిన వస్తువెద్దియో గనుంగొనుట సాధ్యమని గ్రహించుడు, అది దరిలేని సంసార వనధిలోముంచు కలుకు దంష్ట్రిలకరాళవదన మాయాదేవి దానిని జయించు తాపసులే శాశ్వతానందమైన బ్రహ్మనందమును బొంది జననమరణదుఃఖరహితులై యచలులై యుందురు.

సర్వగ్రంథములు సతులబాధించుటకే ఋషులు గల్పించితిరని యంటిరి. అవి యజ్ఞానజనిత వాక్యములు పుడమిలోని స్త్రీ పురుషులెల్లరు పురాణముల కట్టుబాట్ల ననుసరించి ప్రవర్తించిన కష్టనష్టములే యుండవనిగట్టిగా చెప్పవచ్చును. ఎట్లులనిన ముదితలను ముసుగులలో దాచవలెననియు ధనమున కాశించిన తనయలను ముసలివారికి ముడివెట్టుట ధర్మమనియు వేదశాస్త్ర పురాణాదులలో నెక్కడ వ్రాసియుండలేదు. మరియు కన్నెలను విక్రయించుట ఘోరపాపమనియు దానములకెల్ల నుత్తమమైనది కన్యాదానమనియు, అట్టి కన్యాదానము సద్గుణ సౌందర్యబలపరాక్రమారోగ్య ధనాదులచే ప్రకాశించు మంచి వంశములో జనించి సుజ్ఞానముగల యువకునకే చేయవలెననియు వ్రాసిరి. ఇట్లన్నియు శోధించి కన్యలకు కల్యాణమొనర్చిన కష్టనష్టములేలకలుగును. సిగ్గుచే తలవంచుకొనియుండు సుందరీ మణులకు స్వయముగా శోధించి వరించుటలు సాధ్యమగునా?

కాంతలను చక్కదన మొక్కటియేగదా గాన్పించును, ఇక పెద్దవారికన్ననో వరుని నివాసస్థలమునకుజేరి వానిని పలుకరించి భాషించి ప్రవర్తన నీక్షించి యిరుగుపొరుగువారిని విచారించి వంశపరంపరల మంచిచెడ్డలను గ్రహించి ధనధాన్యముల దిలకించి తెలివితేటలగమనించి యందచందములగాంచి యిష్టమైన వివాహములచేయుదురు తదుపరి గలుగు సుఖదుఃఖములను దైవనిర్ణయమని దలంచెదరు, దైవనిర్ణయమునకు మాద తల్లి దండ్రులే భాధ్యులు కావలయునా ? ప్రేమతో పెంచిన రాజ హంసను తామరతూండ్లజూపి నదిలోనికి విడిచిన కమలముల నారగించుటకు నాకలహంస త్వరితగతింబోయి సుడిగుండమున బడి చచ్చిన పెంచిన వాడా హంసను మృతినొందింపవలెనని విడచెనా, మరణింపవలెనని మరాళమాపోయెనా హంస నంత మొందించుటకే సుడిగుండము జనించెనా పద్మములకడకు బంపుట పెంచినవానిదా కమలములను భుజింపదలచిన కల హంసదా సహజముగా దిరుగుచున్న సుడిగుండముదా తప్పు ఇందెవరికే దురూహ్యములులేవు ఇదంతయు విధి కృతమని తలంచవలెను.

స్త్రీలకు స్వేచ్ఛావిహారము తగదని కట్టుబాటును గల్పించిరని యనుచుంటిరి. పురుషులుమాత్రే మిష్టము వచ్చినట్లుచరింపవచ్చు నని యెక్కడ వ్రాసియుండెను. వారికికట్టుబాటులంలేవా చేయ రాని పనులేమియో చేయదగిన పనులేమియో యే సమయమున నెట్లు ప్రవర్తింపవలెనో దేశకాలప్రకృతులనుబట్టి తెలియజేయు నవియే ధర్మశాస్త్రములనబడును. అట్టిధర్మముల ననుసరించి నడచుకొనిన పుణ్యమనియు, వానిని ధిక్కరించువారికి పాప మనియు, పాపపుణ్యముల ఫలితము పరలోకమున గలుగుననియు బహుగ్రంథ లిఖితమై గాన్పించుచుండెను. గాని పురుషులకు బుద్ధిపుట్టిన పరులను బాధింపవచ్చునా జారచోరత్వములుసలుప వచ్చునా అసత్యమాడవచ్చునా ? హత్యలు చేయవచ్చునా ? ఇట్లు చేయరాని పను లింకెన్నియున్నవి.

అట్లయిన ప్రపంచమున చేయదగిన పనులన్నిటిలోనైనను

స్త్రీ పురుషులకు సమానత్వ ముండవలసా యుందరు ఆదిసృష్టి లోననే స్త్రీ పురుషులకు శరీరావయవ భేధములున్నవికదా. భార్య పెత్తనము వహించి వరుని వంటచేయుమనిన నిలకడ మీదనైన నేర్చుకొందురుగాని గర్భమునుధరించి బిడ్డల గనుమని బాలబాలికలకు పాలొసంగమనిన పురుషులకు సాధ్యమగు పను లేనా యివి.

పోనిమ్ము స్త్రీలు మాత్రమే పెత్తనముచేయవలెనన్న నందరు సమానమైనపుడు పురుషులు మాత్ర మపుడీ ప్రశ్నలనువేయరా? అవుడెట్లాచరింపవలెను. స్త్రీపురుషులందరి నేకముజేసి యీ పనులను భాగింపవలెనా? అట్లయిన నేదేశములో నేగ్రామము ననే యింటియందే స్త్రీ పురుషులు పెత్తనము నహింపవలెను. ఏ స్త్రీపురుషులు వంటచేయవలెను. ఎవరు నిర్ణయింతురు. లేక కోరినరీతిగా స్త్రీ పురుషులకు పనులను చేకూర్చవలెనా? అందరికీ రాజ్యమేలవలెననియే యుండును. బంటుగానుండు నది యెవ్వరు? అందరకు బంగరునుయ్యాలలం దూగవలెననియే యుండును. భూమిని దున్నువారెవ్వరు? శిక్షించువా రంద రైన శిక్షకు పాత్రులెవ్వరు?

మరియు మీరు ధర్మశాస్త్రములనే తలక్రిందులు చేయు చున్నారు. పాపపుణ్య పరలోకములున్నవా? వానికి ఫలిత మున్నదా? యని మీ సందేహము. అది యెట్లు తీరును?

ఒకడు నరలోకమున్నదనును. మరియొకడు లేదనును. వారిరువురు దానిని చూడలేదు. లేనిదాని నెట్లుజూతునని రెండవవాడనును. చూడనిదే యెట్లు గన్పించునని మొదటి వాడనును. 2. నీవు చూచితివాయనును. 1. నీవు చూడలేదు గనుక నీకు తాతలేడనును. 2. తాతలేక మాతండ్రి యెట్లు జనించెననను. 1. మొదట ప్రపంచమునకు మనుష్యులెట్లు బుట్టి రనును. 2. అప్పుడు మానవుడు కోతికిబుట్టెననును. 1. ఇప్పుడు మీతండ్రి కుక్కకు బుట్టెననును. 2. తాతయున్నట్లు మాతండ్రి చెప్పగా తెలిసికొంటిననును. 1. నరకలోకమున్నదని పురాణ ములలో నుండగా గ్రహించితిననును. 2. అవి వట్టిరాతలు

నేను నోటిమాటలను వింటిననును. 1. మాటలను మార్చ వచ్చును. వ్రాతలను మార్చుటకు చేతగాదు గనుక నోటిమాట కన్న వ్రాతలనే నమ్మవలయునని వసుధాస్థలియం దిప్పుడు వాడుకలోనున్నదనును. 2. అట్టిలోక మెచ్చుట నున్నదనును. 1. భూమండలమున కావలనున్నదనును, 2. చూచివత్తును వచ్చెదవాయనును. 1. చచ్చిన తదుపరి యట్లే పోవుదమనును.

ఇందెవనిమాటలు సమంజసము, వానిని నిర్ణయించుటకు మరల వాగ్వాదము లేజరుగును. ఆస్తికులు మొదటి వాని వాక్యముల నంగీకరింతురు. నాస్తికులు రెండవవాని పలుక్కులే న్యాయసమ్మతమందురు.

నాస్తికమన నేమి, ఆస్తికమన నేమి, నాస్తియనగా లేదని యర్థము. యేమిలేదు, అన్ని లేవనువారే నాస్తికులు, వారికి పాపములేదు, పుణ్యములేదు, దేవుడులేడు, సుఖములేదు, దుఃఖములేదు, చింతలేదు, సంతోషములేదు, గుణములులేవు, కోర్కులులేవు, భార్యలేదు, బిడ్డలులేరు, జననములేదు, మరణములేదు, సూర్యుడులేడు, చంద్రుడులేడు, ప్రకృతిలేదు, వికృతిలేదు, ప్రపంచమేలేదు, అంతయునాస్తి, నోటితో మాట్లాడినంతనే కన్నులకగుపడుచున్నవాని నెట్లు లేవందుము. కన్నులకుకూడ గాన్పించకపోవలెను అదెట్లు తెల్లనిగోడపై నల్లనిచుక్కనిడి చూడగా చూడగా నలుపు తెలుపునగలయు నట్లు దృష్టినిలిపిచూడ ప్రకృతి జనితములన్ని బట్టబయలులో లయమై సర్వమేమిలేక ప్రపంచము మిధ్యగా గాన్పించినప్పుడే నాతడు నిజమైన నాస్తికుడగును.

కన్నులకు గన్పడుచుండగానే యున్నవానిని వాక్కుతో మాత్రము లేవనునాతడు నిక్కము దెలియని టక్కరినాస్తికుడు.

ఇక యాస్తికుడనగా తల్లితండ్రి గురుదైవమాది ప్రపంచము లోని సర్వచరాచరము లన్ని యున్నవని తలచి సద్గురు దరిజేరి వేదశాస్త్రపురాణేతి హాసముల కావలిదైన వేదాంతబోధలను విని సాధువై సత్యమా బట్టబయలున పరంజ్యోతిలో లీనమా నాతడే నిజమైన యాస్తికుడు అప్పుడా స్తికనాస్తికము లొక్క

టిరియే యగును.

అప్పుడు వాగ్వాదములు లేవు. కోపతాపములు లేవు. కష్టనష్టములు లేవు. సద్గుణములు లేవు. శోకభయములు లేవు. చావు లేదు. పుట్టుక లేదు. సర్వమొక్కటిరియే.

పెద్దలు పెండ్లిచేసిన వరుడు కురూపుడైన వదలిపెట్టవలె నంటిరి. స్వయముగా సౌందర్యమును దిలకించి సంతోషమున పెండ్లియాడిన వెనుక మశూచిక మేహవ్రణాదులచేతనో అన్ని ప్రమాదము సంభవించిరియో యట్టి సుందరమంతరించినప్పుడేమి చేయవలెను.

అదియుగాక కురూపిరైయైనకన్య కురూపినే కోరుకొనునా? మంచిభర్త దొరుకవలెనని మదిలో కోర్కెలుబుట్టదా? బీద వానికి లభించిన మేడలలో వసింప నిష్టపడదా? తనశక్తి తెలిసికొని వరుని కోరుకొనునా? అప్పుడు తనకున్న దానితో తృప్తిపడు తత్వముండవలసినదేకదా.

మరియు చక్కని భర్తనుచేసికొనిన కురూపుడైన కొడుకు బుట్టిన వానికి భార్య యక్కరలేదా? చక్కదనములేదని భర్తనువదలిన కురూపుడైన కొడుకు నేమిచేయవలెను. పేద వానికిచ్చి నన్ను పెండ్లిచేసిన దెందుకని కోపించుజవ్వనిని నీవు పేదవారి కెందులకు బుట్టితివని యడుగ చెప్పగలవా?

నాయిష్టమెరుగక నిట్టి వివాహమెందులకు జేసితిరని యందురే ముందిష్టము తెలిసికొనియే కష్టజీవుల గర్భమున బుట్టించి నాడా భగవంతుడు పుట్టుక, మరణము, ధనము, సౌందర్యము, సుఖము, దుఃఖము, కష్టము, మనము తెచ్చుకొన్నవికావు. భగవంతుడిచ్చినవేయని భావింపవలయును.

సుద:— మానిచంద్రా! మాయాకల్పిత భ్రాంతులకు జిక్కి మోసపోవు మమ్ముద్ధరింపదలచి యేతెంచిన మహాత్ముడవని తలచెదను. మాకు కొన్ని సంశయము లుదయించుచున్నవి. వాని దెలియజేయ వేడుచున్నాడ. అవి యేవియన పూర్వకాలమున కొందరు స్వయముగా భర్తలను వరించినట్లును కొందరు పెద్దలయాజ్ఞలను మీరక పెండ్లియాడినట్లును, గ్రంథములలో

గానవచ్చుచున్నవి. ఇప్పుడు దేని ననుసరించుటు త్తమము.

ముని :— బిడ్డా ! ప్రస్తుతము, తల్లిదండ్రులు ధనాపేక్షాపరులై పురాణధర్మములను బూడిద పాలొనరించి, యక్రమ వివాహములనేకము జేయుచున్నారు గాన, వధూవరు లిష్టరీతిని వివాహమాడుట మంచిది అదృష్టముకొలది వారి కానందము చేకూరును.

మద :— అదృష్టమనునది యొకటున్నదా.

ముని :— లేకేమి, ప్రస్తుతము కొందరు తెలివి తేటలవలన ధనముకూడినదనియు, ధనము నశించిన నాతని తెలివి తక్కువయనియు, ప్రజలు వాడుకగా పలుకుచుందురు. అది యసత్యము ఒకరికి యప్రయత్నముగా నితరులా స్తి సంక్రమించుచున్నది. దారినబోవు నపుడొకనికి ధనము దొరుకుచున్నది. అందువారి తెలివికాధిక్యమేమున్నది. మరియు నొకరికిమంచి చేయబోయిన చెడుసమకూరు చున్నది. సహాయముచేయబోయిన విరోధము వచ్చు చున్నది. అట్టివన్నియు దైవప్రయత్నములు దైవసంకల్ప ములనే యదృష్టములందురు.

మద:—స్వర్గనరకములున్నవా? అందు సుఖదుఃఖములుకలుగునా?

ముని:— ప్రస్తుతము ప్రజలలో చాలామందిట్టి ప్రశ్నలనే వేయుచుందురు. ఉన్నవోలేవో వానితో మనకేమి యున్న పాపకార్యములుచేసిన పరలోకమున బాధలు కలుగునుగదా యందురు. అట్లనుకొనిన పాపమునే చేయకుండ నుండరాదా? పరలోకములేకున్న పాప కార్యము లాచరింపవలెనని యీ మీ యభిప్రాయము.

మద:— మహాత్మా ! అందులకుగాదు. యున్నవనికొందరు, లేవనికొందరు, వాదించుకొనుచున్నారు. తెలియకజేసిని కలుషమునకుగూడ పరలోకమున బాధలుకలుగునా? లేదా ?

ముని:— ఉన్నవనువారికి వేదశాస్త్రపురాణము లాధారములు. దైవప్రార్థనలవలన సర్వపాపములు నశించునని పురాణ ములు బోధించుచున్నవిగదా.

ఒకడా మార్గమున నుండ్లున్నవని చెప్పును. వేరొకడు లేవనును. ప్రయాణమొనర్చునాతడు ఇరువుర వాక్యములలో సత్యాసత్యములనుగురించి శ్రమవహించుటకన్న పాదరక్షలు ధరించి ప్రయాణమొనర్చిన కంటకములున్నయెడల గ్రుచ్చుకొన కుండును. లేకున్న పాదరక్షలవలన బాధలేదు. అటులనే దైవప్రార్థనవలన మీకేమి తరుగువడును.

మద:— పతిభక్తిచే పాపములు మానవులుగామారి ప్రాణకాంతలను సంతోషముగూర్చినట్లు బూటకపుకధలు కొన్ని పురాణాదులలో వ్రాసిరి. ఇప్పడెందులకు జరుగగూడదని ప్రజలలో కొందరు పరిపించుచున్నారు. అట్లెందులకు వ్రాసిరి.

ముని:— తనమాటలను దాచిపెట్టి యితరులమాటలను విమర్శించు వారిట్టి భావములనే వెదకుచుందురు. మనుష్య సృష్టికి మొదలు వానరములు మానవునిగామారినవను ప్రస్తుత ప్రకృతి శాస్త్రజ్ఞుల పలుకులను వారు విశ్వసించుచున్నారుకదా. ఇప్పుడట్లెందులకు జరుగుటలేదు.

మద:—అప్పటికిప్పటికి వాతావరణ భేదమున్నదని వారందరు.

ముని:— కాలభేదమున్నదని గ్రహించుచునే యీ పిచ్చిపిచ్చి ప్రశ్నలువేయుట పరిహాసముగాదా?

మద:— వేదశాస్త్ర పురాణాదులలోని కొన్ని భాగముల నవసరములని దోచుచున్నవి. అట్టివానివల్ల నక్కడక్కడ ప్రాణులకు కష్టనష్టములు గలుగుచున్నట్లును, సర్వభూతదయాళుత్వము నశించిపోవుచు, భేదభావములు వృద్ధియై వాదవైరములు గలుగుచున్నవి. అట్టివానిలో తమయభిప్రాయమేమి.

ముని:— దేశకాలములనుబట్టి ధర్మములు మారుచుండును. వేదశాస్త్రపురాణములన్నియు నిహలోకమున ప్రజల బ్రతుకు తెరువులకు ప్రమాణములైయున్నవి. అట్టి గ్రంథములన్నియు యనుభవ వేద్యులైన పరమయోగీంద్రుల భావపరంపరలు. అందులోని కొన్ని భాగముల న్యాయములని దోచుట కనేక కారణములున్నవి.

ఏ ధర్మములనే సమయమున నెక్కడ వసించి యెవరు నిర్ణయించిరో యట్టిదేశమున కవసరమైయుండును బూతులుగా దోచుపలుకుల భావము నీతియగుచున్నది. నీతులని యెంచు వాక్యార్థము బూతులగుచున్నవి రోగబాధను సూచించుట పరులకోరికలను సమ్మతించుట క్రోధము గన్పరచుట అయిష్టతను దెలుపుట మొదలైన వనేకములు నాత్మధ్వని భేదమున గూడి మనుష్యుని యొక మూర్ధమందే గలుగుచున్నవి అట్లే యట్టి భాగముల యంతరార్థమును దెలియక యనవసరములుగా దోచుచుండవచ్చును ముందునకు జూచుచున్న వీపువెనుక నేమి జరుగుచున్నదో గ్రహించలేని మనము అంతయు దెలిసినటులనుకొనుట సమంజసముకాదు. ఆలోచించి చూడగా నందును మంచి యుండునేమో.

మరియు స్వలాభమునకై పరుల మోసగించు దురితహృదయులు కొందరు వారి యవసరములకొఱకు నక్కడక్కడ విజ్ఞులకు వ్యతిరేకమైన వింత ధర్మములను గల్పించి వివిధరీతుల వ్రాసి యెరుగనివారివలె మరుగుగా నుంచిన కాలచక్రము తిరిగెడు కొలది పురాణాదులలో పూర్తిగా కలసిపోయెను. ఇట్టి కారణములలో నే కారణముచేతనైన ననవసరమని కనుపించవచ్చును అట్టి భాగముల నాధారముచేసికొని, యెలుకకొరకింటినిగాల్చునట్లు సద్గ్రంథములనెల్ల సత్యదూరములనుట సక్రమమగునా పుడమిలో నరులుచేయు తప్పులను పురాణములకు నంటగట్టిన నేమిప్రయోజనము అక్కడక్కడ గన్పించిన తప్పుత్రోవలద్రొక్కక, సక్రమమార్గములనే సంచరింపరాదా

మయూరములు నీడను గలుగజేయుచుండెను. అది జూచి నే
నాశ్చర్యమానసుడనై ముందున కడుగిడ ముదుసలి తనమున
లేవలేనిస్థితిలో నున్న సింహములకు మత్తగజంబులు తమ
కరంబుల నూతగానిచ్చి సాయపడుట జూచితిని. వేఱొక
దిక్కున శార్దూల శాబకములతో లేడిపిల్లలు చెర్లాటము లాడు
చుండెను. మరియొకదెస మార్జాలము చుట్టుమూగి మూషిక
ములు గంతులిడుచుండెను. ఇంకొకదరి చిలుకలు మంచి
ఫలంబులదెచ్చి శునకజాలము కొసంగి చిత్రపుపలుకులు బలుకు
చుండెను. అట్టి శత్రుత్వ రహిత స్థలంబునం దొక్కచో
నిర్మల జలపూరితమైన నదియొకటి ప్రవహించుచుండగా నందు
శరభసింహ శార్దూల శశకపిభల్లుక గోమాయు గోపుచ్ఛ
కురంగధేను కాగణంబు లొక్కరేవుననే పానీయంబులుగ్రోలు
చుండుట గాంచితిని. అది దేవలోకమేమోనని భ్రమించితిని
అందుమాత్ర మిట్టివిధముగా నఖిలప్రాణుల కైకమత్యముండునా
యని సందియము గలిగి యిందేదో మహాత్మ్యమున్నదని నిర్భయు
డనై ముందునకు నడచితిని.

ఇట్లు కొంచెము దూరమునకేగగా నా నదీతీరంబున నానా
విధ పుష్పశోభితంబైన తరులమధ్య పారిజాతమూలంబున
భస్మధారణంబొనర్చి రుద్రాక్షభద్రాక్షలు గళంబునం దలర
కాషాయవస్త్రంబులం ధరించి కమండలయోగదండములు చెంత
నుండ శిరోజములు జడకట్టి వ్రేళ్ళ నఖంబులువృద్ధియై వంకరలు
తిరిగియుండ కృష్ణాజనంబుపై పద్మాసనసహితుడై భ్రూమధ్య
స్థానంబునదృష్టినిలిపి భగవంతుని ప్రార్థించు యోగిపుంగవుని
జూచితిని. ఆ తాపసి తపోమహిమంబుచేతనే సర్వజీవులకు
నఖ్యతసమకూరి సోదరప్రేమతోనున్నవని చక్కగా గ్రహింప
గలిగితిని అంతనేనామానితిలకు సమీపించి యెదురుగా
కూర్చుండ నపరాహ్ణవేళ నతిక్రమించిన వెనుక జపంబునుమాని
కన్నులుదెరచి నన్నుగాంచ, నేను వినయవిధేయుండనై వారి
పాదములపైబడి సాష్టాంగదండప్రణామంబు లాచరించితిని,
అప్పుడా మౌనిచంద్రుడు నన్ను దగ్గఱకురమ్మని పాషాణ.

ఘాతముచే రక్తముగారుచున్న నా శిరముపై హస్తమునిడి తుడువగా గాయము మాయమయ్యెను. అంత నా యోగి నా చరిత్రనంతయు చెప్పకయే తెలిసికొని నీకేమి కావలయునని యడిగెను. ఎప్పుడైతే వారిహస్తము నామస్తకముపై తగిలెనో నాకు రాజ్యకాంక్షయు మీమీద ప్రేమయు మొదలైనవన్నియు నశించి మోక్షార్థినై వారి పాదంబులపైబడి ప్రార్థించితిని, నా భక్తికి సంతసించి దయాంతరంగుడై వరుసగా తారక సాంఖ్యామనస్కంబుల బోధించి, హస్తమస్తక సంయోగంబు గావించి పరిపూర్ణంబైన ద్వాదశాక్షరిమంత్రార్థం బెరింగించిన విశ్వమయుని గుర్తెరింగి దర్శించితిని అంత నా మానిచంద్రుడు దీవించిపంప, కామమోహబంధములకుజిక్కి ప్రేమయే ప్రపంచ మయమని మా యా సంసారసాగరమునుండి దరిజేరలేక పరిపరి విధులభ్రమలకులోనైయున్న మీకు సత్యమును దెలుపవచ్చితినన వారు మువ్వురు సంతోషస్వాంతులై భక్తిశ్రద్ధలతో పాదములకు నమస్కరింప ధర్మపాలునిచే దీవెనలంబొందిన తదుపరి మదనమోహనుడు.

నాన్నగారు ! భగవంతునిలో మనమున్నామనియు, మనలో భగవంతుడున్నాడనియు, భగవంతుడే పరంజ్యోతియనియు చెప్పుచుంటిరి. పరంజ్యోతి యిదియని మా భావంబులకు దోచుటలేదు మాకు తెలియజేయు మనధర్మపాలుడు ఇట్లనెను.

భగవంతుడవాఙ్మానసగోచరుడు, రూప నామ క్రియా రహితుడు పేరులేనివానికి అనంతకోటి నామంబు లేర్పరచి ప్రార్థించుచుంటిమి పరంజ్యోతి యనుటకూడ గుర్తుకొఱకు మానవకల్పిత నామమనియే యూహింపనగును. పృథివ్యాపస్తే జోవాయురాకాశములు దేనియందు జనించెనో యెండని, తడుపని, విరుగని, తఱుగని, పెరుగని, కరుగని, అరుగని, చావని, పుట్టని, యచలమైన దేదియో సర్వచరాచరములు జనియించి సమయించు నదెక్కడో అండపిండ బ్రహ్మాండలోకముల నిండి యున్న దేదియో, ఆదియంతములేక నన్నికాలములందు బట్టి

బయలై పరిపూర్ణమైన దేదియో సత్యమై నిత్యమై స్వయం ప్రకాశమైన దేదియో అదియే.

## "పరంజ్యోతి"

చదువరులారా ! తదుపరి మనోరమ, విద్యుల్లత, మదన మోహనులేమైరి. తుషారాద్రి గుహాయందు తాపసవర్యుని చెంతజేరి ధర్మపాలుడేమయ్యెనో, ధర్మపాలుని దయకు పాత్రులైనవారు నల్గేరైరి.

నమస్కారము.

ఇక సెలవు.



సమాప్తము.